# అపరాధ పరిశోధన

రు. 5·50 జూన్ '84

సప్లిమెంట్ 126



అపరాధ పరిశోధన అనుబంధం—126

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నెత్తురు చిమ్మిన నెచ్చెలి

రచన: చంద్రశేఖర అజాద్

## నాలుగు హత్యలు

రచన: బొమ్మిడి అచ్చారావు

## అందమైన యువతి

రచన: టెంపోరావ్

## పోస్టు బాక్స్

రచన: బి. రాజేశ్వరి

కళ్యాణ దుర్గం - ఏడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—126
జూన్, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. ఏ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# నెత్తురు చిమ్మిన నెచ్చెలి!

## చంద్రశేఖర అజాద్

తెల్లవారగట్ల నాలుగు గంటలు దాటింది.

చలికాలం. జనం అంతా ఇంకా ముసుగులు బిగించే వున్నారు, చలికి వణుకుతూ వెచ్చదనంకోసం ఆరాటపడుతూ. పొగ మంచంతా కేంద్రీకరించబడి వుంది. యెదురుగా ఎవరు ఉన్నారో కళ్ళు చించుకున్నా కనపడటంలేదు, ఆ సమయంలో....

విశాలమైన ఆ ప్లే గ్రౌండ్‌లో ఓ వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతని వంటికి బిగుతుగా నిక్కర్ వుంది. దానిపైన బనీన్ వుంది. చేతిలో ములుకర్ర. సాధన మొదలయింది. మంచును చీల్చుకుంటూ, గాలిని కోస్తూ చేతిలో కర్ర తిరుగుతోంది. కొంచెంసేపు ఆగాడు. ఇప్పుడతని చేతిలో రెండు కర్రలున్నాయి. విన్యాసం మొదలయింది.

వ్రేళ్ళనడుమనుండి జారిపోతూ, రకరకాల వంపులు తిరుగుతోంది. వందమందికి జవాబు చెప్పగల అత్యద్భుత ఫీట్ అది. గాలిని చీల్చుకుంటూ అవి చేస్తున్న శబ్దాలు

విచిత్రంగా వున్నాయ్. అలా అరగంట సాగింది. క్రమక్రమంగా మంచు కరిగిపోతోంది. వెలుగు రేఖలు సన్నగా చాలా సన్నగా చొరబడటానికి ప్రయత్నం చేస్తున్నాయ్.

అతను కర్రల్ని ప్రక్కన పడేశాడు. గ్రౌండ్ చుట్టూ రౌండ్స్ ప్రారంభించాడు. పరిగెత్తుతున్నాడు. మంచు బిందువులు శరీరంమీద యేర్పడుతున్నాయ్. మంచును చీల్చుకుంటూ పరిగెత్తుతున్నాడు. ఓ రౌండ్ అయింది. అదే వేగంతో తిరిగి రెండో రౌండు మొదలయింది.

"ధన్" మంటూ దేన్నో కొట్టుకున్నాడు.

అతను ఒక్క క్షణం బిత్తరపోయాడు.

ఎదురుగా యెవరో "ధబ్"మంటూ పడిన శబ్దం వచ్చింది. అతను వెళ్ళి క్రిందపడ్డ వ్యక్తిని లేవదీయబోయాడు.

"యూ" కోపంగా అర్చాడతను.

"యస్" అన్నాడతను.

"కళ్ళు కనపడటంలేదా" తిరిగి అరిచాడు.

"లేదు బ్రదర్" సమాధానం.

అతను లేస్తూ నుదురు తడుముకున్నాడు. నుదురు బొప్పెక్కింది. అతనికి గుండాగినంత పనయింది.

"నా మొహం వాచింది."

"చ్చొ....చ్చొ....చ్చొ...."

"చ్చొ....చ్చొ....చ్చొనా. నువ్వు మనిషివేనా?"

"చూడు బ్రదర్. నీకెలా కనిపిస్తున్నాను."

"లేకపోతే ఏమిటి? పొద్దున్నే తగిలావు."

"అయినా నీవు ఈ పరిగెత్తడాలెందుకు. ఇంటిదగ్గర గుంజీళ్ళు తీసుకోక" అన్నాడతను.

"యూ" పిడికిళ్ళు బిగించి రాబోయాడతను.

"ఛల్ బే."

గాలిని చీల్చుకుంటూ పరిగెత్తాడతను. వెంబడించ బోయిన అతను ఆగిపోయాడు. తల జివ్వున లాగుతోంది.

"డెవిల్" గొణుక్కున్నాడు.

అప్పటికి ఆరు రౌండ్లు పూర్తయ్యాయి. సూర్యుడు పైపైకి వస్తున్నాడు. అతడు అలానే పరిగెత్తుకుంటూ ఇంటికి వెళ్ళాడు, ఇంకా వ్యాయామం చేస్తూనే.

"అమ్మా" అంటూ అరిచాడు.

"వస్తున్నా" లోపలనుండి జవాబు.

వస్తూ ఓ డజను కోడిగ్రుడ్లు....అప్పుడే పితికిన పచ్చి పాలు ఓ చెంబుతో తెచ్చి అక్కడ వుంచి "కానియ్" అంటూ వెళ్ళిపోయింది. మరుక్షణం గ్రుడ్లు పగిలిపోయి పాలతో కలిసిపోయాయి. వాటిని త్రాగేసి త్రేన్చాడు.

రెండు బకెట్లనిండా స్నానానికి నీళ్ళు తయారుగా వుంచబడ్డాయ్. తృప్తిగా స్నానంచేశాడు. టవల్ తో తల తుడుచుకుంటూ వచ్చాడు.

ఇప్పుడతని రూపం మారిపోయింది. తెల్లటి పైజామా కుర్తా ధరించాడు. వెంట్రుకలు పాయలు పాయలుగా విడిపోయి అందంగా వున్నాయ్. అతను వెళ్ళి గిటార్ అందుకున్నాడు. అది చేతిలోనికి తీసుకున్నాక ఓసారి గుండెలకు అదుముకున్నాడు.

ఏవేవో జ్ఞాపకాలు!

చల్లటి పిల్లగాలి తెమ్మెర మృదువుగా స్పృశించు కుంటూ వెళ్ళింది. గాలికి రెపరెపలాడుతున్న వెంట్రుకలు మరింత అందంగా మొహాన్ని కప్పాయ్. గిటార్ అందుకొని స్ట్రింగ్స్ సవరించాడు. మెయిన్ స్ట్రింగ్ కదిలేసరికి వెలువడ్డ ధ్వనికి ఆ గదంతా ఒక్కసారి పులక

రించింది. అతనిలో భావావేశం వచ్చింది. గిటార్‌ను అప్రయత్నంగానే ప్లే చేయటం ప్రారంభించాడు.

"టెలిగ్రాం" వినపడింది.

గిటార్ ప్రక్కన పెట్టి కంగారుగా వెళ్ళాడు.

సంతకం పెట్టి తీసుకున్నాడు. చించాడు.

"విజయ్.... స్టార్ట్ ఇమ్మీడియెట్లీ.... సృజన్."

ఒక్కసారి ఆనందంతో బిగ్గరగా కేకేశాడు.

"అమ్మా, స్వీట్" అనరిచాడు.

అంటూనే పరుగెత్తుకెళ్ళి ఓ డబ్బాలో ఉన్న పంచదార లడ్డు అందుకొని, టెలిగ్రాం తెచ్చిన వ్యక్తి దగ్గరకు వెళ్ళాడు. అతను ఆశ్చర్యంగా నోరు తెరిచాడు. మరుక్షణం నోటినిండా లడ్డు కుక్కేశాడు విజయ్.

## 2

బ్యాగ్ సర్ది కూర్చున్నాడు విజయ్.

రైలు కదిలిపోతోంది. ఓసారి జేబులోనుండి లెటర్ అందుకొని చూశాడు. సృజన్ రాసిన లేఖ అది. చదువుకున్నాడు. ట్రైనింగ్ సెంటర్లో గడిపిన రోజులు గుర్తుకు వచ్చాయి. చిన్ని గుర్తుకొచ్చాడు. "లవ్‌లీ ఫెలో ఏం చేస్తున్నాడో?" అనుకున్నాడు. తాము ముగ్గురూ ప్రాణమిత్రులు.

బహుశా చిన్నికికూడా టెలిగ్రాం ఇచ్చి వుండవచ్చు ననుకున్నాడు. ట్రైన్‌లో పెద్దగా రష్‌లేదు. అయినా సన్నగా యేదో ధ్వని మొదలయింది. ఒక్కొక్కరే లేస్తూ ముందుకెళుతున్నారు. విజయ్‌కు అలా యెందుకు వెళుతున్నారో అర్థంకాలేదు. కొంచెంసేపు చూశాడు. తనూ లేచి ఆ వైపుకు వెళ్ళాడు.

లేవటరీకుండు కొంతమంది ప్రోగయి వున్నారు.

వాళ్ళంతా గుసగుసలాడుతున్నారు. ఒకాయన హడా వుడిగా వచ్చి తలుపు నెట్టాడు. రాలేదు. ఒక్క క్షణం అతని చేతులు పొట్టని నొక్కి పట్టాయ్.

కొన్ని పెదవులు మెల్లగా విచ్చుకున్నాయ్.

విజయ్‌కు అదేం అర్థంకాలేదు.

"లవ్ ఎట్ ఫోర్ట్ రేవ్రెట్రీ."

"ఫాంటాస్టిక్ లవ్."

"చీర్ లవర్స్ లివ్" అంటూ అరిగాడు ఓ వ్యక్తి.

ఎవరో ఏదో అన్నారు.

ఘొల్లున నవ్వారంతా.

"ఏది ఏమైనా గురూ, ఈ రోజు నాకో క్రొత్త ప్లేసు తెలిసింది. అయినా ఇంత కక్కుర్తా?"

"టిక్కెట్లు లేవేమో?"

"ఏమిటి బ్రదర్" విజయ్ కదిలించాడు.

"లోపల ఓ జంట వుంది సార్."

విజయ్‌కు నవ్వు వచ్చింది.

నవ్వుకుంటూ వెనక్కి తిరగబోయాడు.

అప్పుడు కనిపించారు.

నల్లటి తుమ్మ మొద్దులాంటి వ్యక్తులు ఇద్దరు జనాన్ని నెట్టుకుంటూ వస్తున్నారు.

విజయ్ భృకుటి ఒక్కసారిగా సందేహంతో ముడత పడింది.

ఆగిపోయాడు.

"హుట్ .... హుట్" అన్నారు.

అప్పటిదాకా నవ్వుతూ కబుర్లు చెప్పిన మగ్రాళ్ళు వాళ్ళను చూడగానే భయంగా ప్రక్కకు తప్పు కున్నారు. అందులో ఒకడు తలుపు గట్టిగా తడుతూ

అరిచాడు.

"మర్యాదగా తలుపు తీయండి"

"ఊహూ."

మరోసారి చరిచాడు.

తలుపు దడదడమంది.

"ఏంటి గురూ, సంగతి" అన్నాడు విజయ్.

"నీ కనవసరం జే!"

"ఎందుకయ్యా బాబు కోప్పడతావు" అన్నాడు విజయ్."

"మర్యాదగా వస్తారా, తలుపు తెరిచెయ్యమంటారా?" అరిచాడు.

"ఊరుకో స్వామి, తలుపు తెరిస్తే బాగుండదు. జనం ఇబ్బంది పడతారు. వాళ్ళే వస్తారులే" అన్నాడు విజయ్ తిరిగి.

"ఏంది జే వాగుతున్నావ్. చంపేస్తా" అంటూ బాడులోనుండి పదునైన కత్తి తీశాడతను.

అది చూడగానే జనమంతా భయంతో బిక్కచచ్చిపోయారు. మరుక్షణం ఆ ప్రదేశమంతా ఖాళీ అయింది.

"దీనికి కత్తెందుకులే గురూ" అన్నాడు విజయ్.

"షా" అంటూ అందులో ఒకడు పిడికిలి బిగించి తలుపును గుద్దాడు. తలుపు ముక్కలు ముక్కలుగా విరిగి పడిపోయింది. ఎదురుగా ఓ యువతీ యువకుడు నిలబడి వున్నారు. ఆ అమ్మాయి మరింత భయంగా ఆ యువకుడికి అతుక్కుపోయి వుంది. ఆ అమ్మాయి మెడనిండ నగలున్నాయి. ముహంలో కనిపిస్తున్న భయం మాటున అమాయకత్వం....స్వచ్ఛత స్పష్టంగా కనబడుతున్నాయి.

"బయటకురా" అరిచేడు తిరిగి.

"ఉహు" అందా అమ్మాయి.

"చంపేస్తా."

"చంపెయ్యి."

విజయ్ ఆ మాటలు విని చలించాడు.

"ఏమిటి గురూ!" అన్నాడు.

"మళ్ళీ మొదలా" అంటూ ఈ వైపుకు తిరిగాడు రౌడీ.

"నీ బాబుగాడి సొమ్మని తలుపు పగలగొట్టావా? నా కొడకా.... ఈ వాసనంతా ఏంటిరా?" అన్నాడు విజయ్.

"ఆ" అంటూ లిప్తపాటు ఆశ్చర్యపోయి వెంటనే కత్తితో పొడవబోయాడు.

కత్తి గాల్లోనే ఆగిపోయింది. అంతలోనే విసురుగా లేచిన విజయ్ చెయ్యి రౌడీ భుజంమీద పడింది. అంతే. చచ్చుబడిపోయినట్లు వ్రేలాడింది. అతను బాధగా కత్తిని వదిలేశాడు. కంగున మ్రోగింది క్రిందపడుతూనే.

ఫట్ మంటూ కడుపులో ఓ పంచ్.

"అబ్బా" అంటూ ఓ చేత్తో కడుపు పట్టుకు కూర్చున్నాడు. ఆసరికి రెండోవాడు ఛెయిన్ విసిరాడు. విజయ్ వీపుమీదపడి చర్మం లేచి వచ్చింది. అంతులేని ఆగ్రహం వచ్చేసింది. అమాంతం వాడ్ని అందుకొని పైకి లేపేశాడు. తలుపుకేసి విసిరికొట్టాడు.

అంతే! వాడు కొంచెంసేపు మాట్లాడలేకపోయాడు. బిర్ర బిగుసుకు పోయాడు. విజయ్ తాపీగా వెళ్ళి డోర్ తెరిచాడు. కడుపు పట్టుకొని కూలబడ్డవాణ్ని లేపి, ఓ తన్ను తన్నాడు. వాడు వేగంగా బయటకు విసిరి వేయబడ్డాడు.

రెండో వాడు తేరుకొంటున్నాడు. వాడిని లేపాడు. మరుక్షణం విసురుగా తాకింది కాలు. అంతే వందకిలో మీటర్ల వేగంతో అరున్నూ బయటపడ్డాడు.

ట్రైన్ సాగిపోతూనే వుంది.

ఆ జంట ఇంకా భయం భయంగానే చూస్తున్నారు.

"రండి" అన్నాడు విజయ్.

వాళ్ళిద్దరూ బయటకొచ్చారు.

"ఎవరు వాళ్ళు" అన్నాడు.

"మేం ప్రేమించుకున్నాం. ఈ అమ్మాయి మా ఊరి మోతుబరిగారి కూతురు. ఆ నాయనకు ఇష్టంలేదు. బలవంతంగా పెళ్ళిచేయబోతుంటే వచ్చేశాం" అన్నాడా యువకుడు.

"ఎక్కడకు వెళతారు?"

"పట్నం."

"ఎలా బ్రతుకుతారు?"

"బంగారం వుందిగా" అందా అమ్మాయి చటుక్కున.

"మరలా రాడీలొస్తే?"

"ఆ కళ్లు తిరిగి భయంగా చూశాయి.

"ఇంటికి వెళ్ళకూడదూ...." అన్నాడు తిరిగి.

"చచ్చినా సరే. కలిసే ఛస్తాం" దృఢంగా అన్నాడా యువకుడు.

విజయ్ ఆశ్చర్యపోయాడు.

"వెల్ బెస్టాఫ్ లక్" అంటూ వెనక్కు తిరిగాడు.

వెనకాల అంతా రక్తం. ఛెయిన్ దెబ్బకు చొక్కా చినిగి శరీరం తేచిపోయింది. ఆ అమ్మాయి కంగారుగా చేతిలోని కర్చీఫ్ అందించబోయింది.

"ఫర్వాలేదు" అంటూ బ్యాగ్ తెరిచాడు. ఫస్ట

ఎయిడ్ బాక్స్ అందుకున్నాడు. ఆ యువకుడు దూదితో రక్తం అంతా తుడిచాడు. టించర్‌తో అద్దాడు.

ఆ చోక్కా చేసే చించి కట్టుకట్టాడు. తిరిగి మరో షర్టు వేసుకొని సీటుకు ఆనుకుంటూ అన్నాడు.

"థాంక్యూ!"

రైలు సాగిపోతోంది.

వాళ్ళిద్దరూ విజయ్‌వంక కృతజ్ఞతతో చూశారు.

విజయ్‌కు మెల్లగా నిద్ర పట్టింది.

కంపార్టుమెంటంతా ఆశ్చర్యంగా ఆ విషయం గురించే మాట్లాడుకుంటున్నారు.

# 3

స్టేషన్‌లో ట్రైన్ ఆగింది. అంతకు ముందే విజయ్ లేచాడు. బ్యాగ్ అందుకుంటూ చూశాడు. ఆ జంట తన వంకే చూస్తున్నారు. మెల్లగా నవ్వాడు. ఆ అమ్మాయి మోచేత్తో అతన్ని పొడవటం విజయ్ గమనించాడు. ఆ యువకుడు ఇబ్బందిపడుతున్నాడు.

"ఏమిటి?" అంటూ తనే అడిగాడు.

"మీ పేరు?" నసిగాడు.

"అదా....విజయ్!"

బ్యాగ్ చేతిలోకి తీసుకున్నాడు.

"మరలా కలుసుకుందాం" అని దిగేశాడు.

నడుస్తూ అనుకున్నాడు. మరలా ఎక్కడ కలవగల మని తనన్నాడు. రైలుప్రయాణంలాంటి జీవితంలో అనేక మందిని కలుస్తుంటారు. తిరిగి వారందరినీ మరలా మరలా కలుసుకోవటం వీలవుతుందా?

అంతే! జీవితాల్లో అనేకరకాలైన అద్భుతాలు జరుగుతుంటాయి. అవన్నీ ముందే ఊహించలేకపోవచ్చు.

అందుకే మానవుడు తాననుకొంది ఎదురయినపుడు పొందే అనుభూతి రక రకాలుగా ఉంటుంది.

టికెట్ ఇచ్చి బయటకు వచ్చాడు విజయ్.

ఆ క్షణంలో రంయ్ మంటూ దూసుకొచ్చిందో కారు. హుందాపుడిగా అందులో నుండి దిగాడో వ్యక్తి.

విజయ్ నిలబడిపోయాడు.

కారులో నుండి దిగిన వ్యక్తి కళ్ళు ఆనందంగా ఆత్మీయంగా 'విజయ్'ను ఆసాంతం పరిశీలిస్తున్నాయ్.

విజయ్ ముందు కేరుకున్నాడు. నడిచి అతని దగ్గరకు చేరాడు.

"సుజీ!"

"విజయ్!"

సృజన్ నవ్వాడు.

"ప్రయాణం బాగా జరిగిందా?"

"ఆ."

"కాటిన్" అన్నాడు సృజన్.

విజయ్ చేతిలోని బ్యాగ్, సూట్ కేస్ డిక్కీలో చేరిపోయాయి. ఇద్దరూ కారులో కూర్చున్నారు. కారుకదిలింది.

"ఏమిటి సంగతులు?"

"ఏమున్నాయి."

"నీ దగ్గర నుండి లెటర్ వస్తుందనుకోలేదు."

సృజన్, విజయ్ వంకోసారి చూశాడు.

"ఏమిటిది?" షర్టుకు అంటిన రక్తపు మరకలు చూచి కంగారుగా అడిగాడు.

"ఓ... అదా రైల్లో చిన్న అడ్వెంచర్" అంటూ జరిగింది చెప్పాడు.

"అవునూ, చిన్ని వస్తున్నాడా?"

"అరెరే. చూశావా నిన్ను చూడగానే విషయం మర్చిపోయాను. చిన్ని రావాలి."

"ఏ ట్రైన్‌కు వస్తాడో?"

రోడ్డుమీద జనం అంతా విచిత్రంగా చూస్తున్నారు.

"చిన్నిని ఎలా రిసీవ్ చేసుకోవా లబ్బా" అంటున్నాడు సృజన్.

"ఇలాగే బ్రదర్!" గాల్లోంచి వినబడ్డాయి మాటలు.

ఈసారి నిర్ఘాంతపోయారు సృజన్, విజయ్‌లు.

ఆ కారుతో పాటు చిన్ని పరుగెత్తుకొస్తున్నాడు.

"ఓ....చిన్నా....స్టాప్" అరిచాడు సృజన్.

కారాగిపోయింది.

"యూ....సిల్లీ బాయ్. ఎంత సేపయింది వచ్చి?"

"మీ ఇద్దరూ ప్రపంచాన్ని మరిచిపోయినప్పుడు."

"గెటిన్."

చిన్ని కార్లోకి వచ్చి కూర్చున్నాడు. కారు కదిలింది.

"ఏం చేస్తున్నావ్?"

"ఏముంది? వాలీబాల్ టోర్నమెంటు జరుగుతుండగా నీ టెలిగ్రాం వచ్చింది. అంతే గో టూ హెల్ అంటూ పరిగెత్తుకొచ్చాను. తీరా చూస్తే స్టేషన్‌లో బండి లేదు. దానికోసం రన్నింగ్. ఇక్కడకొస్తే కళ్ళముందే మీరు బయలుదేరారు. తిరిగి రన్నింగ్. మొత్తంమీద నీ టెలిగ్రాంతో నన్ను పరిగెత్తించావ్" అన్నాడు చిన్ని.

"విజ్జి సాహసం చేశాట్ట ట్రైన్‌లో."

"ఈ మారి దక్కానులే."

"అందుకు కాదోయ్" అన్నాడు విజయ్.

"మరెందుకో చెప్పెయ్యకూడదా!"

"ఇద్దరు రౌడీల్ని బయటకు విసిరేశానోయ్."

"టిక్కెట్లు లేవా? అయినా ఆ పని నీది కాదుగా."

"ముందు మీరు చెప్పింది వినటం నేర్చువాలి!"

"ప్రొసీడ్."

"ఒకమ్మాయి, ఒకబ్బాయి ప్రేమించుకొచ్చారు. వాళ్ళమీదకు అమ్మాయి బాబు రౌడీల్ని పంపాడు. అంచేత వాళ్ళని రక్షించాను."

"బాగుంది."

"ఏం బాగులే ఫైయిన్ పెట్టి చీరేసాడొకడు. బంగారంలాంటి చొక్కా పోయింది."

"పోతే పోయిందిలే వెధవ చొక్కా. ప్రేమ ముందు సామ్రాజ్యాలే నాశనమయ్యాయి. ప్రేమే నేరమానా?" అన్నాడు చిన్ని.

"బాబు. పోయింది మీ చొక్కా కాదు. వాచింది నా వీపుకాదు."

"ఏమయితే ఏంగాని రుచి, వాస నెరుగని ప్రేమను సక్సెస్ చేశావు" అన్నాడు సృజన్.

విజయ్ నవ్వాడు.

కారు ఓ పెద్ద బంగళాలోనికి దూసుకుపోయింది.

## 4

రాబర్టుగారి నోట్లో పైపు ఉంది. పీలుస్తూ ఆలోచిస్తున్నాడాయన.

సృజన్ మిత్రులతో లోనికి ప్రవేశించాడు.

"సర్!"

"ఓ" నోట్లోంచి పైపు తీశాడు.

"దిసీజ్ మిస్టర్ విజయ్ అండ్ చిన్ని."

"నమస్కారం" ఒక్కసారే అంటూ ఇద్దరూ చేతులు జోడించారు.

రాబర్ట్స్ తల పంకించారు.

"బీ సీటెడ్."

అందరూ కూర్చున్నారు. విజయ్....చిన్ని నేలవంక చూస్తుండిపోయారు. రాబర్ట్స్ వారిని నిశితంగా పరిశీలిస్తూ ఉండిపోయాడు కొంతసేపు. వెంటనే తన ముందున్న బజర్ నొక్కాడు.

"ఓ అమ్మాయి ట్రేలో పొగలు క్రక్కుతున్న టీ తెచ్చి వారిముందు పెట్టి వెళ్ళిపోయింది.

"కమాన్. తీసుకోండి" అన్నారాయన కప్పు అందుకుంటూ. టీ త్రాగుతూ కొంతసేపు ఆలోచించారు. కప్పు క్రింద పెట్టారు.

అందరూ టీ త్రాగటం పూర్తయింది.

"వెల్ యూ సీ....ఐయామ్ రాబర్ట్స్. మీతో మాట్లాడే ముందు మిమ్మల్ని ఓ విషయం అడగదలుచుకున్నాను. జీవితం గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

విజయ్ మాట్లాడలేకపోయాడు.

చిన్ని సంశయిస్తున్నాడు.

"అఫ్‌కోర్స్. ఒక్క నిముషంలో చెప్పగలిగే ప్రశ్న కాదు. నాకు తెలుసు. ఈ రోజున ప్రపంచంలో అనేకానేక దారుణాలు జరిగిపోతున్నాయి. క్రైమ్ అనేది ఓ జీవితావసరంగా మారుతోందన్నా ఆశ్చర్యం లేదు. అలాంటి భయంకర పరిస్థితుల్లో మనం బ్రతుకుతున్నాం."

"అవును" అన్నారు వాళ్ళంతా తమకు తెలియకుండానే.

"ఈ దారుణాలు జరగటం వెనుక ఓ ప్రధానమైన లింక్ ఉంది. ప్రతి నేరం వెనకవున్న అసలైన కార

ణాలు ప్రపంచానికి తెలియటంలేదు. తెలియనివ్వటంలేదు. అందుకు అనేక కారణాలున్నాయి. అందుకే మేం నూతనంగా ఓ సంస్థ నెలకొల్పాం. వివిధ దేశాల్లో విశాల భావాలు కలవారంతా దీని మూలపురుషులు. ప్రతి దేశంలోనూ ఈ సంస్థ శాఖలు ఏర్పాటవుతున్నాయి. మన సంస్థకు ప్రభుత్వంతో సంబంధం లేదు. కొన్ని సందర్భాల్లో ప్రభుత్వాలు జరిపించే దారుణాల గుండెల్లోకి సైతం వెళుతుంది.

నేరాల వెనుక నున్న కారణాల్ని వెలికితీసి జనం ముందుంచటమే ఈ సంస్థ లక్ష్యం. ఇదీ ఒక డిటెక్టివ్ ఏజెన్సీలాంటిదే. అయితే ఈ సంస్థలో చేరేముందు ఓ పవిత్ర లక్ష్యం ఉండాలి. ప్రాణాల్ని అవసరమయితే త్యాగం చెయ్యటానికి తయారుగా ఉండాలి. మనం ఎదుర్కోబోయే శక్తులు అత్యంత బలమయినవి. ప్రమాదకరమైనవి. కాబట్టి ఎలాంటి పరిస్థితులనయినా తట్టుకోగల ధైర్యం, చొరవ, తెలివితేటలు ఉండాలి. వాటిని అభివృద్ధి చేసుకోవాలి.”

ఆగారాయన.

వాళ్ళంతా నోట మాట లేకుండా వింటున్నారు.

“జీవితంలో మీకు సమాజానికి ఉపయోగపడాలనే ఆకాంక్ష ఉంటే.... అందుకోసం ఎలాంటి పోరాటానికయినా మీరు సిద్ధంగా ఉంటే ఆ నిబద్ధత మీలో ఉంటే ఎఫ్....ఎఫ్ మిమ్మల్ని పిలుస్తోంది” గంభీరంగా అన్నారు రాబర్ట్.

విజయ్, చిన్ని మౌనంగా వుండిపోయారు.

“మీరంతా యువకులు. మీరు కార్యరంగంలో ఉంటారు. అవసరమైన సలహాలు, సూచనలు మేమందిస్తాం.

మీరు నేర్చుకోండి. జీవితంలోకి వెళ్ళండి. పోరాడండి. ఫ్యాక్ట్ ఫైండర్స్ సంస్థ మనముందు ఓ మొగ్గగా ఉంది. అది విస్తరించాలి. జన జీవితంలో భాగమై పోవాలి. అందుకోసం సెంటిమెంట్స్ .... అనుబంధాలు .... అన్నింటిని త్యజించాల్సి ఉంటుంది.

సృజన్ స్నేహితులుగా, ఈ దేశపు బిడ్డలుగా మీరు ఈ సంస్థలోకి ప్రవేశిస్తే నేను స్వాగతంపలుకుతున్నాను" అన్నారు రాబర్టు తిరిగి.

సృజన్‌కు చాలా టెంక్షన్‌గా వుంది. చిన్నా, విజయ్ ఏమంటారో?

"సర్. మీ సంస్థ గురించి పూర్తిగా అర్థం కాకపోయినా కొంతవరకు అర్థం చేసుకున్నాం. సృజన్‌కు మాకూ నడుమ ఏర్పడ్డ ఈ అనుబంధం జీవితాంతం కొనసాగాలనేది మా కోర్కె. మాకు ఈ సంస్థలో పనిచేసే అవకాశం లభించటం మా అదృష్టంగా మేం భావిస్తున్నాం" అన్నాడు విజయ్.

రాబర్టు కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"నాకు తెలుసు మీరు సిద్ధం అవుతారని. సృజన్ సెలక్షన్ మిస్ కాదని — ట్రైనింగ్ సెంటర్లో మీరు నేర్చుకొన్న విద్యలకు మరింత పదును పెట్టాలి. శరీరాన్ని యే రకమయిన కష్టాన్నయినా భరించటానికి సిద్ధం చెయ్యాలి. ప్రస్తుతానికి మనకేం కార్యక్రమం లేదు. మీరీ నాగరిక సమాజంలోకి వెళ్ళండి. అధ్యయనం చెయ్యండి. ఎంజాయ్ చెయ్యండి."

సృజన్ మిత్రులవంక చూశాడు.

"మైడియర్ బాయిస్, ఈ సంస్థను పటిష్టం చేసే

బాధ్యత మీది" అన్నారాయన ముగింపుగా.

వారు ముగ్గురూ ఆత్మవిశ్వాసంతో—

తల లూపారు.

## 5

రాత్రి పదిగంటలు దాటుతోంది.

సృజన్ ....చిన్ని ....విజయ్‌లు బయలుదేరారు.

సెరాక్ హోటల్ వాళ్ళు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన 'మిస్ డెయానా డాన్స్ అండ్ మ్యూజికల్ నైట్' ఆమె నృత్యం అద్భుతం. శరీరంలోని యే భాగాన్నయినా అద్భుతంగా కదిలించగల అద్భుతమైన ఆమెది ప్రత్యేకమైన ఆర్కెస్ట్రా వుంది. ఆమె ప్రోగ్రాం కోసం చాల మంది ప్రయత్నించారు. సెరాక్ మాత్రం సాధించగలింది. మిత్రులు ముగ్గురూ అదే హోటల్లో బస చేశారు.

ప్రోగ్రాం ఇంకా మొదలవలేదు. వెయిటర్ వచ్చాడు. సృజన్ కూల్ డ్రింక్స్‌కు మాత్రం ఆర్డరిచ్చాడు. మరుక్షణం థమ్సప్ తెచ్చి ముందుంచాడు.

నాన్ వెజిటేరియన్ ఫుడ్ మాత్రం దిట్టంగా ఆర్డరిచ్చేసేరు. చిన్ని గ్లాసుల్లో థమ్సప్ పోశాడు. ఐస్ క్యూబ్స్ వాటిలో వేశాడు. సృజన్ వాళ్ళ గ్లాసుల్లో కూడా పోసి ఐస్ ముక్కలు వేశాడు. స్టేజిమీద ఆర్కెస్ట్రా మొదలయ్యే దశలో ఉంది.

మ్రోగుతున్న డ్రమ్స్....గిటార్ మెరుపులు అదో రకం అనుభూతిని కలిగిస్తున్నాయ్. మధు గొంతు సవరించుకున్నాడు.

అంతా నిశ్శబ్దం!

"వెస్ట్రన్ స్టైయిల్లో మ్యూజిక్ తారస్థాయి నందుకొంది. పది నిముషాలు సాగిందలా. ఒక్కసారే లైట్లు

ఆరిపోయాయ్.

పిన్ డ్రాప్ సైలెన్స్ ఆవరించుకొంది.

"మిస్ డయానా!" మంద్ర స్వరాన వెలువడిందో శబ్దం.

అప్పుడో మెరుపు స్టేజిమీద.

అందుకొంది ఆర్కెస్ట్రా.

"హ్...డయానా" నిట్టూర్పుల సెగలు.

"ధన్ .... ధన్ .... ధన్ ...." డ్రమ్స్ మ్రోగుతున్నాయి.

డయానా గిర్రున తిరుగుతోంది. పది....ఇరవై .... ఏభై ....వంద....రౌండ్లు .... టెన్షన్‌తో బిగుసుకుపోయారందరూ. డ్రమ్స్ తారాస్థాయి నందుకొన్నాయి. వాటిలో మెలికలా గిటార్ విచిత్ర తరంగాలు వెలువడుతున్నాయి. అలా రెండువందల రౌండ్లు పైచిలుకు తిరిగి ఆగింది. చూసేవారికి మొత్తం డయాస్ అంతా గిర్రున తిరుగుతున్నట్లయింది. చిరునవ్వుతో అభివాదం చేసిందందరికి.

నాలుగు ప్రక్కలనుండి గాల్లోకి ఎగిరివచ్చాయి నోట్ల ఉండలు. ఆ తర్వాత జనం అరగంట మాత్రం జనం కళ్లు ఆశ్చర్యంతో చూస్తుండిపోయాయ్.చాలా గొప్ప నృత్యం డయానాది.

చిన్ని....విజయ్....సృజన్ చూస్తున్నారు.

మొహంలో చిరునవ్వు కదిలాడుతుంది వారికి. చిన్నిలో ఎందుకో టెంక్షన్ మొదలయింది.

గ్లాసెత్తుకొని సిప్ చేశాడు.

అప్పుడు వినిపించిందో ఎనౌన్స్‌మెంట్!

"బెట్....డయానాతో సమానంగా డ్యాన్స్ చేసి

నెగ్గితే వారికి రెండువేల రూపాయల బహుమానం. అలాగే డయానాస్ ఆర్కెస్ట్రాతో పోటీపడేవారికి సైతం ఈ సవాల్ వర్తిస్తుంది. ఎనీబడీ ఫైవ్ మినిట్స్‌లో ముందుకు రావాలి."

ప్రకటన అయిపోయింది.

అంతా నిశ్శబ్దం.

నిముషాలు గడుస్తున్నాయి.

"ఓడిపోతే రెండువేలు మనం కట్టాలా" యెవరో అంటున్నాడు.

"సీరియస్‌గా" జవాబు.

చిన్ని సృజన్ వంక చూశాడు.

సృజన్ పెదవులమీద అంగీకారంతో కూడిన దర హాసం వెలిసి మాయం అయింది.

తల ఆడించాడు.

అంతే. విజయ్ అక్కడినుండి మాయం అయ్యాడు.

"వియ్ ఆర్ రెడీ" చిన్ని అరిచాడు.

అందరి కళ్ళు ఇటు తిరిగాయి. సృజన్ వాలెట్ తీసి రెండువేలు చిన్నికిచ్చాడు. సరదాగా నవ్వుకుంటూ 'డయానా' ముందుంచి—

"బెట్!" అన్నాడు.

అప్పుడే విజయ్ లోపలకు వచ్చాడు. ఓ చేతిలో గిటార్, మరో చేతిలో డ్రమ్స్ వున్నాయ్.

డయాస్ మీదికి చేరుకున్నారు ముగ్గురూ.

జనంలో ఉత్సాహం వచ్చింది.

డయానాస్ ఆర్కెస్ట్రా మొదలయింది.

డిస్కో లైటింగ్ ఎఫెక్టులో డయానా నృత్యం మొదలయింది. చిన్ని డ్యాన్స్ కూడా మొదలయింది.

దయానాతో పోటీగా వంపులు తిరుగుతున్నాడు. ఆర్కెస్ట్రా తీవ్రస్థాయి నందుకొంది. కానీ చాలా ఈజీగా నర్తించేస్తున్నారు ఇద్దరూ.... చేతులు నొప్పిపుట్టు కాబోలు ఆర్కెస్ట్రా ముగించారు. హాలు మ్రోగిపోయింది చప్పట్లతో.

ఎవరు గెలిచారో డిక్లేర్ కాలేదు.

అప్పుడు విజయ్ గిటార్ అందుకొని జనానికి విష్ చేశాడు.

సృజన్ వంక చూసి కన్ను గీటాడు.

అంతే....

సృజన్ గొంతునుండి మొదలయిందో గీతం.

గీతానికి ముందు రాగం.

గుసగుసలు సైతం ఆగిపోయాయ్.

సన్నగా మొదలయింది బేస్‌లోకి వెళ్ళిన ఆ స్వరం దయానాను ఒక్కసారి కదిలించేసింది.

రెండు నిమిషాలు నిలబడిపోయి మనస్సు నెక్కడికో తీసుకువెళ్ళే రమ్యగీతం అది.

విజయ్ చెయ్యి గిటార్ మీద పడింది.

అతని వేళ్ళ కదలికలు ఎవరికీ వినిపించటంలేదు.

సృజన్ గొంతు ఎంత వేగంగా పదాలు పలుకుతుందో ఎవరూ ఊహించలేకపోతున్నారు.

చిన్ని డాన్స్ మహాద్భుతంగా వుంది.

మణికట్టు దగ్గరనుండి మొదలయిన స్పందన శరీరంలోని ప్రతి అణువుకు సోకినట్లయింది. దయానాకు మొదటి సారిగా చెమటలు పట్టేశాయి. అయినా పట్టుదలతో అడుగులు వేస్తోంది.

మరోసారి సృజన్ స్వరం.

మహోన్నత శిఖరాగ్రాలకు....!

డయానా తూలింది.

ఫినిష్!

అడుగులు పడటం మానేశాయి.

సృజన్ గొంతు....

విజయ్ గిటార్....

అలా....అలా....మంద్ర స్వరాన.

హిమాలయాల ఎత్తులకెళ్ళిపోయాయి.

వినేవారికి వారి రక్తనాళాలు చిట్లిపోతాయేమోనని పించింది.

చిన్ని డ్యాన్స్ చేస్తున్నవారికి డిస్కో ఎఫెక్ట్ కళ్ళ ముందు కనపడుతోంది.

అంత వేగం వారి జీవితాల్లో ఇంతవరకుం దెప్పుడూ చూడలేదు.

ఆ గానం....అలా....అలా వెళ్ళి ముగిసింది.

హాలునిండా ఈలలు....చప్పట్లు... డయానా అప్పటి దాకా నిలబడిందల్లా ఈ లోకంలోపడి తనూ చప్పట్లు కొట్టింది.

రూపాయల కాయితాలు ఉండలు ఉండలు వచ్చి పడుతున్నాయి.

చిన్ని ఆయాసంగా నవ్వాడు.

చాలామంది వాళ్ళ చుట్టూ ఎగబడ్డారు. హోటల్ మేనేజ్ మెంట్ ఆశ్చర్యంనుండి తేరుకోలేదు. వీళ్ళతో ఓ ప్రోగ్రాం ఫిక్స్ చేసుకోవాలనే ఆలోచన వెంటనే వారి మనస్సులో ప్రవేశించింది.

వారినుండి విడిపించుకొని డయాస్ దిగారు.

ఆ గదిముందు అలికిడయింది.

గాజులు గలలు.

ఉలిక్కిపడి ముగ్గురూ అటు చూశారు.

అక్కడో అమ్మాయి నిలబడుంది.

పెద్దింటి అమ్మాయిలా వుంది. ఆ అమ్మాయిని చూడగానే యెవరూ మాట్లాడలేరు. సృజన్ ముందుగా తేరుకున్నాడు.

"ఎవరు కావాలండి?"

"మీరే."

కంగుతిన్నాడు సృజన్.

"మీరు...."

"మరచిపోయావా" టంగున మ్రోగింది కంఠం.

"ఐయామ్ సారీ....మీరెవరో నాకు తెలియదు."

"అవును. నాకు తెలుసు నువ్వామాట అంటావని" ఆమె కళ్ళలో నీరు తిరిగింది.

సృజన్కు అయోమయంగా వుంది. విజయ్, చిన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"నన్ను యెవరైనా మోసం చెయ్యొచ్చు. కానీ నీ కంఠం మాత్రం నన్ను మోసం చెయ్యదు. ఇరవై సంవత్సరాల అనుబంధాన్ని ఎలా త్రెంచుకోగల్గావ్" అంది ఆమె లోనికి అడుగు పెడుతూ.

సృజన్ చిన్నవంక, విజయ్వంక చూశాడు.

వాళ్ళు ప్రశ్నార్థకంగా తలలూపారు.

"చూడమ్మా, నువ్వు ఎవరిగురించి మాట్లాడుతున్నావో నాకు తెలియదు. నా పేరు సృజన్" అన్నాడు.

"పేరుకూడా మార్చేశావన్నమాట."

"ఊఁ" అంటూ దీర్ఘంతీసి తలపట్టుకు కూర్చుండి పోయాడు చిన్ని. ఆ అమ్మాయికి కోపం వచ్చింది.

"వాడ్డూయూ మీన్. నేను పిచ్చిదాన్ననుకుంటు న్నారా?" అంది.

"లేతల్లి మాకు పిచ్చెక్కేట్టుంది" అన్నాడు చిన్ని.

ఒక్క క్షణం ఆ అమ్మాయి మొహంలో రంగులు మారిపోయాయి. ఆధారాలు కనిపించాయి. భృకుటి ముడి పడింది.

"మీరు నాతో రాగలరా" ఎంత మెల్లగా అందా మనుకున్నా ఆమెలో కోపంతో కూడిన పట్టుదల స్పష్టంగా కనిపిస్తోంది.

విజయ్, సృజన్ వంక చూశాడు.

"నాకేం అభ్యంతరంలేదు" అన్నట్లు భుజాలెగ రేశాడు సృజన్.

"జస్టు వెయిట్" అన్నారు.

"మీరు కూర్చోండి" అన్నారామెను.

ఆమె కూర్చుని గదంతా పరిశీలించటం ప్రారంభిం చింది.

ముగ్గురూ తయారయి బయలుదేరటానికి ఉపక్రమించేక కూడా లేచింది. రూమ్స్ లాక్ చేశారు. ఆమెతోపాటు బయలుదేరారు. పార్కు చేయబడ్డ కారును స్వయంగా నడుపుకుంటూ వచ్చిందామె. ముగ్గురూ వెనక సీట్లో కూర్చున్నారు.

అందరిలో తీవ్రమైన టెన్షన్.

ఎవరీమె? ఎక్కడకు తీసుకెళుతోంది?

సృజన్‌తో ఆమెకున్న సంబంధం ఏమిటి?

అన్నీ ప్రశ్నలే! జవాబులు లేవు.

'ఫర్వాలేదు. అంత గా దూరదేశంతో తీసుకెళుంటే ఆ మాత్రం ఆత్మరక్షణ చేసుకోలేకపోం' అనుకున్నారంతా.

కారు వెళ్ళి ఓ బంగళా ముందాగింది.

గూర్ఖా గేటుతీశాడు.

లోనికి దూసుకుపోయింది.

షెడ్ దగ్గర ఆగింది. ఆమె ముందాగింది.

తర్వాత ముగ్గురూ దిగారు.

"ప్లీజ్ కమ్" అందామె ముందు నడుస్తూ.

ఆమె వెంట యాంత్రికంగా అనుసరించారు. ఆమె మెట్లెక్కింది. ఆ భవనం చాలా రిచ్ గా ఉంది. యే ప్రక్క చూసినా అధునిక జీవితపు హంగులన్నీ దర్శనమిస్తున్నాయి. మేడపైన కుడిప్రక్కకు తిరిగింది. ఆమెను అనుసరించారు. ఓ గదిముందు నిలబడి బ్యాగ్ నుండి తాళంచెవితీసి తాళం తీసింది. గదినుండి చల్లగాలి మొహాల్ని తాకింది. ఆమె లైట్ స్విచ్ ఆన్ చేసింది.

దేదీప్యమానంగా వెలుగు.

ఎదురుగా నిలువెత్తు చిత్రువు!

ఆయిల్ పెయింట్స్‌తో వేయబడి వుంది.

ఆ ఫ్రేమ్‌లో వున్న వ్యక్తిని చూసి వారందరికీ పిచ్చెక్కినంత పనయింది.

ఆమె గర్వంగా వారివైపుకు తిరిగింది.

సృజన్ అవాక్కయి నిలబడి వున్నాడు.

ఆ ఫ్రేమ్ లోపల తన నిలువెత్తు ఛాయా చిత్రం అందంగా మలచబడి వుంది—

"కూర్చోండి" అందామె.

"అప్రయత్నంగా అందరూ కూర్చున్నారు.

"ఆ ఫోటోలో ఉంది కూడా నువ్వు కాదా కిరణ్"
అందామె.

సృజన్ కొంచెంసేపు మాట్లాడలేదు.

"చూడమ్మా, నీ పేరు?"

"సంధ్య."

"ఐయామ్ సృజన్. ప్రపంచంలో మనుషుల్ని పోలిన మనుషులు వుండవచ్చు. మీరు పొరపడి వుంటారు. నేను కిరణ్ని కాదు" అన్నాడు.

సంధ్య కోపంగా అంది.

"కానీ కిరణ్ కూడా నీలానే పాడేవాడు. అదెలా సాధ్యం?"

సృజన్ కు ఏం చెప్పాలో అర్థంకాలేదు.

సంధ్య కళ్ళవెంట నీళ్ళు కారిపోతున్నాయి.

"ప్లీజ్ ఏడవకండి" కదిలిపోతూ అన్నాడు సృజన్.

"కిరణ్ మీకేమవుతారు?"

"అన్నయ్య."

"మీరు నన్ను అన్నగానే భావించుకోండి."

సంధ్య కళ్ళు మెరిశాయి.

"కిరణ్ గురించి వివరాలు చెబితే సంతోషిస్తాం" అన్నాడు సృజన్.

సంధ్య కళ్ళనీళ్లు తుడుచుకుంది. సృజన్ కాళ్ళకేసి పిచ్చిదానిలా చూసింది. ఆమెకు సృజన్ కిరణ్ అనే ఇంకా నమ్మకం. అతన్ని తన అన్నగాగాక, మరెవరిగానో ఊహించలేకపోతోంది.

ఆమె గొంతు సవరించుకుంది.

"కిరణ్ నా అన్న. చాలా గొప్పగా పాడతాడు. ఆ పాటలో తియ్యదనం నేను మాటల్లో వర్ణించలేను.

ఆ పాటలో జతకలిసింది మరో స్వరం. వాళ్ళు ప్రేమిం చుకున్నారు. ఆ అమ్మాయి కంఠంలో వేయి కోయిల స్వరాలుండేవి. ఆమె క్రిస్టియన్. అందుకే ఆ సంబం ధాన్ని తాతగారు ఒప్పుకోలేదు. వారిని విడదీయటానికి ఆయన చేసిన ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు. పైపెచ్చు వారు తాతగార్ని యెదిరించటానికే నిశ్చయించు కున్నారు. ఆఖరకు మా తాతగారు ఆమెను హత్య చేయించటానికి ప్రయత్నం చేశారు."

"ఆమె చంపబడిందా?" మధ్యలోనే అడిగాడు. చిన్ని కుతూహలం చంపుకోలేక.

"ఏమో?"

"మీ తాతగారెవరు?"

"రావ్ బహద్దర్."

"జమిందారులా?"

"అవును" అంది సంధ్య.

"ఈ విషయం కిరణ్ కు తెలిసింది. వారం రోజుల క్రితం తాతగారితో తీవ్రంగా పోట్లాడాడు. ఆ మరుసటి రోజునుండే కిరణ్ జాడ తెలియకుండా మాయం అయ్యాడు. ఎంతగా వెదికించినా వారిద్దరి జాడలు తెలియలేదు. కిరణ్ లాంటి అన్న దొరకటం నా అదృ ష్టంగా భావించేదాన్ని. కానీ మాది గొప్ప వంశంకదా. అందుకే యిలా జరిగింది. మా ఆస్తులు....అంతస్తులు.... ఏవీ మమ్మల్ని కలపలేకపోయాయి. రెండు హృదయాల్ని కలపలేని ప్రేమల్ని ఒప్పుకోని ఈ ఆస్తులూ....అంతస్తులూ ఎందుకు? యెవరికోసం?" అంది సంధ్య. ఆమె గొంతు వణుకుతోంది.

"నేను అక్కడ వుండలేకపోయాను. మనశ్శాంతి

కోసం ఎక్కడెక్కడో తిరుగుతున్నాను. ఆఖరుకు ఈ ఊర్లో డయానా ప్రోగ్రాంలో పురివిప్పిన మీ గొంతు కిరణ్‌ను నా ముందుంచింది. ముమ్మూర్తులా కిరణ్‌ను పోలిన మిమ్మల్ని చూచి యెంతగా ఆనందపడ్డానో. కానీ విధి మరలా నాతో ఆడుకొంటోంది. మీరు కిరణ్ కాదంటే నేనది భరించలేను" అంది సంధ్య.

"చూడమ్మా, నువ్వు బాధపడ్డా యీ విషయం మాత్రం నిజం. నా పేరు సృజన్. నాకు చెల్లెలూ, అక్కా, మారెవరూ లేరు. నాకున్నది ఈ ఇద్దరు మిత్రులు. మరో తండ్రిలాంటి వ్యక్తి. అంతే. నిన్ను చూస్తుంటే నువ్వు నా చెల్లివయితే బాగుండుననిపిస్తుంది. కిరణ్‌తో నీకున్న అనుబంధం గురించి చెబుతుంటే మా మనసు అతనిపట్ల నీకుగల ప్రేమను గ్రహించింది. మేం కిరణ్ గురించి ఆరాతీస్తాం. అతనే గనక బ్రతికి వుండినట్లయితే తప్పకుండా నీముందుంచుతాం" అన్నాడు సృజన్.

సంధ్య కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"చెల్లీ" కళ్ళనిండా సోదర భావం నింపుకొని అన్నాడు సృజన్.

"ఇతను విజయ్. వీడు చిన్ని మేమంతా సోదరులం. నువ్వు మా అందరి చెల్లివి.

వారందరివంక చూస్తూ ఆప్యాయంగా అంది.

"ఇందాకటినుండి ఊరకే మాట్లాడేస్తున్నాను...." అని లోపలకు వెళ్ళింది.

కొద్ది సేపటికి సంధ్య వచ్చి అందరినీ భోజనాలకు పిలిచింది. ఆమె స్వయంగా ముగ్గురికీ కొసరి కొసరి వడ్డించింది. భోజనాలు పూర్తయ్యాక కిళ్ళీలు వేసుకున్నారు.

నావ్‌కిన్‌తో మొహం తుడుచుకుంటూ వచ్చింది

సంధ్య.

"ఏమ్మా భోజనం అయిందా?"

"అయింది."

"నాకయితే పొట్ట సాలిడ్ గావుంది" అన్నాడు చిన్ని.

"మనం మా ఎస్టేట్ కు ఉదయం బయలుదేరుతున్నాం" అంది సంధ్య.

"ఓ.కే. అయితే ముందు రూమ్‌లో మా బట్టలు తెచ్చుకోవాలి. ఆ తర్వాత మా కారు అక్కడే వుండి పోయింది" అన్నాడు సృజన్.

"తెచ్చుకుందురుగాని. మరో విషయం మీకు చెప్పాలి. మా తాతగారు చండశాసనుడు. నిజంగా ఇన్ని సంవత్సరాల మా అనుభవంలో అధికారం తప్పించి ప్రేమంటే యేమిటో ఎరగం. మా తల్లితండ్రులు ఏక్సిడెంటులో చనిపోయారు. మా దురదృష్టానికదో కారణం అనుకుంటాను. కిరణ్ ఇన్ని రోజులనుండి కనపడక పోయినా ఆయనకు బాధ లేదు. అలాంటి మనిషి దగ్గరకు మనం వెళుతున్నాం. ఒక్క విషయం. నాకెందుకో ఇంకా మీరే కిరణ్ అనిపిస్తోంది. అయితే ఒక్కోసారి వాస్తవాలు ఎంత బాధాకరంగా ఉంటాయో! ఏమయినా మీరు కిరణ్‌ను వెదికి తీసుకురాగలరనేది నా దృఢ విశ్వాసం...." అంది సంధ్య.

సృజన్ నవ్వాడు.

చిన్ని, విజయ్ "మరి బయలుదేరుదామా" అన్నారు.

"అలాగే" అంటూ లేచాడు సృజన్.

# 7

అదో కొండ మలుపు. మలుపు తిరిగి కారు వేగం అందుకుంది.

"ఇక్కడినుండే ప్రారంభమవుతుంది మా వైభవం" అంది నిర్లిప్తంగా సంధ్య.

చుట్టూ ఎటు చూసినా పచ్చటి చేలు.

"ఎన్నెకరాలుంటుంది?" అడిగాడు చిన్ని.

"తెలియదు. కొన్ని వేల యెకరాలుండవచ్చు. మా ఎస్టేట్ మేనేజర్‌కు తెలియవచ్చు" అంది.

"కొంత ఆయనకు వచ్చింది. మరి కొంత ఆయన హయాంలో డెవలవ్ చేశారు."

"ఇంత సొమ్ము యెలా సంపాదించేడబ్బా" అనాశ్చర్యపోయారు.

అలా ఓ అరగంట ప్రయాణం చేశాక ఓ పురాతన కోటలా....జానపద సినిమా సెట్‌లా వున్న భవనం దగ్గరికి కారు వెళ్ళి ఆగింది. కారు మోత వినగానే పరిగెత్తుకొచ్చి గేటుతీశాడు కావలివాడు. ఆ గేటు తెరుచుకుంటుంటే కిర్రు....కిర్రుమంది. ఎత్తుగా వున్న ఆ గేటు వంకే చూస్తుండిపోయాడు చిన్ని.

లోపలనుండి పనివాళ్ళు వచ్చారు. సృజను చూసి ఆశ్చర్యపోయారు. సంధ్య కళ్ళతోనే సైగలుచేసింది.

"రండి" అందామె లోనికి నడుస్తూ.

ముగ్గురూ ఆమెను అనుసరించారు. ప్రాచీన వైభవం గురించి, జమిందారుల కోటల గురించి పుస్తకాల్లో చదువుకోవటం మినహాయించి వారెప్పుడూ చూడలేదు. అక్కడ ప్రతి అంగుళం వింతగానే కనబడింది వారికి.

ముగ్గురికీ మూడు గదులు కేటాయించబడ్డాయి. ఎవరి గదిలో వారు ప్రవేశించారు. ఆ తర్వాత స్నానాలు పూర్తయ్యాయి.

సంధ్య వచ్చి వారందరినీ ఆహ్వానించింది.

డైనింగ్ టేబుల్ కళాత్మకంగా వుంది. మధ్యలో ఓ సింహాసనంలా వుంది. అందులో బహుశా రావ్ బహద్దర్ గారు మీసాలు మెలేసుకుంటూ కూర్చుంటా డనుకున్నాడు చిన్ని. ఆ టేబుల్ చుట్టూ కుర్చీ లున్నాయి. వాటిలో కూర్చున్నారు.

టేబుల్ నిండా రకరకాల పదార్థాలు పేర్చబడి వున్నాయి. మరో ప్రక్క వివిధ రకాల పళ్ళున్నాయి. వాటిలో కొన్ని పేర్లే తెలియటంలేదు. చిన్ని ఏమాత్రం సిగ్గుపడకుండా తన అనుమానాలన్నింటిని నివృత్తి చేసు కున్నాడు.

భోజనాలు పూర్తయ్యాయి.

"మీ తాతగారు—?" అడిగాడు సృజన్.

"ఆయన్ను కలుసుకోవటానికి కొన్ని పద్ధతులున్నాయి. బెదిరై. మిమ్మల్ని కిరణ్ గానే ఇక్కడి ప్రజలు భావి స్తారు" అంది సంధ్య.

తలూపాడు సృజన్.

## 8

మధ్యాహ్నం కార్లో ముగ్గురూ బయలుదేరారు. సృజన్ తన క్రాప్ స్టెయిల్ పూర్తిగా మార్చేశాడు. ఇప్పుడు ఎంతో పరీక్షించి చూస్తేగాని అతన్ని 'కిరణ్'గా గుర్తించడం కుదరదు. ఎస్టేట్ నుండి బయలుదేరి దూరంగా విసిరివేయబడినట్లున్న ఓ పల్లె దగ్గరకు చేరారు.

అక్కడ కనిపించింది మూర్తీభవించిన దరిద్రం. అంతకుముందు ఎస్టేట్ లోని సంపదలకూ ఇక్కడ చాలా తేడా స్పష్టంగా కనపడుతోంది. అక్కడ పిల్లలు నల్లగా వున్నారు. శరీరం నిండా సరైన గుడ్డలేదు. మట్టిగొట్టుకొని వున్నారు. తరతరాల దాస్య బంధాలేవో అక్కడ తిరు

గాడుతున్న వ్యక్తుల మొహాల్లో కనిపిస్తున్నాయి.

ఆ ఊరి నడుమ పెద్ద రావిచెట్టు వుంది. అక్కడ కారాపి ఎందుకు దిగారో వారికే తెలియదు. ఆ చుట్టు ప్రక్కల అడవులున్నాయి. అవి కూడా జమిందారుకు చెందినవే అని తెలుసుకున్నారు. అక్కడ యెవరిని పలకరించాలో అరంకాలేదు. అలా ఊరి చివరవరకూ నడిచి వెళ్ళారు. అన్నీ పూరిపాకలు....ఓ ఇరవై పెంకుటిల్లు వుండవచ్చేమో! నాగరికతకు చెందిన లక్షణాలేవీ ఆ పల్లెను సోకలేదు. అంత అమాయకంగా బ్రతుకుతున్నారక్కడి జనం.

"అలా అడవుల్లోకి వెళితే బాగుంటుంది" అన్నాడు చిన్ని. వాళ్ళని రెండు కళ్ళు తీక్షణంగా గమనిస్తున్నాయనే విషయం వారికి తెలియదు.

చిన్ని ఎవరి దగ్గరికో వెళ్ళాడు.

"ఈ రూట్‌లో వెళితే అడవి వస్తుందా?"

"వద్దు బాబుగారు" అన్నాడతను.

"ఏం?"

"రాత్రి చిరతొచ్చి గూడెంలో వుత్రాడ్నిడ్చుకుపోయింది."

"అయ్యయ్యో" నొచ్చుకున్నాడు.

"మొన్నటిదాకా బర్రెల్ని పొట్టన పెట్టుకుంటుందయ్యగారు. రాతిరే....బంగారంలాంటి పసోడ్ని పొట్టబెట్టుకుంది" అన్నాడు దిగులుగా.

"ఇన్నాళ్ళెందుకు ఊరుకున్నారు?" అన్నాడు చిన్ని.

"ఏటిసెయ్యాలి. ఓడికి అంత ధైర్యంలేదు. దొరగారితో మొత్తుకున్నా ఉపయోగంలేదు. గూడెవంతా ఖాళీసెయ్యాలనుకుంటున్నాం దొరా" అన్నాడతను.

"సరే. ఇలా వెళితే అడవిలోకి వెళుతుందిగదా!"

"వెళ్ళుద్ది."

"కారు లోపలకు పోతుందా?"

"కొంతదూరం పోద్దయ్యా."

"మంచిది" అంటూ మూసుకొచ్చి కారెక్కాడు.

"అడవిలో పెద్ద చిఱుతపులి వుందట. రాత్రి ఎవరో కుర్రాడిని లాక్కుపోయిందట. పులి ఒక్కసారి మాన్ ఈటర్ గా మారిందంటే ప్రమాదకర స్థాయికి పోయినట్లే. విచిత్రం ఏమిటంటే వీళ్ళ అతీ గతీ చూసినోళ్ళు లేరు. వాళ్ళంతా దాని భయంతో గూడెం ఖాళీ చెయ్యాలనుకుంటున్నారు" చెప్పాడు చిన్ని.

సృజన్ కారు నడుపుతున్నాడు.

"మన దగ్గర అమ్యూనిషన్ వుందా?"

"అఫ్ కోర్స్. రాబర్టుగారిచ్చిన డాగర్ వుంది" చెప్పాడు సృజన్.

"అంతేనా?"

"రివాల్వర్ కూడా వుంది."

"దెన్, ఓ.కె."

కారు అడవిలోకి ప్రవేశించింది. విశాలమైన వృక్షాలతో నిండివుంది. కొంతదూరం వెళ్ళాక ఇంక వెళ్ళటం సాధ్యం కాలేదు.

కారాపి క్రిందకు దిగారు.

ముగ్గురూ నడుస్తున్నారు.

"బీ....ఎలర్టు....ఏ క్షణం అయినా అది మనమీదకు రావొచ్చు" అన్నాడు సృజన్.

వాళ్ళు నడుస్తుంటే ఎండుటాకులు నలిగిపోతున్నాయి.

ఆ శబ్దాలు వినిపిస్తున్నా భయంకరమైన నిశ్శబ్దం ఆ ప్రదేశమంతా ఆవరించుకొని వుంది.

విజయ్ క్రిందకు వంగి తీశాడు.

ఆరడుగుల కర్ర.

గాల్లో గిర్రున త్రిప్పాడు.

అఘోరకమైన శబ్దం!

"ఓ గంట వ్యాయామం చేద్దాం" అన్నాడు విజయ్. చుట్టూ దట్టంగా పొదలున్నాయి. వాటి మధ్యలోనే కొంత ఖాళీ ప్రదేశం వుంది. వ్యాయామం మొదలయింది.

కర్రసాము.

ఆసనాలు.

ఒక్కో అంశం మొదలయింది.

చిన్ని నిలబడి వున్నాడు. అంతలోనే అతని కండ రాలు బిగుసుకున్నాయి. గాల్లోకి లేచాడు. నోటినుండి వెలువడిందో షౌట్. అడవి దద్దరిల్లేటట్లు.

గాల్లోకి లేచిన చిన్ని చెయ్యి విసురుగా తాకిందో చెట్టు కొమ్మని. పచ్చిగా వుందది. ఫటక్ మంటూ విరిగి పోయింది.

అదే క్షణంలో మరో విచిత్రం జరిగిపోయింది. ఆ కొమ్మ మీదనుండి 'డబ్'మంటూ క్రిందపడిందో నల్ల త్రాచు. క్రిందపడి అంతులేని ఆగ్రహంతో పడగవిప్పి చిన్నివంక చూసింది. చిన్ని ఇదేం గమనించలేదు. మరో సారి గాల్లోకి లేచాడు.

అదే మంచిదయింది.

త్రాచు కాటు వృథా అయింది.

ఆ శబ్దానికి గాల్లోనే చూశాడు చిన్ని.

గుండె గుభేల్ మంది.

తను క్రిందకు వాలిన మరుక్షణం....స్నేక్....యెంత పరిణామంలో తన శరీరంలోకి విషం పంపుతుందో.... ఆ తర్వాత... నల్లగా మారి....నోట్లో నురుగుతో....

"నీ చాప్టర్ ఎండ్ రా చిన్నీ" అనుకున్నాడు.

అంత వేగంతో తోకమీద లేచింది నల్లత్రాచు అంతులేని క్రోధంతో.

"స్....స్....స్."

ఎగిరి అవతల పడింది త్రాచు.

అప్పుడే నేలను తాకాయి చిన్ని కాళ్ళు.

త్రాచు గిలగిల కొట్టుకుంటోంది.

దాని పడగ నడుమనుండి దూసుకుపోయింది సృజన్ విసిరిన డాగర్. మొన తళతళ మెరుస్తోంది.

"థాంక్స్ గురూ. అయిపోయాననుకున్నాను."

"అయినా వున్నచోటు నుండవు. ఆ కొమ్మెందుకు విరగ్గొట్టావు?" అన్నాడు విజయ్.

"చాలా రోజులయింది గురూ పొజిషన్ చూసుకొని."

"కమాన్. బీ ఎలర్ట్. చిరత సంగతి మీరు మరిచి పోతున్నారు" అంటున్నాడు సృజన్.

అప్పుడే వినిపించింది.

కెవ్వుమన్న కేక!

గుండె లవిసేటట్లు!!

విజయ్ ఎగిరి గంతేశాడు ఆ శబ్దం వచ్చిన దిక్కుకు. పొదల్లో ముళ్ళు గీరుకుపోతున్నా లక్ష్యపెట్టకుండా. అతడి చేతిలో ఇంకా కర్ర వుంది. చిన్ని కూడా వేగంగా అనుసరించాడు.

సృజన్ డాగర్ను లాగి రక్తాన్ని ఆకులకు తుడిచాడు. పొద దాటిం తర్వాత కనపడిందా దృశ్యం.

చిరతపులి యెవరో వ్యక్తిమీద దాడిచేసింది. భుజం మీద షర్టు చినిగిపోయి ధారలుగా కారుతోంది రక్తం. మరోసారి గాల్లోకి లేచి అతని మీదకు దూకబోతోంది. విజయ్ గాల్లోకి లేచాడు. చేతిలో కర్ర స్టిక్‌గా మారింది. కండరాలు పొంగుతుండగా ఫట్‌మంటూ కొట్టాడు పులిని.

పెద్ద శబ్దంతో కర్ర విరిగిపోయింది.

సగం ముక్క ఎటో యెగిరిపోయింది.

ఆ దెబ్బకు ఒక్కసారిగా బిత్తరపోయింది. అంతలోనే ఆగ్రహంతో గర్జించింది. అడవంతా ప్రతిధ్వనించింది. యిప్పుడు దాని చూపులు విజయ్ మీదున్నాయి.

విజయ్ రెడీగా నిలబడ్డాడు.

ఎగిరి మీదకు దూకింది.

రెండు చేతుల నడుమ వున్న కర్ర మధ్య దాన్ని బాలెన్స్ చేస్తూ గాల్లోకి విసిరేశాడు. ఒక్కసారి వెల్లకిలా పడింది.

పులి విసిరిన పంజా లైట్‌గా భుజాన రాసుకుంటూ వెళ్ళింది. చొక్కా చినిగి రక్తం చిమ్మింది. వెంటనే చురచురలాడటం ప్రారంభించింది.

చిరతపులి క్రిందపడ్డ క్షణం దానికి వినిపించిందో స్వరం తన అరుపుకు దీటుగా.

మరుక్షణం చిన్ని పాదం ప్రళయవేగంతో దాని దవడమీద పడింది.

కోరలు కదిలిపోయాయి.

వాళ్ళముందు పసిబాలుడి వదనం కనిపిస్తోంది.

మూలుగుతూ కష్టంమీద నిలబడింది. రెండు ప్రక్కల

నిలబడ్డవారిని చూసి ఎవరిమీదకు దూకాలో నిర్ణయించుకోలేకపోతోంది.

అంతలో నే గాల్లోకి లేచింది.

తలలోనుండి దూసుకుపోయిందో బుల్లెట్.

ఎగిరి అంత దూరంలోపడి వికృతంగా అరిచింది.

మరో గుండు గొంతులో....

ఇంకోటి పొట్టలో....

గిలగిల కొట్టుకుంటూ, కొంత సేపయ్యాక మానేసింది.

పులివాతపడి క్రిందపడివున్న వ్యక్తిని చూశారు. చిన్ని కొన్ని ఆకులు కోసుకొచ్చి అతని గాయం మీద పిండాడు. అతని చొక్కా చించి కట్టు కట్టాడు.

అతను కళ్ళు మూసుకుంటూ అన్నాడు మెల్లగా—

"మీరే ఈ జమిందారు మనవడిగా భావించాను. ఈ పల్లెలోకి మీరు రావటం గమనించాక మిమ్మల్ని వెంబడిస్తున్నాను. ఈ చిరతపులి చాలా కాలంనుండి పశువుల్ని అపహరించుకుపోతుంది. నిన్న సాయంకాలం ఓ పిల్లాడ్ని తీసుకెళ్ళి చంపింది. ఈ ప్రజలు ఇక్కడే భయం భయంగా బ్రతుకుతుంటారు. వీళ్ళంతా మధ్యయుగాల్లో బానిసల్లా బ్రతుకుతున్నారు. కనుచూపు మేరలో మీరెక్కడయినా గమనించండి. పచ్చదనమే కనిపిస్తుంది. కానీ వారి జీవితాల్లో అదే కరువయింది.

జనంలో ఏమాత్రం కదలిక కన్పించినా జమీందారు వాళ్ళని నాశనం చేస్తాడు. ఆ భవనంలో మహా వృక్షాలున్నాయి. అవి ఫలాలు కాస్తాయి. రాలిపోతాయి. అదలా యిండిపోవాల్సిందే. వాటిని తినేవారుండరు. మరొకరు తాకకూడదు. ఆ చెట్టు నీడలో సైతం ఎవరు నిలబడ్డా సహించలేడు జమిందారు.

అంత దుర్మార్గంగా. రాక్షసంగా ప్రవర్తించే ఆ జమిందారు వంశంలోనే జన్మించారు — సున్నితమైన హృదయంకల వ్యక్తులు ఇద్దరు. కిరణ్ ఆమె చెల్లెలు. వారిద్దరికి ఈ వైభవం గురించి, అధికారాల గురించి ఏమాత్రం ఆలోచనలేదు. చిన్నప్పటినుండి ఈ దుర్మార్గుడి నీడలో పెరిగినా ఆ ఛాయలు సోకలేదు. కిరణ్ ప్రేమించాడో అమ్మాయిని...."

"షి.... ఈజ్ మేరీ" అన్నాడు సృజన్.

"అవును. ఆ అమ్మాయే చాలా పొరపాటు చేసింది. కిరణ్ గానానికి మగురాలయింది. అదే ఆమె జీవితానికి పెద్ద ప్రతిబంధకం అయింది. ఈ వార్త తెలిసిన రావ్ బహుద్దర్ భగ్గున మండిపడ్డాడు. కిరణ్ ను వారించాలని చూశాడు. లాభంలేకపోయింది. అప్పుడు మామూలుగానే తన పథకం ప్రారంభించాడు. మేరీని బెదిరించాడు. డబ్బు ఆశ చూపించాడు. ఏం ప్రయోజనం కనిపించలా. రెండు సార్లు చేయించిన హత్యా ప్రయత్నం విఫలం అయింది. ఫలితం మేరీ మాయం అయింది. ఆ తర్వాత కిరణ్ మాయమయ్యాడు" అన్నాడతను.

"ఇద్దరూ కలిసి ఎక్కడికయినా వెళ్ళి వుండవచ్చా?"

"లేదు. వాళ్ళు నిజంగా అలా చేస్తే రావ్ బహుద్దర్ ఇంత తాపీగా వుండడు. దేశమంతా గాలించి యెక్కడున్నా పట్టుకొచ్చేవాడు."

"మరేమై వుంటారు" అన్నాడు సృజన్.

"నా అనుమానం.... బహుద్దర్ కిరణ్ ను దాచివుండవచ్చు. మేరీని మాత్రం...." ఆ తర్వాత మాట్లాడలేకపోయాడు. గొంతు ఉద్వేగంతో వణికింది.

"అయితే కిరణ్ ను యెక్కడ దాచి వుండవచ్చు."

"జమిందారుల భవనాలంటేనే రహస్య మందిరాలు, యెన్నెన్నో రహస్యాలు ఆ గోడల నడుమ సమాధి అవుతుంటాయి. ఆ భవనంలో యే రాయిని, రప్పనీ అయినా అనునయించి అడిగితే చెబతాయి అంతులేని రహస్యాల్ని" అన్నాడతను భావగర్భితంగా.

సృజన్ తలపంకించాడు.

"ఏదిఏమైనా నన్ను ప్రాణాపాయంనుండి కాపాడారు."

"మీకు జీవితాంతం ఋణపడివుంటాను."

"భలేవారే. ఇందులో ఏముంది."

"ఇందులో ఏముందని తీసి పారెయ్యకండి. ఆ చిరుత బతికుంటే మరెన్ని ప్రాణాలు పోయేవో యెంతమంది చచ్చినా ఆ జమిందారు లెక్కచేసేవాడు కాదు. అవసరం అయితే బారుతుపాకి ఒకటి చేతిలో పట్టుకుని కొంగల్ని కాలుస్తాడుగాని, ఇలాంటి వాటినుండి జనాన్ని మాత్రం రక్షించడు" అన్నాడతను.

"వన్యమృగ సంరక్షకుడు" అన్నాడు చిన్ని.

అతను నవ్వాడు

"సరే, మేం వెళ్తాం. మరోసారి కలుసుకుందాం" అన్నాడు సృజన్.

"తప్పకుండా."

అందరూ కారు దగ్గరకు నడుస్తున్నారు.

సృజన్ అతన్ని అడిగాడు.

"ఇంతకూ ఈ విషయం మీద మీకెందుకింత ఇంట్రెస్టు."

"మేకీ నా చెల్లెలు కాబట్టి."

# 9

అర రాత్రి దాటింది.

నిశ్శబ్దపు గుండెలమీద పాతకాలపు గడియారం కొట్టిన చెవ్వల ప్రకంపనాలింకా ఆ గదిని ఆవరించుకున్నాయి. సృజన్ లేచాడు. విజయ్ రూమ్ దగ్గరకు వెళ్ళాడు. అపరకే నిలబడి యెదురు చూస్తున్నాడు విజయ్, చిన్నితో కలిసి మెల్లగా అడుగులు వేసుకుంటూ.

"మీ గదుల్లో యేమైనా."

"నో....ఏమీ లేదు."

చాలా మెల్లగా మాట్లాడుకుంటున్నారు.

పైన ఖాళీగా వున్న గదులన్నింటినీ పరిశీలించారు. గోడలను తడిమి చూశారు. వాటినిండా యెవరెవరివో పెద్దపెద్ద చిత్రాలున్నాయి. రాజరికం వలకబోస్తూ, కొన్నింటిలో అంతులేని క్రూరత్వం కొట్టొచ్చినట్లు కనపడుతోంది. వాటన్నింటిని గమనిస్తూ ఆయా గదుల్లో ప్రతిభాగం క్షుణ్ణంగా పరిశీలించారు. ఎలాంటి ఆధారం లభించలేదు.

సృజన్ భృకుటి ముడిపడింది.

ఆలోచిస్తున్నాడు.

"సంధ్య తాతగారి గదిలో యేమైనా" మెల్లగా అన్నాడు చిన్ని.

కొరడాతో వీపుమీద చరిచినట్లు ఉలిక్కిపడ్డాడు.

"కరెక్టు. నీ ఆలోచన నిజం అయితీరుతుంది."

అప్పుడు వినిపించింది.

గడియారం రెండు గంటలు కొట్టిన శబ్దం.

ఉలిక్కిపడ్డారు.

"సరే రేపు ట్రైచేద్దాం" అన్నాడు సృజన్.

ఎవరి గదుల్లోకి వారు వెళ్ళిపోయారు.

మర్నాడు కాలకృత్యాలు పూర్తయ్యాక తిరిగి అందరూ ఆ పురాతనకాలంనాటి డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు.

"సంధ్యా..మీ తాతగారింతవరకు దర్శనం ఇవ్వలేదు" అన్నాడు సృజన్.

"ఆయనెక్కడికో వెళ్ళారు?"

"ఎక్కడికి వెళ్ళుంటారు?"

"అదెవరికీ చెప్పరు."

"ఓహ్! పోనీ యెప్పుడు వస్తారు."

"బహుశా, ఈ రాత్రికి....ఎందుకు?"

"జస్టు చూడాలని."

"చాలా భయంకరంగా వుంటాడు" అంది నవ్వుతూ.

"అలాగా. సరేగాని ఏం తోచటంలేదు, ఈ కోటంతా చూపించవా" అడిగాడు సృజన్.

"అలాగే చూద్దాం."

బ్రేక్ఫాస్టు పూర్తయింది. సంధ్య వెంటరాగా మొత్తం కోటంతా చూడటానికి బయలుదేరారు.

రకరకాల మంచాలు....దిళ్ళు..దుప్పట్లు.... టేకుతో చేయబడ్డ అమూల్యమైన వస్తువులు .... మహత్తరమైన కళాఖండాలు అన్నీ గదుల్లో మూలుగుతున్నాయి. వాటన్నిటినిండా బూజుపట్టి వుంది. అవి ఆ కోటలో సమాధి కావల్సిందేమో ననుకున్నారు.

సంధ్య వాళ్ళ తల్లితండ్రుల గదిని చూపించింది. కిరణ్ గదిని చూపించాక అతన్ని అర్థం చేసుకోగలిగారంతా.

ఆ గదినిండా కళాత్మకత ఉట్టిపడుతోంది.

గోడలకున్న తైలవర్ణ చిత్రాలు అమోఘంగా వున్నాయి.

గోడకు తగిలించబడ్డ పిల్లనగ్రోవి పలకరిస్తోంది.

సన్నగా గాలివీచింది.

పిల్లనగ్రోవినుండి దూసుకెళుతూ వుండగా వచ్చిందో వింత శబ్దం!

చిన్ని వెళ్ళి దాన్ని అందుకున్నాడు.

"మీ తాతగారి గది చూపించవా" అనడిగాడు సృజన్.

"అమ్మో" అంది సంధ్య.

"ఏమిటి?"

"ఆయన గదికి యెవరూ వెళ్ళకూడదు."

"నువ్వు కూడానా."

"నేనైనాసరే ముందు ఆయన అనుమతి పొందాలి."

"అలాగా" అన్నాడు ఆలోచిస్తూ.

"ఎటూ ఆయన లేడుగా చూసివద్దాం" అన్నాడు తిరిగి సృజన్.

సంధ్య ఇబ్బందిగా చూసింది.

తర్వాత సంధ్య ఒక తాళంచెవి తెచ్చి ఇచ్చింది.

"మీరో పని చెయ్యాలి. ఆ గదిలో ఏ వస్తువును టచ్ చెయ్యకండి. చూసిన వెంటనే లాక్ చెయ్యండి" అంది సంధ్య.

"నువ్వు రావా?"

"నాకా కొంచెం తలనొప్పిగా వుంది రెస్టు తీసుకుంటాను."

"అలాగే."

సంధ్య వెళ్ళిపోయింది. రావ్‌బహద్దర్ గదిముందు

నిలబడ్డారు.

ఎత్తయిన తలుపులు గంభీరంగా వున్నాయి.

సృజన్ మిత్రులవంక చూశాడు.

మృత్యు గృహాంలోకి అడుగు పెడుతున్నట్లనిపించింది.

తాళం తీశాడు.

తలుపు ముందుకు నెట్టాడు.

లోనికి ప్రవేశించారు.

తిరిగి తలుపు మూసేశారు.

గోడలనిండా జంతువుల చర్మాలు....తలలు....తుపాకులు....

వాటి నడుమ....

నిలువెత్తు పటంలో

కళ్ళనిండా క్రూరత్వం నింపుకొని రాచరికపు హోదాతో....

రావ్ బహద్దర్!

గదంతా పరిశీలించటం మొదలు పెట్టారు.

చిన్ని రావ్ బహద్దర్ బట్టల్ని....పాదుకల్ని పరిశీలిస్తున్నాడు.

విజయ్ మూలగా వున్న చోటుకి వెళ్ళాడు.

అక్కడ ఓ లెదర్ కేసు వుంది. జిప్ లాగాడు.

ధగధగలాడుతుంది!

వజ్రాలతో పొదగబడ్డ పిడిగల కత్తి!

దానికి రెండువైపులా పదును వుంది.

దాని మొనమీద బొటనవ్రేలు వుంచాడు.

క్షణంలో మొదలయింది ఓ రక్తపుచుక్క.

క్రమంగా పెద్దదవుతూ.

"ఇదేంటో బలిగోరే కత్తిలా ఉందే!"

అనుకుంటూ వెనక్కి తిరిగాడు.

అప్పుడు వినపడిందో శబ్దం... !

తలుపు తెరుచుకుంటున్న సవ్వడి.

సృజన్ ఆనందంగా చూస్తున్నాడు.

భూగర్భంలోకి మెట్లు కనిపిస్తున్నాయి.

"కమాన్" అరిచాడు మెల్లగా.

ఇద్దరూ అలానే బయలుదేరారు.

చిన్ని బొడ్డులోనుండి పిల్లనగ్రోవి తీశాడు.

విజయ్ కోపంగా చూస్తూ నడుస్తున్నాడు.

"బీకేర్ ఫుల్" అన్నాడు సృజన్.

మెట్లు అంతం అయ్యాయి.

తిరిగి గోడంతా తడిమారు. గోడకు ఓ బటన్‌లాంటిది వుంది. దాన్ని ప్రెస్ చేశారు.

అంతా చీకటిగా వుంది.

ముగ్గురూ మెల్లగా తడువుకుంటూ క్రిందకు వెళ్ళారు.

ఎక్కడినుండో సన్నటి వెలుగురేఖ పడుతోంది.

దాన్ని అనుసరిస్తూ ముందుకు బయలుదేరారు.

మెల్లగా ఆఖరు మెట్టు దిగారు.

ఆ క్షణం వినిపించిందో స్వరం!

గుండె లోతుల్ని కొలుస్తూ....

విషాదాన్ని... ప్రేమను నింపుకొని.

అగాధాల లోతులనుండి హిమాలయాల ఎత్తులదాకా!

స్తంభించి నిలబడ్డవారిని

మేలుకొల్పింది—ఆ పాట!

## 10

"కిరణ్ !.... నీకు దుఃఖంలోనూ పాటలే!" ఎగతాళిగా అన్నాడు రావ్ బహద్దుర్.

"తాతగారూ" అరిచాడు కిరణ్.

"ఊ" అంటూ గంభీరంగా ఉరిమాడు.

"ప్రేమల్ని శాసించినవాడు చరిత్రలో మిగలలేదు."

"మీ ప్రేమికులు నిలబడ్డారా?"

"ప్రేమ అనంతమైనది."

"ఛ .... ప్రేమ .... మన దేశంలో ప్రేమలకు చావు లేదు. భార్యను ప్రేమించటానికయినా కొన్ని హద్దులున్నాయి. ఈ కోటలో బిడ్డకూ, తల్లికీ కూడా నియమాలున్నాయి. ఇంతకాలం అలాంటి క్రమశిక్షణ ఉండబట్టే మా వైభవం ఇంకా కొనసాగుతుంది. కానీ నువ్వు ఈ వంశాన్నే భ్రష్టు పట్టించదలుచుకున్నావు. ఓ అలగా మనిషిని ప్రేమించానంటూ బయలుదేరావు. యేదోలే సరదా తీర్చుకొని వదిలేస్తావనుకున్నాను. కానీ మన ఆస్తుల్ని దోచుకోమంటూ జనాల్ని తిరుగుబాటు చేయించటానికి పూనుకున్నావు. ఈ నేరాన్ని మాత్రం క్షమించను. నా బిడ్డయినా సరే ఈ వంశం పునాదుల కదిలించాలనే వెర్రి ప్రయత్నంచేస్తే ఈ రాన్ బహద్దర్ న....లి....పే ...స్తాడు" ఒక్కొక్కమాట వత్తిపలుకుతూ అన్నాడు.

అంతలోనే ఆయన కంఠం మారిపోయింది.

"చూడు కిరణ్. ఈ జమీ నీది. ఈ ఆస్తులు నీవి. ఇదంతా మీకోసమే. నువ్వు మూర్ఖపు పట్టుదలను మానుకోవాలి. మన వంశం నాతోనే ఆగిపోకూడదు. నువ్వు ముందుకు తీసుకుపోవాలి. నువ్వు ఊ అంటే చాలు మన కోటవాకిట్లో వందలాది అప్సరసలు నీకోసం యెదురు చూస్తుంటారు. నువ్వా పేరీని మరిచిపో....రా....మన ఎస్టేట్ వ్యవహారాలన్నీ స్వయంగా చూస్కో."

"ఈ రక్తపు కూడు నాకొద్దు."

"రక్తపు కూడా" ఆగి నవ్వాడు. ఆ నవ్వులో తర తరాల అధికారదర్పం మిళితమై వుంది.

"నీ అణువణువులో వుంది ఆ రక్తమే. అందుకని ఛస్తావా?"

"ఆ పాపం పోవటానికి ఎవడి భూములు వాడికిచ్చి, యెవరి ఆస్తులు వారికి పంచితే మనం ప్రశాంతంగా బ్రతుకుదాం."

"ఊ" అన్నాడు గంభీరంగా రావ్ బహద్దర్.

"ప్రశాంతత. ఊరవతల....పచ్చికలో నువ్వు పాడుతుంటే__నీ వడిలో అది పడుకుంటే ప్రశాంతత. జీవితానికి అర్థం బాగా చెప్పావ్. నువ్వు నీ అభిప్రాయాలు మార్చుకోవన్నమాట. చివరిసారిగా అడుగుతున్నాను. నువ్వు నా మార్గంలోకి రా."

"క్షమించండి తాతగారూ....మీ వృద్ధాప్యంలో మా గురించి ఇంత శ్రమెందుకు. నేను చెప్పినట్లు చెయ్యండి."

"ఆపు" అరిచాడు. "గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందట తాతకు దగ్గులు నేర్పుతున్నావ్. పరువుకోసం ప్రాణాలిచ్చే వంశంలో ఈ రావ్ బహద్దర్ పుట్టాడు. నువ్వు అనుభవిస్తావు" చర, చరనడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

చిన్ని ముందుకు కదిలాడు.

స్రుజన్ వారించాడు.

"మే... రీ" కిరణ్ కేక.

ఎక్కడో చిన్న మూలుగు.

కిరణ్ వెక్కిళ్ళు వినిపిస్తున్నాయి.

"కిరణ్ ....ఈ నరకం భరించలేను .... నేను వెళ్ళి

పోతున్నాను....'' మేరీ గొంతు.

"మేరీ.... మేరీ....అన్యాయం."

"కాదు. నేను చెడిపోయాను."

"లేదు. నువ్వు చెడిపోలేదు."

కటకటాల అవతల మేరీ నేలపై నిస్సత్తువుగా పడి వుంది.

"మేరీ .... మేరీ" రుద్ధ కంఠంతో అంటున్నాడు కిరణ్.

మేరీ శరీరంమీద చీర పేలికలయి వుంది. శరీరం నిండా రక్తపు మరకలతో గడ్డకట్టుకుపోయి వున్నాయి, అసహ్యంగా.

ఆమె కష్టంమీద కళ్ళు తెరిచింది.

"నన్ను నాశనం చేశారు కిరణ్."

"అలా మాట్లాడకు మేరీ....నువ్వు నాశనం కాలేదు. నువ్వు పవిత్రమైనదానివి. ఆ దోషం నీకు అంటదు" కటకటాలనుండి కిరణ్ అంటున్నాడు.

"లేదు కిరణ్. ఒక్క రోజు కాదు. పదిరోజులనుండి ఒక్కడు కాదు. ఎందరెందరో. ఈ నరకం ఇంకా భరించలేను."

"మేరీ నేను నీ శరీరాన్ని ప్రేమించటంలేదు."

"అయినా సరే. కడసారి నిన్ను చూడటం కోసం మాత్రమే ఇన్ని రోజులు బ్రతికున్నాను. ఇప్పుడు తృప్తిగా వెళ్ళిపోతున్నాను" అంది మేరీ తల వాల్చేస్తూ.

"మేరీ" దిక్కులు పిక్కటిల్లేటట్టు అరిచాడు.

కిరణ్ అదురుపడు ఉలిక్కిపడ్డాడు చిన్ని.... చేతిలో వున్న పిల్లనగ్రోవి జారిపడి దొర్లుకుంటూ వెళ్ళింది.

మేరీ చివరి చూపులు....ప్రేమగా....నిశ్చలంగా....

పిచ్చిగా జుట్టు పీక్కుంటున్న కిరణ్ దగ్గరకు దొర్లింది పిల్లనగ్రోవి.

చివ్వున తలెత్తాడు.

కళ్ళముందు శవం!

తన ప్రక్క వేణువు.

అందుకున్నాడు.

రావ్ బహద్దర్ అరిచాడు.

“ఎవరక్కడ?”

సృజన్ ....చిన్ని ....విజయ్ ఎలర్టు అయ్యారు.

“వెతకండి” అరుస్తున్నాడు

నల్లటి తుమ్మ మొద్దుల్లాంటి ఇద్దరు అజానుబాహువులు ఆ వైపుకొచ్చారు. వారిలో ఒకడికి ముందు చిన్ని కనబడ్డాడు. బరిసె విసరబోయేవాడల్లా ఓ క్షణం అనుమానంతో ఆగాడు.

మరుక్షణం గుండెల్లో పొడిచాడు.

మెరుపులా ప్రక్కకు దూకాడు చిన్ని.

అయినా సరే చొక్కాను రాసుకుంటూ వెళ్ళి గోడకు దిగబడింది.

చిన్ని వెర్రికేక వేశాడు ఆగ్రహంతో.

గాల్లోకి ఎగిరాడు.

రాకెట్ వేగం! గుండెలమీద రెండు కాళ్ళు ఒక్కసారే అప్లయిచేశాడు. పెనుగాలికి చెట్టు ఊగినట్టు ఊగినట్టు వూగి క్రిందపడ్డాడు.

రెండోవాడు విజయ్‌కు గురిచూసి విసిరిన బాకును గాల్లోనే అందుకున్నాడు. దాన్ని మోకాలుమీద చరిచాడు.

నడుముకు వంగిపోయింది.

దాన్ని మూలకు విసిరేశాడు. పిడికిలి బిగించి కడుపులో ఓ దెబ్బ కొట్టాడు.

అప్పుడు గాల్లోకి ఎగిరిన విజయ్ నోటినుండి వెలువడింది స్వరం. మరుక్షణం ధృతరాష్ట్రుడి వీపుమీద బలంగా పడిందో ఇండియన్ మేడ్ పిడిగుద్దు!

వాడికి ఓ క్షణం ఏమీ అర్థంకాలేదు.

అంతా శూన్యంగా వుంది.

ఆ తర్వాత పిచికారీ కొట్టినట్టుగా నోటినుండి రక్తం భళ్ళున పడుతుండగా క్రిందకు వాలిపోయాడు.

సృజన్ ఆసరికే పరుగెత్తుకెళ్ళి కిరణ్ ముందు నిలబడ్డాడు. జైలులాంటి ఆ గదిలో పిచ్చెక్కినవాడిలా వున్నాడు కిరణ్.

క్షణంలో జరిగిన ఈ మార్పులకు రావ్ బహద్దర్ వదనం ఒక్కసారి మాడిపోయింది. చేతిలో హంటర్ గాలిలోకి లేచి సృజన్ వీపుమీద పడింది. చొక్కాని చీల్చి శరీరాన్ని ముద్దాడింది.

చివ్వున అటువైపు తిరిగాడు.

"కి....ర....ణ్" అన్నాడు రావ్ బహద్దర్ కంగారుగా. ఆయన కళ్ళలో ఆశ్చర్యం! అనుమానం! ఏవేవో జ్ఞాపకాలు!

సృజన్ ఆయన చేతిలోని హంటర్‌ను విసురుగా లాగాడు.

అప్పుడు తేరుకున్నాడు రావ్ బహద్దర్.

హంటర్ విసిరి జైలు తలుపులను ఎగిరి తన్నాడు సృజన్.

చువ్వలు వంగిపోయాయి.

కిరణ్ చూస్తున్నాడు మేరీవంక.

మేరీ చూస్తోంది శూన్యంలోకి.

మరోసారి తన్నేసరికి మనిషి వచ్చే ఖాళీ ఏర్పడింది.

కిరణ్ చేతిలోని వేణువు కమ్మలకేసి బాదాడు. విరిగి పోయింది.

మొన పదునుగా వుంది.

గదినుండి బయటకు వచ్చాడు.

రావ్ బహద్దర్ ఆగ్రహంతో మండిపోతున్నాడు.

అయానకంతా ఫజిల్ లా వుంది.

కిరణ్ సుడిగాలిలా దూసుకుపోయాడు.

ఆవేశంతో బ ల ం గా వేణువు.... రావ్ బహద్దర్ పొట్టలో పొడిచేశాడు.

రక్తం వరదలు గా పారుతోంది.

రావ్ బహద్దర్ కడుపు చేత్తో పట్టుకుంటూ అరిచాడు.

"చంపండి.... చంపండి."

అరుస్తూనే పడిపోయాడు. మెల్లగా ప్రాక్కుంటూ వెళ్ళి అక్కడ వున్న గంటను ప్రమోగించాడు. బిలబిల మంటూ దూసుకొచ్చారు ఓ పదిమందిదాకా.

కిరణ్ కు ఇవేం పట్టడంలేదు.

మేరీముందు నిశ్చలంగా నిలబడి చూస్తున్నాడు.

చేతికంటిన రక్తంతో మేరీ నుదుర తిలకం దిద్దాడు. అక్కడకు వచ్చినవారికి రావ్ బహద్దర్ ను ఆ స్థితిలో చూసేటప్పటికి ఉద్రేకం వచ్చింది. ఒకడు బరిసె తీసుకుని కిరణ్ మీదకు పోతున్నాడు.

విజయ్ పెద్దగా గొంతెత్తి అరిచాడు.

అప్పటికే ఆలశ్యం అయింది.

కిరణ్ యెన్నులోనుండి దూసుకుపోయి బయటకు వచ్చింది బరిసె మొన....

'కెవ్వున' అరిచాడు కిరణ్.

ఆ అరుపులో మరో అరుపు కలిసిపోయింది. విజయ్ విసిరిన కత్తి పిడివరకు దిగబడింది బరిసె విసిరిన వ్యక్తి కడుపులో.

సృజన్....

చిన్న....

విజయ్....

కిరణ్ వంక చూశారు.

అతని ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి.

అతని చేయి మేరీ చేతిని పట్టుకొని వుంది.

ఆగ్రహంతో మండిపోయారు.

సృజన్ హృదయాన్ని కదిలించిందా దృశ్యం.

అతని పిడికిలి బిగుసుకుంది.

అతనిలో మానవత్వం తాలూకు ఛాయలు అదృశ్యం అయ్యాయి.

గాల్లోకి లేచిన అతని నోటినుండి వెలువడుతుందో శబ్దం. వందకందిరీగలు గిర్రున తిరిగేటప్పుడు వచ్చే శబ్దం.

ఆ మూమెంట్స్ ఎవరికీ అర్ధంకావటంలేదు.

రావ్ బహద్దర్ కళ్ళు మూతలు పడుతున్నాయి.

రక్తం ఇంకా ధారాపాతంగా కారిపోతుంది.

ఆ చివరి క్షణాల్లో ఆయన కళ్ళముందు మెరుపులు కనిపిస్తున్నాయి. ఒక్కొక్కరు నేలమీద పడుతున్నారు. తిరిగి వారు లేవటంలేదు.

దాదాపు పదినిముషాలు సాగిందలా.

సృజన్ ఆగాడు.

అప్పటికెవరూ లేరు.

ప్రళయ భీకరంగా కనిపిస్తున్నాడు సృజన్.

ఆ క్షణంలోనే....

రావ్‌బహద్దర్ ఆశ్చర్యంగా చూస్తుండగానే ప్రాణం ఎగిరిపోయింది.

• • •

"నా కాళ్ళక్రింద భూమిలో ఇన్ని రహస్యాలున్నాయని నాకు తెలియదు. యేమైనా నేను ఒంటరిదాన్నయిపోయాను" అంది సంధ్య, తాత అన్న వదినల అంత్య క్రియలు జరిగాక.

సృజన్ మాట్లాడలేదు.

"ఏది ఏమైనా నాకు ముగ్గురు అన్నలు దొరికారు. అదే అదృష్టం" అంది.

"నేను ఇంగ్లాండు వెళ్ళదలుచుకున్నాను. మీరు ఉత్తరాలు రాస్తుండాలి. అదే నా చివరి కోర్కె" అంది సంధ్య.

"తప్పకుండా" ముక్తకంఠంతో అన్నారంతా.

"విత్‌యువర్ పర్మిషన్ ఈ కత్తి నేనుంచుకుంటాను" అన్నాడు విజయ్.

"అంతకంటేనా" అంది సంధ్య.

"ఈ భూములూ.... ఈ ఆస్థులూ...." అడిగాడు సృజన్.

"వీటిగురించి నేను పట్టించుకోను. మనశ్శాంతి కావాలి ముందు నాకు."

"సో.... మేం వెళ్తాం. మరలా కలుసుకుందాం." అన్నాడు సృజన్.

## 53

"మరలా మనం కలుసుకోగలమా అన్నయ్యా!" గాద్గదికంగా అంది.

సంధ్య కళ్ళవెంట నీళ్ళు.

"తప్పకుండా కలుసుకుంటాం చెల్లీ" ధృఢంగా అన్నాడు.

సంధ్య తడికళ్ళతో వీడ్కోలిచ్చింది.

భారంగానే బయలుదేరారు ముగ్గురూ తమ కారులో.

—:అయిపోయింది:—

# నాలుగు హత్యలు

## బొమ్మిడి అచ్చారావు

"వాట్, ఒక్క రాత్రిలో నాలుగు హత్యలా? పిటీ!" అన్నాడు డిటెక్టివ్ కిరణ్.

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ అశాంతిగా పచార్లు చేస్తున్నాడు.

"ఒకదానికొకటి సంబంధం లేనట్టుగా వున్నాయి. ముడి విడదీయబోతే మరింత బిగిసిపోతోంది. నాలుగు హత్యలు నాలుగు విభిన్న పద్ధతుల్లో జరిగాయి. నాలుగు చోట్లలో యే ఒక్కచోటా ఆధారాలు వదలకుండా తెలివిగా తప్పించుకున్నారు హంతకులు!" అన్నాడు.

"అయితే ఏ ఒక్క కేసూ డిస్పోజ్ కాలేదన్న మాట!"

"అదేగదా నా బాధ! ఇదిగో ఒక్కో కేసు తాలూకు వివరాలు విడివిడిగా ఫైలు చేశాను, చూడు!" శ్రీనివాస్ నాలుగు ఫైల్స్ అతనిముందుకు తోశాడు.

మొదటి ఫైలు తెరిచాడు కిరణ్. హతుడి పేరు

రవిరాజ్. బిజినెస్‌మాన్. వయస్సు యిరవై ఆరు సంవత్సరాలు. హైదరాబాద్‌లోనే కోఠీలో ఓ జనరల్ స్టోర్సు నడుపుతున్నాడు. మార్చి పదో తేదీ శనివారం రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో అతని శవం హుసేన్ సాగర్‌లో తేలూ కనిపించింది. అంతక్రితం రెండు రోజులయి అంటే మార్చి ఎనిమిదో తేదీన అతన్ని చంపి సాగర్లో పారేసి వుండొచ్చని పోలీసులు భావిస్తున్నారు.

రవిరాజ్‌కి పెళ్ళి కాలేదు. అతనికి తల్లితప్ప నా అనేవాళ్ళు లేరు. అతని కారెక్టర్ మంచిదికాదని చెప్పుకుంటారు. ప్రతిరోజూ విస్గా తాగుతాడు. చాలామంది అమ్మాయిలతో విచ్చలవిడిగా తిరుగుతాడు. ఒకోసారి అమ్మాయిలతో నాలుగైదు రోజులు విహారయాత్రలకు పోయి వస్తుంటాడు. అతను తిన్నగా షాపు తెరిచి కూచోవటం అరుదు. తాతలు సంపాదించింది బాగానే వుంది. జనరల్ స్టోర్సు కేవలం కాలక్షేపానికి మాత్రమే నడుపుతున్నాడు.

ఇవీ అతని వివరాలు.

కిరణ్ ఆ దే ఫైల్లో వున్న వివిధ భంగిమల్లో శవానికి తీసిన ఫోటోలను పరిశీలనగా చూశాడు.

దాని తర్వాత డాక్టర్ రిపోర్టు చూశాడు.

అతని మెడమీద గొంతు నులిమిన లక్షణాలు స్పష్టంగా కనిపించాయి. మెడనరాలు డివైడ్ చేయబడిన గుర్తులు దొరికాయి. ఇద్దరు లేక ముగ్గురు గొంతు నులిమి చంపేసి వుండొచ్చునని, ఆ తర్వాత సాగర్లో తోసేసి వుండొచ్చునని డాక్టర్ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడందులో.

"శవాన్ని గుర్తుపట్టారా?" అనడిగాడు కిరణ్ శ్రీనివాస్ వంక దృష్టి నిలిపి.

"ఆc! తల్లి గుర్తుపట్టింది. ఇంకా అతని నైబర్స్ తెలిసినవాళ్ళు కూడా అతన్ని గుర్తుపట్టారు. అతని తల్లి గుండె పగిలిపోయేలా శోకాలు పెట్టింది. ఆమె ముసలి ప్రాణం అతని మరణ వార్త విని తట్టుకోలేదో మోనని భయపడ్డాం. ముసలామె గట్టిదే!"

"అతని దుస్తుల్లోగాని, అతని షాపులోగాని కేసుకి సంబంధించిన ఆధారాలేమీ దొరకలేదా?"

"ఊహుc! అతని దుస్తుల్లో యాభై రూపాయిలనోటు చివికిపోయి వున్నది. చిల్లర కాయిన్స్ రెండు ఆ నోటుతో బాటు పర్సులో దొరికాయి. అంతే మరేంలేవు. అతని షాపులో యిద్దరి అమ్మాయిల ఫోటోలు మాత్రం కాష్ బాక్స్‌లో దొరికాయి" అన్నాడు శ్రీనివాస్.

"ఆ అమ్మాయిల వివరాలు సేకరించలేదా?"

"ఇంకా పూర్తి వివరాలు అందలేదు!"

కిరణ్ రెండో ఫైలు తీశాడు.

హతురాలి పేరు కోమలి. వయసు యిరవై రెండు— యిరవై మూడు మధ్య. యూనివర్సిటీలో సైకాలజీలో పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తోంది. ఫైనలియర్. మార్చి యెనిమిదో తేదీ సాయంత్రం యూనివర్సిటీ కాలేజినించి తిరిగిరాలేదు. ఆమె తండ్రి విద్యానగర్‌లో వుంటున్నాడు. తొమ్మిదో తేదీ ఉదయం పోలీసులకు రిపోర్టు చేశాడు. పోలీసులు రంగంలోకి దిగి పదో తేదీ సాయంత్రానికి ఆమె శవాన్ని యూనివర్సిటీ— తారనాక మధ్య రోడ్డులో నిర్మానుష్యంగా వున్న నేషనల్ ఇన్స్టిట్యూట్

ఫర్ ఫారిన్ లాంగ్వేజస్ ఆఫీసుకి దగ్గర్లో పొదలుమధ్య కనుక్కొన్నారు.

డాక్టరు రిపోర్టు ప్రకారం — ఆమె మానభంగం చేయబడ్డ తర్వాత విష ప్రయోగంవల్ల చంపబడింది. మానభంగానికి పాల్పడ్డవాళ్ళు యిద్దరు లేక ముగ్గురుండ వచ్చునని ఆయన అభిప్రాయపడ్డాడు. తొమ్మిదో తేదీ రాత్రి పదిగంటల ప్రాంతాల ఆమెకు విషప్రయోగం జరిగుండవచ్చునని, విషప్రయోగానికి ఓ అరగంటముందు మానభంగం జరిగుంటుందని ఆయన వివరించాడా రిపోర్టులో. ఆమె ఫోటోలు వివిధ భంగిమల్లో వున్నాయి.

కిరణ్ ఆ ఫైలుకూడా మూసి శ్రీనివాస్ వైపు జరిపి, "ఈ కేసులో కూడా ఏమీ వివరాలు, సేకరించ లేదా? ఆధారాలేం దొరకలేదా?" అనడిగాడు.

శ్రీనివాస్ తల అడ్డంగా తిప్పి, "మొత్తం నాలుగు కేసుల్లోనుకూడా ఆధారాలేం దొరకలేదు. కనీసం అను మానితులు కూడా లేరు" అన్నాడు.

కిరణ్ నవ్వి, "ఆధారాలు దొరక్కపోవటంలో వింతేంలేదుగాని, మీ పోలీసులకి అనుమానితులు దొరక్క పోవటం వింతగానే వుంది. ఈపాటికి కేసు కోసం ఎవర్నో కర్చి బుక్ చేసి కేసు బనాయించేసి వుండేవాళ్ళు మరొకరయితే!" అన్నాడు.

శ్రీనివాస్ తనూ నవ్వేసి, "యూ ఆర్ రైట్! మావాళ్ళు అంతటి ఘనులే! కాని నేను పూర్తిగా సంతృప్తిపడేవరకు ఎవర్నీ ముగ్గులోకి లాగను. ఓ నిరప రాధిని అనుమానంమీద లాకప్‌లో పెట్టడం అన్యాయ మని భావించే వాళ్ళలో నేను మొదటివాడ్ని!" అన్నాడు.

కిరణ్ మూడో ఫైలు తీశాడు.

ఓ నడి వయసు స్త్రీ, వయసు నలభై సంవత్సరాలుండొచ్చు. మార్చి తొమ్మిదో తేదీ అర్ధరాత్రి తర్వాత ఆమెను హత్యచేసి వుంటారని డాక్టరు అభిప్రాయం. ఆమె శవాన్ని గుర్తుపట్టిన వాళ్లెవరూ లేరు అప్పటివరకు. ఆమె పేరు తెలియదు. ఆమె తలమీద పెద్ద గాయముంది. బలమైన ఆయుధం దేనితోనో తలమీద మోది చంపేశారు.

ఆమె శవం విజయవాడ రోడ్‌న వున్న పొలాలమధ్య ఓ పౌల్ట్రీఫారం పక్కన పడివుంది. ఉదయమే కోళ్ళకు మేత వేసే పౌల్ట్రీఫారం పనివాడు శవాన్ని చూసి వెంటనే పోలీసులకు తెలియజేశాడు. ఈ హత్యకూడా తొమ్మిదో తేదీ రాత్రే జరిగింది. పదో తేదీ ఉదయమే శవం కనుక్కోబడింది. శవాన్ని ఐడెంటిఫికేషన్ నిమిత్తం మార్చ్యురీ దగ్గర రెండు రోజులుగా ఎగ్జిబిట్ చేసి వుంచారుగాని, ఎవరూ యిప్పటిదాకా శవాన్ని గుర్తించలేదు.

కిరణ్ నాలుగో ఫైలు తెరిచాడు.

హతుడి పేరు భాస్కరం. వయస్సు ముప్ఫయి సంవత్సరాలు. జూనియర్ లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. అతనికి భార్య, ఇద్దరు పిల్లలు వున్నారు. మార్చి తొమ్మిదో తేదీ అర్ధరాత్రి అతని శవాన్ని నల్గొండ చౌరస్తా దగ్గర నడిరోడ్డుమీద పడివుండగా చూసిన యెవరో పోలీసులకి తెలియజేశారు. పక్కనే స్కూటర్ కూడా వుంది. అది భాస్కరానిదే. యే లారీయో, మరేదో వాహనమో అతని మీదుగా పోయి వుంటుందని మొదట అభిప్రాయపడ్డారుగాని, పోలీసులు రంగప్రవేశంచేసి యిన్వెస్టిగేట్ చేసేసరికి, భాస్కరం ఏక్సిడెంట్లో పోలేదనీ, ఎవరో కత్తితో

ఒంటినిండా తూట్లు పొడిచేసి నడిరోడ్డుమీద పారేశారనీ బయటపడింది.

మార్చి తొమ్మిదో తేదీ రాత్రి పది-పదకొండు గంటల మధ్య హత్య జరిగినట్టు డాక్టరు ధృవీకరించాడు.

కిరణ్ ఆ ఫైలుకూడా శ్రీనివాస్‌కి తిరిగి ఇచ్చేశాడు.

"ఇంతకీ, యీ నాలుగు హత్యలకూ మోటివ్ ఏమిటో నీకరమయిందా? పోనీ ఒకదానితో మరొకటి ముడిపడి వున్నాయేమో ఆ విషయం కన్ఫర్మ్ చేసుకున్నావా?" అనడిగాడు.

"నాకు తెలిసినంతవరకు, యీ నాలుగూ నాలుగు విడివిడి కేసులే! ఈ హతులెవరికీ ఒకరితో మరొకరికి ఎలాంటి సంబంధ బాంధవ్యాలు లేవు. అందుకే కేసు అసలు, కొంచెంకూడా ముందుకి కదల్లేదు!"

కిరణ్ శ్రీనివాస్ వంక తిరిగి, "సీరియల్ నంబరుగా ఇన్వెస్టిగేట్ చేద్దాం. ముందు రవిరాజ్ యింటికి వెళ్దాం, పద!" అన్నాడు లేస్తూ.

శ్రీనివాస్ లేచి అతన్ననుసరించాడు.

కిరణ్ తన టయోటా స్టార్టుచేశాడు.

## 2

రవిరాజ్ యిల్లు బజార్ ఘాట్‌లో వుంది ఇల్లు పెద్దదే! అంత పెద్ద యింట్లోను అతను తల్లితో వుంటు న్నాడు.

రవిరాజ్ తల్లి శోకదేవతలా, లోకంలోని విషాదా న్నంతటినీ తనలోనే నింపుకొని కనిపించింది డిటెక్టివ్‌లకు.

"అమ్మా, మీ అబ్బాయి గురించిన కొన్ని వివరాలు కావాలి! మీరు శ్రమనుకోకుండా సమాధానాలు చెప్పాలి" అన్నాడు కిరణ్.

రవిరాజ్ తల్లి వచ్చే దుఃఖాన్ని బలవంతాన ఆపుకుని, "నెట్టంత కొడుకుని పోగొట్టుకున్నాను. అయినా నా ప్రాణం పోలేదు. మొండిగా బతికే వున్నాను. అడగండి, చెప్పటానికే బతికున్నాను" అన్నది.

"మీరు దుఃఖావేశాన్ని కొంత తగ్గించుకోండి. మీకీ కడుపుకోత కలిగించిన హంతకుడ్ని పట్టుకోవటానికే మా ప్రయత్నం. మీరు చెప్పే ప్రతి విషయం హంతకుడ్ని పట్టుకునే ప్రయత్నంలో మా కుపకరిస్తుంది."

"అలాగే బాబూ! నాకీ వయసులో, గర్భశోకం కలిగించిన పాపాత్ముడ్ని ప్రాణాలతో వదలొద్దు. పట్టి నాకు చూపించండి. వాడ్ని నా చేతుల్తో చంపేసి, నా కొడుకు ఆత్మకు శాంతి కలిగిస్తాను."

"అలాగే!....మీ అబ్బాయి ఎన్ని రోజులుగా మీకు కనిపించకుండా పోయాడు? అంటే చనిపోవటానికి ఎన్నిరోజులు ముందుగా యిల్లు విడిచి వెళ్ళాడు?"

"బుధవారంనించీ కనపడలేదండి!"

కిరణ్ శ్రీనివాస్‌వంక చూసి, "అంటే మార్చి ఏడో తేదీ అన్నమాట! అతని హత్య ఎనిమిదో తేదీన జరిగిందని డాక్టరు రిపోర్టులో వుంది. పదో తేదీన అర్ధరాత్రి శవం సాగర్లో కనిపించింది...." అన్నాడు.

శ్రీనివాస్ గుర్తుపెట్టుకున్నాడు.

"మీ అబ్బాయికి విరోధులెవరైనా వున్నారా?"

"ఏమో బాబూ, ఆ సంగతి నాకు తెలియదు."

"పోనీ స్నేహితులు?"

"ఇద్దరు కుర్రాళ్ళు తరచు వస్తుండేవాళ్ళు. వాళ్ళ పేర్లు మునీర్, స్నేహానంద్. అసలు వాళ్ళే నా బిడ్డను పాడుచేశారు. రత్నంలాంటి కుర్రాడికి తాగుడు అలవాటు

చేసి, వాళ్ళ స్వార్థంకోసం నా బిడ్డను ఉపయోగించు కునేవారు. నేను రవికి ఎంత చెప్పినా తలకెక్కలేదు. విసిగిపోయి వూరుకున్నాను. ఒక్కొక్కపుడు ఇంట్లోనే వాళ్ళని తెచ్చి తాగుతుండేవాడు. అయినా సహించే దాన్ని...."

"మరోలా అనుకోవద్దు. ఆడస్నేహితులెవరైనా ఇంటికొస్తుండేవారా?"

"రవికి ఆడసావాసాలున్నాయన్న సంగతి నా చెవిదాకా వచ్చింది. అనిత అనే అమ్మాయితో ఎక్కువగా తిరుగుతుండేవాడనీ, ఆ పిల్లకోసమని షాపు కూడా మూసేసి చెప్పాపెట్టకుండా వూళ్ళు తిరుగుతుండేవాడనీ తెలిసింది. నేనడిగితే సరుకులు ఆర్డరివ్వటానికి హోల్ సేల్ షాపులకు వెళ్తుండేవాడ్నని చెప్పి మభ్యపెట్టేవాడు."

"ఇన్ని సంగతులు తెలిశాకకూడా అబ్బాయికి పెళ్ళి చెయ్యాలని మీరు ప్రయత్నించలేదా?"

"ఆ ప్రసక్తి తెస్తేనే కస్సుమని నామీద పడిపోయేవాడు. అవసరమయినపుడు తనే చెపుతాననీ, అంతదాకా పెళ్ళి ప్రసక్తి తేవద్దనీ కసురుకునేవాడు. చెప్పి చెప్పి విసిగిపోయి వూరుకున్నాను."

"ఆ అమ్మాయి తరచు యింటికొస్తుండేదా?"

"రెండుసార్లు కాబోలు వచ్చింది."

"ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని మీతో యెప్పుడైనా చెప్పాడా?"

"లేదు బాబూ, నేనే అర్థంచేసుకున్నాను—కనీసం ఎవరొకర్ని పెళ్ళిచేసుకుని ఓ యింటివాడైతే చాలని అనుకుంటుండేదాన్ని కదా, అందుకని అబ్బాయి యిష్ట

పడిన అమ్మాయితోనే పెళ్ళి జరగటం మంచిదనుకునే దాన్ని!"

"ఆ అమ్మాయి గురించిన వివరాలు చెప్పగలరా?"

"వాళ్ళ నాన్నకు ఆబిడ్స్‌లో జోళ్ళ షాపుందిట. వాళ్ళుండేది విజయనగర్ కాలనీ, వివరాలు తెలియవు."

"మీ అబ్బాయికి డైరీ రాసే అలవాటుందా?"

"అబ్బే, అలాంటిదేం లేదు బాబూ? వాడికి రాయట మంటే మహా చిరాకు. పుస్తకాలు చదవటమన్నా కూడా అంతే! ఎప్పుడూ టేప్ రికార్డరు పెట్టుకుని వింటూనో, టి.వి. చూస్తూనో గడిపేస్తాడు యింట్లో! అదయినా, ఒకటి రెండు గంటలే! తక్కిన సమయాల్లో యింటి పట్టునే వుండడు!"

"ఓసారి మీ అబ్బాయి గది చూపిస్తారా? ఏమైనా కొత్త సంగతులు తెలుస్తాయేమోనని మా ఆశ!"

"అలాగే బాబూ, రండి....అదిగో, ఆ గదే, మా రవిది" అంటూ అత్యాంతాధునికంగా వున్న ఓ గదిని చూపించింది రవిరాజ్ తల్లి.

కిరణ్, శ్రీనివాస్ ఆ గదిలో ప్రవేశించారు.

గదిలో డన్‌లప్ బెడ్, టేబిల్, రెండు దెకాలామ్ ఛెయిర్స్, టీపాయ్ వున్నాయి. టేబిల్ మీద స్టీరియో టేప్ రికార్డర్ టూ యిన్ వన్, రికార్డు ప్లేయర్, ఇంగ్లీషు డిస్కులు, కందలకొద్దీ యింపోర్టెడ్ కాసెట్లు, సింగపూర్ నుంచి యింపోర్టు చెయ్యబడ్డ కలర్ టీవీ ఓ పక్కగా, రూంలోకి కాలు పెట్టగానే కనిపించే సరంజామా యిది! ఆ గదిలోని దాదాపు ప్రతి వస్తువు యింపోర్టెడ్‌లాగానే వున్నది!

శ్రీనివాస్ భవగర్భితంగా చూశాడు కిరణ్ వంక,

కిరణ్ తలూపి, గదిలోని వస్తువులు పరిశీలనగా చూస్తు న్నాడు. ముసలామె చెప్పినట్టే యెక్కడా మాగజైన్స్ గాని, పుస్తకాలుగాని చదువుతున్న జాడలేదు రవి.

బెడ్ మీద దుప్పటి చిందర వందరగా పరచబడివుంది. కిరణ్ బెడ్ దగ్గర రెండు క్షణాలు నించుని చూశాడు. బెడ్ పైకెత్తాడు. అతనూహించినట్టే దానికింద నాలు గైదు ఫోటోలున్నాయి. అన్నీ కాబినెట్ సైజులే.

కిరణ్ వాటిని పైకితీశాడు. నాలుగు ఫోటోల్లో ఒకే అమ్మాయి రకరకాల భంగిమల్లో వున్నది. ఒక ఫోటోలో అమ్మాయి మాత్రం వేరుగా వుంది.

కిరణ్ శ్రీనివాస్‌కి ఆ ఫోటోలు చూపించి, "కాష్ బాక్స్‌లో దొరికాయని చెప్పిన ఫోటోల్లో అమ్మాయిలు, యీ అమ్మాయిలు ఒకటేనా చూడు!" అన్నాడు.

శ్రీనివాస్ తల అడ్డంగా తిప్పి, వాళ్ళు వేరు!" అన్నాడు.

కిరణ్ ఫోటోలు వెనక్కు తిప్పాడు. నాలుగురకాల భంగిమలున్న అమ్మాయి ఫోటో వెనక 'టు రాజ్ విత్ అనిత' అని రాసివుంది ముత్యాల్లాంటి అక్షరాలతో.

ఇద్దరికీ సమస్య విడిపోయింది. నాలుగు ఫోటోల్లో వున్న అమ్మాయి అనిత అయితే ఫోటోలో అమ్మాయి ఎవరు?

ఆ గదిలో యిక ప్రత్యేకంగా వెదికేందుకేం లేదని అర్థ మయిపోతూనే వుంది.

ఇద్దరు గదిబయటికొచ్చేసరికి ముసలామె పనిపిల్లతో రెండు కప్పుల్లో కాఫీ పట్టించుకుని వచ్చింది. కప్పులు వాళ్ళిద్దరికీ తనే తీసి అందించింది.

కిరణ్ అయిదో ఫోటో ఆమెకు చూపించి, "ఈ అమ్మాయెవరో గుర్తుపట్టగలరా?" అన్నాడు.

ముసలావిడ కొద్ది క్షణాలు పరిశీలనగా చూసి తల అడ్డంగా తిప్పింది. "ఎప్పుడూ చూడలేదు బాబూ!" అన్నది.

ఆమెకు ఆ ఫోటోలు తీసుకు వెళ్తున్నామని చెప్పి, శ్రీనివాస్‌తో బయటకు నడిచాడు కిరణ్.

టయోటా స్టార్టు చేస్తుండగా శ్రీనివాస్ అన్నాడు, "రవిరాజ్‌కి స్మగ్లర్‌తో సంబంధముండి వుండొచ్చను కుంటున్నాను!" అన్నాడు.

కిరణ్ మాట్లాడలేదు.

సరాసరి విజయ్‌నగర్ కాలనీకి పోనిచ్చాడు.

# 3

కొద్దిసేపు ఎంక్వయిరీ తర్వాత అనిత యిల్లు దొరికింది. అనిత యింట్లో దొరకలేదు. ఆమె తల్లి, చెల్లెలు మాత్రమే వున్నారింట్లో.

ఆమె తల్లి పోలీసుల్ని చూసి కొంచెం భయపడినట్టే కనిపించింది.

"అమ్మాయి కాలేజీనుంచి యింకా తిరిగి రాలేదు బాబూ!" అన్నదామె.

"అనిత ఏం చదువుతోందండి?"

"యూనివర్సిటీ కాలేజీలో పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తోందండి."

కిరణ్, శ్రీనివాస్ ఉలిక్కిపడ్డారు. రెండో కేసులో హతురాలు కోమలికూడా యూనివర్సిటీ కాలేజీలోనే పోస్టుగ్రాడ్యుయేషన్ చేస్తూ, హత్యచేయబడింది.

"ఏం సబ్జెక్టు?"

"సోషియాలజీ."

కోమలి సబ్జెక్టు సైకాలజీ. అయినా యిద్దరికీ ఒకరి గురించి మరొకరికి కచ్చితంగా తెలిసే వుంటుంది.

"మీ అమ్మాయికి యెవరితోనైనా పెళ్ళి ఏర్పాట్లు చేశారా?"

"అబ్బే, అదేం లేదండి! అమ్మాయికిప్పట్లో పెళ్ళి చేయదలచుకోలేదు. 'పోస్టు గ్రాడ్యుయేట్ కావాలి— అంతదాకా నేను పెళ్ళిచేసుకోను' అని అమ్మాయి తెగేసి చెప్పేసిందండి, అందుకని ఆ ప్రపోజలే తేలేదు!"

కిరణ్, శ్రీనివాస్ గుంభనగా నవ్వుకున్నారు. ఆమెకు రవిరాజ్ గురించి తెలియకుండా వుండదు. కాని తమతో నిజాన్ని యెందుకు చెబుతుంది? రవిరాజ్ మరణవార్త తెలిసింతర్వాత యీ క్షణంలో అతని గురించి తెలిసినా చాలామంది చెప్పటానికిష్టపడరు.

ఆమెని ఏం అడిగినా సరైన సమాధానం రాదని తెల్సుకున్నారిద్దరు. ఇక అక్కడ చేసేదేంలేదని బయటికొచ్చేశారు.

ఇల్లు పెద్దదే! చుట్టూ ప్రహరీగోడ కోటలా వుంది అనిత తండ్రి బాగా సంపాదిస్తున్నట్టున్నాడు!

టయోటా ఆర్ట్సు కాలేజి ముందాపి కిరణ్ దిగాడు.

"నువ్వు కార్లోనే వుండు. నేను అనితను తీసుకొని వస్తాను!" అంటూ పెద్ద పెద్ద అంగలేసుకుంటూ కాలేజి వైపు సాగిపోయాడు.

ఓ పదినిమిషాల తర్వాత అనిత గురించిన సమాచారం తెలిసింది. ఆ క్రితంరోజు యూనివర్సిటీ కాలేజిలన్నీ

కోమలి మరణానికి సంతాపంగా మూసేశారు. ఆ రోజే తెరిచారు.

లైబ్రరీలో ఓ మూలగా కూచుని యేదో తీవ్రాలోచనలో వున్న అనితను తేలిగ్గానే గుర్తుపట్టాడు కిరణ్.

"మీతో మాట్లాడాలి, కాసేపు బయటకు రండి!" అంటున్న కిరణ్ వైపు అయోమయంగా చూసింది అనిత.

"మీరెవరో నాకు తెలియదు...." అని ఆమె ఇంకా యేదో చెప్పబోయేంతలో, రవిరాజ్ గురించి మీతో మాట్లాడాలి!" అన్నాడు కిరణ్.

నాగస్వరం విన్న నాగుబాములా అతని వెంట గ్రౌండులోకి వచ్చేసింది అనిత.

శ్రీనివాస్‌ని చూస్తే ఆమె భయంతో అసలు సంగతి దాటివేస్తుందని అనుమానించి, పచ్చిక మీద కూలబడుతూ "అలా కూచోండి!" అన్నాడు కిరణ్.

అక్కడ మామిడి చెట్లు, సపోటా చెట్లు ఆహ్లాదంగా తలలూపుతున్నాయి. ఆమె మోకాళ్ళ మీద వంగి కూచుంది.

కిరణ్ ఆమెవంకే పరీక్షగా చూస్తున్నాడు.

ఆమె పంజాబీ డ్రస్సు వేసుకుంది. తల వదులుగా దువ్వి ముంగురులు ఫాలభాగంమీదికి అలవోకగా వదిలి, జుట్టు చివర్న రిబ్బన్‌తో అందంగా ముడివేసింది. చెవులకి జూకాలున్నాయి. ముఖాన బొట్టులేదు — ఫాషన్ కోసమని పెట్టనట్టుంది. కళ్ళకు కాటుక పెట్టింది. గులాబీ రంగు బుగ్గలు. చిన్న నోరు, సన్నటి పెదాలు, ఆమె ఎంత సుకుమారో చెపుతున్నాయి. ఆమె తొడుక్కున్న పంజాబీ డ్రస్సు ఆమె వంటికి అతుక్కుపోయి, ఆమె

ఎత్తుపల్లాల్ని బహిర్గతం చేస్తూ చూసేవాళ్ళ గుండెలు ఆమె గుండె లోతుల్లో చిక్కుకుపోయేలా చేస్తున్నాయి.

"రవి గురించి ఏదో మాట్లాడాలన్నారు....?" అన్నదామె మెల్లగా. చాలా లో గొంతుతో నీరసంగా మాట్లాడినా, ఆమె గొంతులో ఏదో మెలోడి వున్నట్లనిపించింది కిరణ్ కి.

"రవి హత్యచేయబడ్డ సంగతి తెలుసనుకుంటాను."

ఆమె తలూపింది. వెక్కిళ్ళు ఆపు చేసుకుంటున్నదని గ్రహించాడు కిరణ్.

"అతని చావుకు కారకులెవరో మీకు తెలుసా?"

ఆమె దిగ్గున తలెత్తి చూసి, "మీరు పోలీసులా?" అన్నది ఆమె కంఠంలో ధ్వనించిన భయం, వణుకు చూసి సన్నగా నవ్వుకున్నాడు కిరణ్.

"కాదు, రవిరాజ్ కి దగ్గర బంధువును."

ఆమె కాస్త నిమ్మళపడినట్టుందిగాని పూర్తిగా నమ్మకం కలిగినట్టు లేదు!

"రవి మరణానికి బాధ్యులెవరో నాకు తెలియదు!"

"మిస్ అనితా! రవిని మీరు మనసారా ప్రేమించారు. అతను కూడా మీరంటే ప్రాణం పెట్టేవాడు. మీరిద్దరు త్వరలో పెళ్ళి కూడా చేసుకుంటారని అందరు అనుకున్నారు. బహుశా మీరిద్దరుకూడా నిర్ణయం చేసుకుని వుంటారు. కాని, అనుకోకుండా ఈలోపల అతన్నెవరో చంపి, హుస్సేన్ సాగర్లో శవాన్ని తోసేశారు...."

ఆమె ముఖాన్ని చేతుల్లో దాచుకొని సన్నగా రోదించసాగింది. దగ్గర్లో యెవరూ లేరు. స్టూడెంట్సు చెదురు మదురుగా నడుస్తున్నారు. సాయంకాలం కావ

టంతో వాతావరణం చల్లగా వుంది. అక్కడక్కడ విద్యార్థినులు పచ్చికమీద కూచుని వున్నారు.

కిరణ్ ఆమెని ఏడవనిచ్చాడు. అయిదు నిమిషాల తర్వాత ఆమె తన్ని తాను కంట్రోల్ చేసుకుని, కళ్ళు కర్చీఫ్‌తో తుడుచుకొని, కిరణ్ వంక చూసి "క్షమించండి! రవిని నేను ప్రాణంకన్న మిన్నగా ప్రేమించాను. అతను లేకపోవటం అనే నిజాన్ని నా మనసు నమ్మలేకపోతోంది. నన్ను నేను సమాధానపరచుకోలేకుండా వున్నాను" అన్నది.

కిరణ్ ఆమెవంక జాలిగా చూశాడు.

"మీరు చెప్పే ప్రతి విషయం చాలా ముఖ్యమైనదని గుర్తుంచుకోండి. రవి నాకెంతో కావలసినవాడు. అతన్ని చంపిన వాళ్ళను పట్టుకోవటంలో చట్టానికి సాయం చెయ్యాలని నా అభిప్రాయం! అంతా పోలీసులమీద వదిలేసేకన్న మనంకూడా మనచేతనైన ప్రయత్నం చేయటం మంచిదని నా అభిప్రాయం! రవిని చంపిన వాడ్ని శిక్షించగలిగితే రవి ఆత్మకి శాంతి కలుగుతుంది. అతనికి పుణ్యలోకాలు దక్కుతాయి. ఇంతకన్న అతనికి దగ్గరవాళ్ళమైన మనం కోరుకునేది వేరే ఏముంటుంది?"

కిరణ్ మాటలు ఆమెమీద బాగా పనిచేశాయి.

"రవి, నేను కలిసి తిరగటం కోమలికిష్టం వుండేది కాదు. నా అనుమానం కోమలే రవిని చంపించి వుంటుందని....!" అర్ధోక్తిలో ఆగిపోయింది అనిత.

కిరణ్ నిటారుగా అయ్యాడు. "ఐ మీన్ యీ మధ్య హత్యచేయబడ్డ కోమలేనా మీరు చెప్పేది?" అన్నాడు తనలోని దిగ్భ్రాంతిని బయటపెట్టకుండా.

"అవునండి, ఆమే! ఆమె రవిని వశం చేసుకోవటానికి

చాలా ప్రయత్నించింది. కాని రవి ఆమెను లెక్క చెయ్య లేదు. ఆ కోపంతో ఆమే అతన్ని హత్యచేయటమో, చేయించటమో జరిగిందని నా అనుమానం!"

"మరి కోమలిని ఎవరు హత్యచేసివుంటారు?"

"ఏమోనండి, ఆ విషయం తెలియదు."

కిరణ్ కోటుజేబులోనుంచి రవి ఇంట్లోనించి తెచ్చిన ఫోటోని చూపించి, "ఈ ఫోటోలో అమ్మా యెవరో చెప్పగలరా?" అన్నాడు.

అనిత వెంటనే, "ఆ అమ్మా యెవరో నాకు తెలీదండి!" అన్నది.

కిరణ్ యింకా జేబునించి శ్రీనివాస్, రవిరాజ్ షాపులోని కేష్‌బాక్సునుంచి సేకరించిన రెండు ఫోటోలు చూపించి, "వీళ్ళు?" అన్నాడు.

అనిత ఆ ఫోటోల్ని చూస్తూనే ఓ క్షణం ఉలిక్కి పడి, "తెలియదండి! వీళ్ళనెవర్నీ ఇదివరలో నేను చూసి వుండలేదు" అన్నది.

ఆమె నిజం చెప్పటంలేదేమోననిపించింది కిరణ్‌కి. కాని ఆమెను బలవంతంచేసి లాభంలేదు, మెల్లగా విషయాలు రాబట్టాలి!

"రవికి మగవాళ్ళలో శత్రువులెవరైనా వున్నారా?"

అనిత ఓ క్షణం ఏదో ఆలోచించి, "మునీర్, స్నేహానంద్ అనబడే యిద్దరు గూండాలు. వాళ్ళు రవికి ఏదైనా హానిచేస్తారేమోనని భయపడ్తుండేదాన్ని. వాళ్ళిద్దరు నావైపు చూసే చూపులు భరించలేక పోయేదాన్ని! నన్ను వశంచేసుకోవాలని ఒకటి రెండుసార్లు ప్రయత్నించారు కూడా!" అన్నది.

"అయితే వాళ్ళ సాయంతో కోమలి రవిపై కసి తీర్చుకొని వుండొచ్చునంటారా?"

"అంతే అయ్యుంటుంది...."

"ఆల్ రైట్! మీరు రవిని పెళ్ళిచేసుకుంటానని మీ యింట్లో చెప్పారా?"

"చెప్పలేదు. కాని అమ్మకు తెలుసు. రవిని ప్రేమించటం విషయంలో అమ్మ ప్రోత్సాహమే యెక్కువ! నాకిదివరలో రవిపట్ల ఓ స్థిరమైన అభిప్రాయంలేదు. అమ్మ ఇంట్లోకి కావలసిన సరుకులు యెప్పుడూ అతని జనరల్ స్టోర్సునించే తెచ్చేది. ఆమెతో నేను తరచు అతని షాప్‌కి వెళ్తుండేదాన్ని! అలా మొదలైంది మా పరిచయం. అది ప్రేమకు దారితీసింది. అమ్మ ప్రోత్సాహం అందుకు దోహదం చేసింది!"

"భాస్కర్ అనబడే జూనియర్ లెక్చరర్ మీకు తెలుసా?"

అనిత వెంటనే "తెలియదు" అన్నది.

కిరణ్ ఆమెవంక పరిశీలనగా చూసి, "అతన్నికూడా యెవరో దుండగులు చంపేశారు" అన్నాడు.

"ఏమో, ఆ సంగతులేవీ నాకు తెలియదు."

కిరణ్‌కి నమ్మకం కలగలేదు. ఈమె కావాలనే సరిగ్గా సమాధానాలివ్వటంలేదని అతనికి అనుమానంగానే వుంది! ఆమెనిక ప్రశ్నించి లాభంలేదని గ్రహించాడు. లేచి నించున్నాడు.

అనిత లేచినించుని, "మీరు పోలీసులు కదూ!?" అన్నది రెప్పలార్పకుండా చూస్తూ.

కిరణ్ సమాధానం చెప్పకుండా చిన్నగా నవ్వి,

"త్వరలో మళ్ళీ కలుద్దాం!" అన్నాడు, టయోటావైపు వడిగా అడుగులు వేస్తూ.

## 4

"ఏమైనా తెలిసిందా?" అడిగాడు శ్రీనివాస్.

కిరణ్ టయోటాను ముందు కురికించి, "అనిత కావాలనే నిజం చెప్పటంలేదు. ఆమెకు రవిని హత్యచేసిన వాళ్ళెవరో తెలిసే వుండొచ్చు" అన్నాడు.

"పోలీసు మర్యాద చవిచూపిస్తామా?"

కిరణ్ శ్రీనివాస్ వంక చురుగ్గా చూసి, "అదే వద్దనేది! ఆడవాళ్ళతో వ్యవహరించాల్సిన పద్ధతి అది కాదు. నెమ్మదిమీద విషయాలు రాబట్టాలి!" అన్నాడు.

శ్రీనివాస్ అసంతృప్తిగా చూశాడు.

"కోమలి ఒకప్పుడు రవిరాజ్ ను వశపర్చుకోవాలని చూసినట్టు, రవి తిరస్కరించినట్టు తెలిసింది. అంటే కోమలి హత్యకు, రవి హత్యకు సంబంధముండి వుండొచ్చు."

శ్రీనివాస్ ఆశ్చర్యాన్ని అణచుకుంటూ, "అదే నిజమైతే రెండు కేసులు ఒకేసారి డిస్పోజయిపోతాయి" అన్నాడు.

శ్రీనివాస్ ఆత్రానికి నవ్వు వచ్చింది కిరణ్ కి.

"ఇప్పుడెక్కడికి వెళ్తున్నాం?" అన్నాడు శ్రీనివాస్.

"కోమలి యింటి అడ్రసు వుంది కదూ!"

"ఆఁ!"

"అయితే, ఆమె ఇంటికి డైరెక్షన్ చెప్పు!"

"అలాగే!"

ఇరవై నిమిషాల తర్వాత టయోటా కోమలి ఇంటి ముందాగింది.

కోమలివాళ్ళ యిల్లు చాలా చిన్నది. చిన్న పోర్షన్ లాగా వుంది. స్మశాన నిశ్శబ్దం ఆవరించుకొని వున్నది!

కోమలి యింట్లో యెవరూ వున్న జాడలేదు. అసలు ఆమె యెవరితో వుంటున్నదో, యేమిటో ఆమె విషయా లేవీ తెలియదు శ్రీనివాస్ ఆ వివరాలేవీ సేకరించి వుంచుకోలేదు.

కిరణ్ టయోటా ఆపి దిగాడు. ఆ చిన్న పోర్షన్ మెట్లెక్కి తలుపు తట్టాడు. చాలా సేపటివరకు యెవరూ రాలేదు.

ఓ నడివయసామె తలుపు ఓర వాకిలిగా తెరిచి కిరణ్‌ని చూసి "ఏం కావాలండీ?" అన్నది.

"కోమలి విషయం మాట్లాడాలి, తలుపు తెరుస్తారా?" అన్నాడు కిరణ్.

ఆమె తలుపులు బార్లా తెరిచి, "రండి!" అన్నది.

ఈలోపల శ్రీనివాస్ కారు దిగి మెట్లెక్కి వచ్చాడు.

"మిస్. కోమలి మీకేమవుతారు?"

"అమ్మాయేనండి. కోమలి నా మారుటి కూతురు."

"ఓహో! కోమలి తోడబుట్టిన వాళ్ళెవరూ లేరా!"

"లేరండి. నా కొడుకు పన్నెండేళ్ళ వాడున్నాడు."

"కోమలి తండ్రేం చేస్తారు?"

"మాదిమిల్లులో పని చేస్తారండి!"

"అలాగా. కోమలి నెవరో చంపి యూనివర్సిటీ రోడ్‌న పడేశారుకదా! మీరెవర్ని అనుమానిస్తున్నారు?"

"ఏమోనండి, ఆ పాపం పుణ్యం నాకు తెలీవు?"

"అది కాదండి! మీకు ఎవరిమీద అనుమానం?"

"నాకెవరిమీదా లేదండి. అసలు ఎదిగిన ఆడపిల్లకి పెళ్ళి చెయ్యకుండా పెద్ద చదువులు దేనికి చెప్పండి!

నేనెంత చెప్పినా యీాయన వినకుండా ఎం.ఏలో చేర్పించారు. నేను ఎక్కువ బలవంతం చేయలేదు. సవతి తల్లిని, ఏమంటే ఎలా వస్తుందోనని మాట్లాడకుండా వూరుకున్నాను!”

“మీ వారు చేసేది ఏం ఉద్యోగం?”

“పెద్ద ఉద్యోగం ఏదీ కాదండీ! టెక్నికల్ జాబ్. స్పిన్ కౌంటర్. దారం తకిలీలకు సరైన పద్ధతిలో చుట్టుకుంటున్నదో లేదో చూసి, రాంగ్ థ్రెడ్ పోతుంటే సరిచెయ్యడం, అంతే!”

“జీతం ఓ వెయ్యిరూపాయలు పైనే వుంటుంది, అవునా?”

“అబ్బే. తొమ్మిదివందలుంటుందండి!”

కిరణ్ ఆ గదిలోని ఫర్నిచర్ విలువని అంచనా వేస్తున్నాడు—బీరువా, సోఫా, ఖరీదైన కుర్చీలు, గన్ మెకా టేబిలు—యివన్నీ సామాన్యుడికి అందుబాటులో లేనివి. పైగా తనకొచ్చే తొమ్మిదివందలతో యీ మహా నగరంలో తిండికే చాలని పరిస్థితుల్లో అధునాతనమైన ఫర్నిచర్ ఎలా కొనగలిగాడు కోమలి తండ్రి? పైగా కూతుర్ని పోస్టుగ్రాడ్యుయేషన్ ఎలా చదివిస్తున్నాడో? యెక్కడో అనుమానం కలుక్కుమంటోంది.

“కోమలి రవిరాజ్ అనే కుర్రాడ్ని పెళ్ళిచేసుకోవాలనుకున్నదని, అతనితో తరచు తిరుగుతుండేదని మాకు నమ్మకంగా తెలిసింది. అతన్ని పెళ్ళి చేసుకోవాలనుకున్నదట. యీ లోపల యేమైనా మనస్పర్థలు వచ్చాయా?” కిరణ్ కావాలనే గాల్లోకి బాణం వదిలాడు.

“కోమలి రవిని పెళ్ళి చేసుకోవాలనుకున్న మాట నిజమేనండి! ఆ కుర్రాడ్ని రెండుమూడుసార్లు యింటి

కూడా తీసుకొచ్చింది. కుర్రాడు బుద్ధిమంతుడిలాగే కనిపించాడు. పైగా ఉన్న కుటుంబములోనివాడు. కోమలి అదృష్టవంతురాలనుకున్నాను—కాని యీలోపల దాన్ని దురదృష్టం కాటువేస్తుందనుకోలేదు!" ఆమె గొంతులో దుఃఖం తొంగిచూసిందిగాని, ఆమె ముఖం ప్రసన్నంగానే వుంది. లోకంకోసం ఆమె చేస్తున్న నటన చూసి నవ్వు వచ్చింది వాళ్ళకు!

"రవిని చేసుకోవటానికి కోమలి నాన్నగారు అంగీకరించారా?"

"అసలు యింకా అంతవరకు అంటే ఆయనవరకు విషయాన్ని తీసుకు వెళ్ళలేదు! ఆయన విశాలమైన భావాలున్నవారు. కూతుర్ని పెద్ద చదువులు చదివించటానికూడా అదే కారణం! కోమలి తండ్రి ఎదటపడి ఫలానా కుర్రాడ్ని చేసుకుంటానని అడిగితే, ఆయన సంతోషంగా ఒప్పుకుంటారు. అని కోమలికి తెలుసు! ఒకేసారి సర్‌ప్రయిజ్ చేద్దామనుకుంది. కాని ఇంతలోనే...."

"ఆమెకు విరోధులెవరున్నారు?"

"ఎవరున్నారంటే ఏం చెప్పగలం? రవిని పెళ్ళిచేసుకోవటం యిష్టంలేని వాళ్లెవరైనా వుండొచ్చు. అతన్ని యెగరేసుకోవటానికి చాలామంది కాచుకుని వున్నారని అమ్మాయి చాలాసార్లు చెప్పింది. వాళ్ళలో యెవరైనా కోమలిని పొట్టన బెట్టుకొని వుండొచ్చు."

"అలా అనుకుందామంటే, రవిరాజ్‌ని కూడా ఎందుకు చంపుతారు? అతన్ని చంపాక నే కోమలినికూడా చంపేవారు వాంతకులు! కాబట్టి కోమలిమీద ద్వేషంతో యీ పని చేసి వుండరు! దీన్నిబట్టి రవిని చంపినవాళ్ళు వేరు,

కోమలిని చంపినవారు వేరు అనుకోవాలి! అప్పుడు మీరు చెప్పినట్టు కోమలిమీద అన్యాయంతో హత్య చేయలేదని, మరో కారణమేదో వుండివుండాలని అనుకోవాల్సి వస్తోంది!"

కోమలి సవతితల్లి ఏం మాట్లాడకుండా కిరణ్ వైపే కళ్ళప్పగించి చూస్తోంది. ఏం చెపితే ఎలా వస్తుందోనని సంకోచిస్తున్నట్టు కనిపిస్తోంది.

"కోమలికి వ్యక్తిగతమైన శత్రువులు కారు ఆమెని హత్య చేసినది. ఎందుకంటే ఆమె యెలాంటి పరిస్థితుల్లో హత్య చేయబడినదో మీకు తెలుసు! కావాలని ఆమెను ఎత్తుకుపోయారు గుండగులు! బహుశా వాళ్ళకు ఆమె రవితో విచ్చలవిడిగా తిరుగుతున్న సంగతి బాగా తెలుసు! ఇప్పుడు చెప్పండి, కోమలికి అలాంటి శత్రువులెవరున్నారో....!"

కోమలి సవతితల్లి తల అడ్డంగా తిప్పింది. "నా దృష్టిలో యెవరూ కనిపించలేదండి!" అన్నది.

ఆమె యెందుకో నిజం చెప్పటంలేదనీ, ఏదో దాస్తున్నదని యిద్దరికీ అర్థమయింది. కోమలికి రవి ఒక్కడే కాదు, యింకా బాయ్ ఫ్రెండ్స్ వేరే వుండొచ్చు, కాని కోమలి సవతితల్లి నిజం ఒప్పుకోదు!

ఆమె దగ్గర సెలవు తీసుకొని బయటకొచ్చేశారు కిరణ్, శ్రీనివాస్‌లు.

## 5

"నాకిప్పటివరకు యీ కేసుల్లో ఎలాంటి 'క్లూ' దొరకలేదు. అంతా అగమ్యగోచరంగా వుంది!" అన్నాడు శ్రీనివాస్.

స్టేషన్‌లో కిరణ్, శ్రీనివాస్ కూచున్నారు. అంత

వరకు చేసిన యిన్వెస్టిగేషన్ వివరాలు క్రోడీకరించి ఫైండింగ్స్ నోట్ చేస్తున్నాడు కిరణ్.

చేస్తున్న పని ఆపి తలెత్తిచూసి, "రెండు కేసులకి లింక్ వుంది. రవిరాజ్ హంతకుడికి, కోమలి హంతకుడికి సామ్యం వుంది. ఇద్దరు ఒకడే కావచ్చు, లేదా ఇద్దరు ముగ్గురు గ్రూప్ వుండి వుండొచ్చు."

"కోమలి కారెక్టర్ విషయం నాకు అనుమానంగా వుంది!" అన్నాడు శ్రీనివాస్.

"చనిపోయిన మనిషి కారెక్టర్ గురించి మాట్లాడు కోవలసి రావటం ఇబ్బందిగానే వున్నా, ఆమె ప్రవర్తన వక్రంగా వుండటంవల్లనే ప్రాణాలు పోగొట్టుకున్నది. నువు యీలోపల చెయ్యవలసిందేమిటంటే, మునీర్ స్నేహానంద్—వీళ్ళిద్దరి ఎలిబీలు యీ నెల ఏడో తేదీ నుంచి పదో తేదీవరకు బాగా స్టడీ చేయమని మీ సార్జెంట్సుతో చెప్పు! చాలా అవసరం."

"ఇప్పుడే సార్జంట్సుని పంపిస్తాను."

"నేను సాయంత్రం వస్తాను. లెక్చరర్ భాస్కరం యింటికి వెళ్ళాలి! ఆ నడివయసామె శవాన్ని ఇంకా ఎవరూ గుర్తించలేదు కదా!"

"లేదు. రాగానే అదే సంగతి అడిగాను మా వాళ్ళని!"

# 6

"మునీర్, స్నేహానంద్ యీ నెల అయిదో తేదీనుంచి నగరంలో లేరట. బొంబాయి వెళ్ళారని చెప్పారట—యిద్దరి యిళ్ళలోను, మా వాళ్ళు అంతటా యెంక్వయిరీ చేస్తున్నారు! రేపటికి పూర్తి వివరాలు తెలుస్తాయి!" అన్నాడు శ్రీనివాస్, కిరణ్‌తో.

"పద, భాస్కరం యింటికి వెళ్దాం!" అన్నాడు కిరణ్.

టయోటా మలక్ పేట కాలనీవైపు పరుగుతీసింది.

ఇరవై నిమిషాల తర్వాత భాస్కరం యింటిముందు యిద్దరు టయోటా దిగారు. బయట ఆటో నిల్చునివుంది. ఎవరో యెక్కడికో వెళుతున్నట్టుంది.

"ఈమె భాస్కరంగారి భార్య!" శ్రీనివాస్ పరిచయం చేశాడు.

పాతికేళ్ళ యువతి నమస్కారం చేసింది. భర్త చావుకి కుంగిపోయిన లక్షణాలు ఆమెలో కనిపించకపోవటం కొంత ఆశ్చర్యంగానే అనిపించింది కిరణ్ కి. ఆమె ముస్తాబయి వుంది. ఇద్దరు పిల్లల్ని కూడా ముస్తాబు చేసింది. ఓ యిరవయ్యేళ్ళ కుర్రాడు సూట్ కేసులు సర్దుతున్నాడు.

"ఎక్కడికో బయల్దేరినట్టున్నారు?" అన్నాడు శ్రీనివాస్.

"అవునండి. మా అమ్మగారింటికి వెళుతున్నాను. ఇక్కడే వుంటే నేను బెంగటిల్లిపోతానని భయంతో మా తమ్ముడ్ని పంపించారు. నిన్నటివరకు మా అమ్మా నాన్న వుండి వెళ్ళారు. ఈ రోజు నేను వెళుతున్నాను!"

"చూడండి, భాస్కరంగార్ని ఎవరో హత్యచేశారు. ఆయన్ని తీవ్రంగా గాయపరిచి చంపారు. వ్యక్తిగతంగా ఆయనమీద బాగా కసి వున్నవాళ్ళే చేసివుండాలని మేం భావిస్తున్నాం. పర్సనల్ గా ఆయనంటే కక్షవున్నవాళ్ళెవరో మీరు వివరాలు చెపితే, మీ వారిని చంపిన వాళ్ళను పట్టుకోగలుగుతాం!"

ఆమె వెంటనే, "ఆయనకు శత్రువులకు కొదవలేదు.

ప్రతి ఒక్కరితోను తీరికూచుని గొడవ పెట్టుకు నేవారు. చిన్న కారణానికే వాళ్ళతో తగవు వేసుకు నేవారు. "నేనెంత వారించినా ఆయన తన ధోరణి మార్చుకునే వారు కాదు!"

"అది సరే ననుకోండి! చిన్న చిన్న గొడవలు ఇంత దారుణానికి దారితీసే సందర్భాలు కూడా వున్నాయి. ముఖ్యంగా యీ మధ్య ఆయనతో తీవ్రంగా ఘర్షణపడ్డ వాళ్ళు గాని, లేక ఆయన యెవరితోనైనా బాగా గొడవ పెట్టుకున్న సంఘటన గాని వుంటే చెప్పండి!"

"ఈయన గురించి చెడుగా చెప్పుకోవటం భార్యగా నాకు బాధాకరంగా వున్నా చెప్పక తప్పదు. ఆయనకు అమ్మాయిల పిచ్చి యెక్కువండి. కంటికి నదురుగా ఎవరైనా కనిపిస్తే ఆ పిల్ల వెంటపడి వేటాడుతుండటమే పని. అలా చేసిన సందర్భాల్లో బాగా విసిగిపోయిన వాళ్లెవరైనా యీయన్ని...." ఆ తర్వాత ఆమె చెప్ప లేకపోయింది. ఎంత కాదనుకున్నా తాళికట్టిన భర్త!

కిరణ్‌కి ఆమె చెప్పిన మాటలు వినగానే కేసుకి లింక్ అందినట్టనిపించింది. అనిత ఫోటో, తక్కిన ముగ్గురమ్మాయిల ఫోటోలు పైకితీశాడు.

"వీళ్ళలో యెవరైనా భాస్కరంగారితో తిరుగుతుండేవారేమో చెప్పండి!" అన్నాడు ఫోటోలు ఆమెకు చూపించి.

ఆమె 2. ఫోటో గురించి, "ఈ పిల్లతో తిరిగేవారు. యీ పిల్ల అన్న మిలట్రీలో పనిచేస్తున్నాడట—ఓసారి యింటిమీది కొచ్చి ఈ పిల్ల అన్న పెద్ద గొడవచేసి పోయాడు. అన్నెం పున్నెం యెరగని నా చెల్లెల్ని మధ్య పెట్టి పాడు చెయ్యాలని చూస్తున్నావు, నీ అంతు

చూస్తాను. అని బుసలుకొట్టి వెళ్ళిపోయాడండి!" అన్నది.

ఆ ఫోటో కేష్ బాక్సులో దొరికిన రెండింటిలో ఒకటి!

"ఈమె పేరుగాని, యీమె అన్న అడ్రసుగాని మీకు తెలుసా?"

"తెలియదండి!"

"ఇలాగే యింకా యెవరితోనైనా ఆయన తిరగటం, వాళ్ళు కక్ష పూనటం, యేదో చేస్తానని బెదిరించటం అలాంటి వేమైనా జరిగాయా?"

"గుర్తున్నంతవరకు అవేమీ లేవండి. కాని యీయన కారెక్టర్ బాగా లూజు. తన దగ్గర ట్యూషన్‌కొచ్చే అమ్మాయిల్ని కూడా స్పేర్ చేసేవారు కాదు. చివరికి పనిమనిషి కూడా ఆయన దృష్టినుంచి దాటిపోదంటే ఆయన ఎంతగా దిగజారిపోయారో మీకే అర్థమవుతుంది. నా నోటితో చెప్పలేను!"

ఆమె మానసికంగా ఎంత చిత్రహింస అనుభవించిందో డిటెక్టివ్ లిద్దరికీ అర్థమయింది. అందుకే నేమో భర్త మరణం ఆమెను పెద్దగా కదిలించలేకపోయింది. భాస్కరం మరీ విచ్చలవిడిగా తిరిగే రకం! అలాంటి మొగుడు వున్నా పోయినా ఒకటేనన్న ధోరణిలో వుందామె.

"మేం వెళ్తామమ్మా! మీ ప్రయాణానికి అంతరాయం కలిగించినట్టున్నాం, వెళ్ళిరండి!"

"గోదావరికి వెళ్తూన్నామండి. మీతో యింకా సేపు గడిపేవాళ్ళమే! అప్పటికే అరున్నరయింది. మరో అర గంటలో ట్రైనుంది!" అన్నదామె."

"నా కారులో దిగబెట్టమంటారా?" అన్నాడు కిరణ్.

"ఆటోలో వెళ్తామండి, థాంక్స్!"

కిరణ్, శ్రీనివాస్ బయట కొచ్చేశాక, "ఈ అమ్మాయెవరో తెల్సుకోవాలి" అన్నాడు.

"అదెలా? కనీసం యీ ఆమె గురించి ఎక్కడుంటుందో లొకాలిటీ కూడా తెలియదే!"

"బహుశా యే కాలేజి పిల్లో అయి వుంటుంది. ముఖ్యంగా భాస్కరం పనిచేసే కాలేజీ పిల్లే కావచ్చు. భాస్కరం కాలేజికి వెళ్తే మరికొన్ని ఆసక్తికరమైన విషయాలు బయటపడ్తాయనుకొంటున్నాను!" అన్నాడు కిరణ్.

కిరణ్ టయోటా స్టార్టు చేయబోతుండగా వెనకనించి భాస్కరం భార్య పిలిచింది.

శ్రీనివాస్ కారు దిగి ఆమె దగ్గరకు వెళ్ళాడు.

"ఇది మావారు రాసుకునే డైరీ! మీకేమైనా ఉపయోగపడుందేమో, చూడండి!" అన్నదామె.

శ్రీనివాస్ 'థాంక్స్' చెప్పి, డైరీతో వచ్చి టయోటా ఎక్కాడు.

"స్టేషన్ కి పోనిస్తున్నాను" అన్నాడు కిరణ్ టయోటా స్టార్టు చేస్తూ.

## 7

వాళ్ళు స్టేషన్ కి వెళ్ళేసరికి వాళ్ళకోసం తాజా సమాచారం యెదురుచూస్తోంది.

సార్జంటు శివం యెదురుచూస్తున్నాడు. కిరణ్ ని, శ్రీనివాస్ ని చూడగానే శెల్యూట్ చేసి, "మునీర్, స్నేహానంద్ చచ్చిపోయారు సార్!" అన్నాడు.

శ్రీనివాస్ నిర్ఘాంతపోయి, "ఎప్పుడు?" అన్నాడు.

కిరణ్ కుతూహలంగా చూశాడు.

శివం చెప్పాడు. "ఈ నెల ఆరో తేదీన బొంబాయి లోనే ఓ ట్రాఫిక్ ప్రమాదంలో పోయారట. మునీర్ అక్కడికక్కడే మరణించాడట! స్నేహానంద్ ను హాస్పిటల్ లో చేర్చారట నిన్న రాత్రే బొంబాయిలోనే గవర్న మెంటు హాస్పిటల్లో చనిపోయాడట! నిన్న ఉదయం స్నేహానంద్ కొద్ది నిమిషాలు స్పృహలో వుండి తన గురించి మునీర్ గురించి చెప్పేవరకు బొంబాయి పోలీస్ లకి వాళ్ళిద్దరు యెవరో, ఎక్కడివారో తెలీదుట. అందుకే హైద్రాబాద్ లోని వాళ్ళిళ్ళల్లో యిన్ఫర్మేషన్ అందలేదు!"

శ్రీనివాస్ కి చేతికి దొరికిన హంతకులు జారిపోయినంత బాధ వేసింది.

"అయితే వీళ్ళిద్దరూ హంతకులు కాదా?" అన్నాడు జనాంతికంగా.

"అంతే కదా! ఎనిమిదో తేదీన రవిరాజ్ హత్య చేయబడ్డాడు. తొమ్మిదో తేదీ రాత్రి కొన్ని గంటల తేడాలో కోమలి, భాస్కరం, నడివయసు స్త్రీ హత్య చేయబడ్డారు. మునీర్ కి, స్నేహానంద్ కి ఈ హత్యలలో యెలాంటి సంబంధము లేదు" అన్నాడు కిరణ్.

ఇంతలో సార్జంటు రాజు లోనికొచ్చి, "నడివయసామెను గుర్తుపట్టాడు సార్, ఆమె కొడుకు! మీ కోసమే ఎదురు చూస్తున్నాడు!" అన్నాడు.

శ్రీనివాస్ కి ప్రాణం లేచి వచ్చింది. "ఏడీ అతను? వెంటనే రమ్మను!" అన్నాడు.

ఓ పాతికేళ్ళ యువకుడు లోపలికొచ్చాడు. కాయకష్టం చేసుకునే మనిషిలా వున్నాడు. షర్టు, నిక్కరు వేసుకుని వున్నాడు. అతని కళ్ళు బాగా వాచివున్నాయి. బాగా ఏడ్చినట్టు చూడగానే తెలిసిపోతుంది.

"ఎవరు నువ్వు?" అన్నాడు శ్రీనివాస్.

అతను గొంతు సవరించుకొని, "ఆమె నా తల్లి బాబు గారూ! మలక్ పేటలో వుంటుంది. నేను వారం రోజులుగా ఊళ్లో లేను బాబయ్యా. ఇంతలో ఈ ఘోరం జరిగిపోనాది" అన్నాడు. మళ్ళీ దుఃఖం తెర వచ్చేసిందతనికి.

"ఆమె అర్ధరాత్రి విజయవాడ రోడ్డున వెళ్ళాల్సిన అవసరం ఏం వచ్చింది?"

"అదే నాకూ అర్థంకాలేదు బాబూ! కొత్తపేట చౌరస్తాకాడ మా చుట్టాలున్నారు బాబూ. అక్కడికి వెళ్ళి తిరిగొస్తూ వుండొచ్చు."

"మీ యింట్లో యింకా యెవరుంటున్నారు?"

"ఇంకెవరూ లేరు బాబయ్యా, నేనూ మా అమ్మే. నాకింకా పెళ్ళి కాలేదు."

"మరి కొత్తపేట చౌరస్తా దగ్గరున్న చుట్టాలు యీ నాలుగు రోజుల్నించీ మీ అమ్మ శవాన్ని గుర్తుపట్టడానికి రాలేదేం?"

"వాళ్ళు అంత తెలివైనవోళ్ళు కాదు బాబూ! మా అమ్మ చచ్చిపోయిన సంగతి నాక్కూడా యియ్యాల పొద్దున్నే తెలిసింది. మీ యీదిలో సెప్పుకుంటుంటే యిన్నాను. ఎంటనే అగత్తుకొచ్చినాను సారూ!"

"మీ వీధిలోవాళ్ళు ఆ శవం మీ అమ్మదేనని మాకిది వరకే గుర్తించి చెప్పవచ్చుకదా!"

"మా పేటలో వాళ్ళకు బయిం బాబూ! అల్లమీదికి యెక్కడ గొడవ వొత్తదోనని బయింపడి టేసన్‌కి రానే దంట బాబూ!"

శ్రీనివాస్‌కి అప్పటికిగాని నమ్మకం కలగలేదు. శివాన్ని పిలిచి, "ఇతనితోబాటు వాళ్ళ యింటికి వెళ్ళు. ఇతని వివరాలు పూర్తిగా తెలుసుకునిరా! నువ్వు పూర్తిగా సేటిస్‌ఫై అయినాక శవాన్ని హేండోవర్ చేద్దాం. శవాన్ని ఫార్మలిన్‌లో భద్రపరిచారు కదూ!" అన్నాడు.

"భద్రంగానే వున్నది సార్! యింతక్రితమే ఇతను-యితని పేరు బాలయ్యట సార్—చూశాడు కూడా!"

"ఆల్‌రైట్, ప్రొసీడ్!" అన్నాడు శ్రీనివాస్.

సార్జంటు శివం బాలయ్యతో కలిసి వెళ్ళిపోయాడు.

కిరణ్ అంతదాకా భాస్కరం డైరీ పరిశీలిస్తున్నాడు.

"ఇదిగో ఇందులో ఓ అమ్మాయి పేరు మాటిమాటికీ వొర్లటం జరిగింది. అమ్మాయి పేరు నీలిమ. బహుశా భాస్కరం భార్య గుర్తించిన ఫోటోలో అమ్మాయి యీమే కావచ్చు!" అన్నాడు.

"అడ్రసు రాసివుందా అందులో?" అడిగాడు శ్రీనివాస్.

"అడ్రసు లేదుగాని చాలాసార్లు యితను కాలేజీలో ఆమె యెదురుపడ్డట్టు రాసుకున్నాడు. అంటే భాస్కరం లెక్చరర్‌గా పనిచేస్తూన్న కాలేజీలోనే యీ అమ్మాయి చదువుతూ వుండొచ్చు! సోమాజి గూడలో వున్నది భాస్కరం పనిచేసే కాలేజి! వెళ్ళొద్దాం, పద!" అంటూ లేచాడు కిరణ్.

శ్రీనివాస్ ఉత్సాహంగా లేచి అతన్ననుసరించాడు.

పదిహేను నిమిషాల్లో సోమాజి గూడలోని

జూనియర్ కాలేజిముందు టయోటా ఆపుచేసి దిగాడు కిరణ్.

రాత్రి ఎనిమిదిగంటలయింది. ఆ సమయంలో వాచ్ మాన్ తప్ప కాలేజిలో మరెవరూ వుండరని కిరణ్ కి తెలుసు. వాచ్ మన్ నడిగి ప్రిన్సిపాల్ యింటి అడ్రసు తెలుసుకొని, అతని ద్వారా వివరాలు సేకరించాలని అతని అభిప్రాయం.

అయితే అది పరీక్షల సీజన్ కావటంతో ఆఫీసు పనిచేస్తోంది. ప్రిన్సిపాల్ తోబాటు, యిద్దరు లెక్చరర్లు కూడా ఆఫీసులోనే వున్నారు.

ప్రిన్సిపల్ తో తాము వచ్చిన పని చెప్పాడు కిరణ్ -

ఆయన వాళ్ళను సాదరంగా కూర్చుండజేసి, "భాస్కరం గురించి మంచి చరిత్ర లేనిమాట నిజమే సార్! అతన్ని తొలగించటానికి మాకు పవర్సులేవు. అతని కారెక్టర్ గురించి పైఅధికారులకు రిపోర్టు చేశాంకూడా! ఇంకా అతనిమీద ఎలాంటి చర్యా తీసుకోకుండానే యెవరో చంపేశారు!" అన్నాడు.

"ఈ అమ్మాయి మీ కాలేజిలోనే చదువుతోందను కుంటాను!" అన్నాడు కిరణ్ నీలిమదిగా తాము భావిస్తున్న ఫోటో చూపించి.

ప్రిన్సిపల్ కెదురుగా కూచుని వున్న స్టాఫ్ లో ఒకాయన వెంటనే గుర్తుపట్టి, "ఈ అమ్మాయి పేరు నీలిమ సార్! సీనియర్ ఇంటర్ చదువుతోంది" అన్నాడు.

కిరణ్ "థాంక్స్! భాస్కరం యింకా యెవరైనా అమ్మాయిల్తో అసభ్యంగా ప్రవర్తించేవారా? ఐమీన్ కాలేజి అమ్మాయిల్తో!?" అన్నాడు.

ప్రిన్సిపల్ వెంటనే, "దాదాపు ప్రతీ అమ్మాయిని

వక్రదృష్టితోనే చూసేవాడతను. పవిత్రమైన ఉపాధ్యాయ వృత్తికి కళంకం ఆపాదించాడు. నేను పర్సనల్ గా చాలాసార్లు అతన్ని పిలిచి చివాట్లు వేశాను కూడా! అయినా అతను తన అలవాటు మార్చుకోలేదు. ఇక ఫైనల్ గా విట్నెస్ లతోపాటు రిపోర్టు పంపేశాను" అన్నాడు.

"భాస్కరాన్ని హత్యచేసే అవకాశం యెవరికుందని మీరభిప్రాయపడుతున్నారు?" అడిగాడు కిరణ్.

"ఎవరని చెప్పగలం సార్! అతనివల్ల అన్యాయం చేయబడ్డ అమ్మాయిల తాలూకు మగవాళ్ళు యెవరైనా కావచ్చును! అలాంటి దుష్టుడికి అందరూ శత్రువులే!"

కిరణ్ మెదడులో భాస్కరం భార్య చెప్పిన సంగతి గుర్తొచ్చింది. నీలిమ అన్న ఓసారి అతన్ని చంపుతానని యింటిమీదికొచ్చి బెదిరించి వెళ్ళటం గురించీ ఆమె చెప్పింది. అలాగే, అతని ద్వేషానికి బలైపోయిన ఆడపిల్లల తాలూకు అన్నో తండ్రో, యింకెవరో కసితో అతన్ని కళ్ళుబొడిచి చంపేసి వుండొచ్చు!

"థాంక్యూ సార్, వస్తాం! మీరు చెప్పిన వివరాలు మాకు ఉపయోగకరంగా వున్నాయి!" అన్నాడు కిరణ్.

అతనితోపాటు శ్రీనివాస్ కూడా కృతజ్ఞతలు చెప్పి లేచాడు.

"నిన్ను స్టేషన్ లో దింపి నేను యింటికి వెళ్తాను" అన్నాడు కిరణ్.

"నీలిమ యింటికి వెళ్ళొద్దా?"

"రాత్రి పదయింది. ఉదయం వెళ్దాం. నేను సరాసరి స్టేషన్ కొచ్చేస్తాను. ఉదయం ఏడుగంటలకి సిద్ధంగా వుండు!" అన్నాడు కిరణ్.

"మా అబ్బాయి ఏర్ ఫోర్సులో పనిచేస్తున్నాడు. ఈ నెల రెండో తేదీన అబ్బాయి డ్యూటీమీద ఆగ్రా వెళ్ళిపోయాడు. మళ్ళీ వచ్చే నెల ఏడో తేదీవరకు రాడు!" అన్నాడు నీలిమ తండ్రి మేజర్ వెంకట్రావు.

కిరణ్, శ్రీనివాస్ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"మీ కభ్యంతరం లేకపోతే మీ అమ్మాయి నీలిమతో కొద్ది నిమిషాలు మాట్లాడాలి!"

"ఓ. కే__ బై ఆల్ మీన్స్.... బేబీ .." అంటూ కేక పెట్టాడు మేజర్, లేచి లోపలికి వెళ్ళిపోతూ.

నీలిమ తెరలు తొలగించుకొని గదిలోకి అడుగుపెట్టింది.

"కూర్చోండి" అన్నాడు కిరణ్. ఆమె వెంటనే కూర్చుంది.

"మీకు రవిరాజ్ తెలుసా?" అడిగాడు కిరణ్.

ఆమె త్రుళ్ళిపడినట్టు చూసింది. ఆ తర్వాత తల అడ్డంగా తిప్పింది.

"మీరు నిజం చెప్పకపోతే చాలా చిక్కుల్లో పడతారు!" అన్నాడు శ్రీనివాస్ కర్కశంగా.

కిరణ్ అతని కాలుమీద నెమ్మదిగా తొక్కి వారించాడు. శ్రీనివాస్ చాలా వేడిమీదున్నాడు.

నీలిమ కొద్ది క్షణాలు మాట్లాడలేదు.

కిరణ్ ఆమె ఫోటోని బయటికితీసి, "ఇది రవిరాజ్ దగ్గరకెలా వచ్చింది?" అనడిగాడు.

నీలిమ తన ఫోటోవంక ఓసారి చూసి కళ్ళు వాల్చుకుని, "నేను రవిరాజ్‌ను ప్రేమించాను. అతన్ని పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. కాని రవిరాజ్ యిదివరకే

చాలామంది అమ్మాయిలతో రకరకాల సంబంధాలు పెట్టుకున్నాడని తెలిసింది. అతనితో పరిచయం మాను కున్నాను!" అన్నది.

"ఈ ఫోటో అతనికి మీరే యిచ్చారా?"

"అతనోసారి బలవంతాన తన షాపు పక్కనే వున్న ఫోటో స్టూడియోలో నా ఫోటో తీయించి తనతో పెట్టు కున్నాడు. నాకూ కాపీలు యిచ్చాడు కూడా."

"మీ అన్నయ్య యిదివరలో లెక్చరర్ భాస్కరాన్ని వాళ్ళింటికి వెళ్ళి చంపుతానని బెదిరించాడా?"

"అన్నయ్య పూరకే బెదిరించి వుండొచ్చుగాని, మాస్టార్ని అన్నయ్య హత్యచేయలేదు. అసలు భాస్కరం మాస్టారు చనిపోయినపుడు అన్నయ్య సిటీలో లేడు. అంతక్రితమే వారం రోజులముందు ఆగ్రా వెళ్ళి పోయాడు."

"మరి భాస్కరాన్ని ఎందుకు బెదిరించాల్సి వచ్చింది? భాస్కరానికి మీకు యెలాంటి సంబంధం....?"

"భాస్కరం మాస్టారు మొదట్లో చాలా మంచి వాడనుకుని, ఆయనకు సన్నిహితంగా వచ్చినమాట నిజమే! కాని ఆయన నాతో తన కోరిక వెల్లడించగానే నేనాయనతో తిరగటం మానేశాను. నేను ఆయనతో తిరగటం మాస్టారు భార్య రెండుసార్లు చూసిందికూడా."

"భాస్కరం మిమ్మల్ని కోరరాని కోరిక కోరిన విషయం మీ అన్నయ్యకెలా తెలుసు?"

"నేనే చెప్పాను. మాస్టారు నన్ను బెదిరించటం మొదలెట్టాడు—అంతక్రితం రవిరాజ్ తో నేను తిరిగినట్టు మా యింట్లో చెపుతానని! నేను అప్పటికే రవిరాజ్ నిజస్వరూపం తెలిసి అతన్నుంచి దూరంగా తిరుగుతు

న్నాను. మాస్టారు ఆత్మీయంగా చూడగానే ఆయనకు సన్నిహితం కాగానే మాస్టారు తన నీచపుబుద్ధి చూపించుకున్నాడు. దాంతో ఆయన్ను తప్పించుకు తిరిగే దాన్ని. బెదిరించటం మొదలెట్టాక ఇక సహించలేక అన్నయ్యతో నిజం చెప్పేశాను. అన్నయ్య ఏర్ ఫోర్సు మనిషి. స్ట్రెయిట్ ఫార్వర్డు. ఆవేశంతో మాస్టారింటికి వెళ్ళి నన్నేదైనా చెయ్యబోతే చంపుతానని బెదిరించి వచ్చాడు. అంతకే బెదిరించటంవరకే, అంతే!"

"మీ మాస్టారు కాలేజిలో యింకా యెవరితోనైనా బాగా చనువుగా తిరిగేవాడా?"

"తిరిగేవాడు. కొంతమంది పిల్లల్ని మోసం చేశాడు కూడా! ఇద్దరు కాలేజి మానేశారు కూడా."

"రవిరాజ్ కు భాస్కరానికి పరిచయముందా?"

"ఎప్పుడైనా రవిరాజ్ స్టోర్సుకి వెళ్ళేవాడేమో తెలీదు. కాని, ఒకటి రెండుసార్లు—అంటే నేను రవిరాజ్ తో సన్నిహితంగా తిరిగే రోజుల్లో—అతని స్టోర్సు దగ్గర నన్నతనితో చూసి, తర్వాత కాలేజిలో ఆ విషయం గుర్తు చేసాడు. ఏవో సరుకులు కావాల్సి వెళ్ళానని అప్పటికట్టుకు చెప్పి తప్పించుకునేదాన్ని. ఆ తర్వాత రవిరాజ్ గురించి తెలిశాక పూర్తిగా అతనితో సంబంధాలు తెంచుకున్నాను."

"అనిత తెలుసా?"

"యూనివర్సిటీ కాలేజిలో పోస్టు గ్రాడ్యుయేట్ చేస్తున్న అనితేనా?"

"అవును...."

"తెలుసండి. ఆమెతో రవిరాజ్ తిరుగుతున్నాడన్న

విషయం నాకు ఆలస్యంగా తెలిసింది. ఆమెకాక మరో అమ్మాయితోకూడా తిరిగేవాడు."

"ఆమె పేరు....?"

"కోమలి!"

"కోమలితో తిరుగుతున్న విషయం అనితకు తెలుసా?"

"అసలు కోమలితో పరిచయం కలగటానికి అనితే కారణం! అనిత, కోమలి మంచి ఫ్రెండ్స్! గొప్పకోసం తన బాయ్‌ఫ్రెండును చూపిస్తానని అనిత తీసుకువెళ్ళిందట. రవిరాజ్ దగ్గరకు. రవిరాజ్ దగ్గర ఏం మెస్మరిజం వుందో తెలీదు, అతన్ని చూసిన అమ్మాయి అతనివైపు చిత్రంగా ఆకర్షింపబడుతుంది. తనకు పరిచయమైన అమ్మాయిని రవిరాజ్ తేలిగ్గా వదలడు!"

"అనితకి, రవిరాజ్‌కి చెడిందా?"

"చెడిందని నేననుకోను. రవిరాజ్ చనిపోవటానికి మూడురోజులముందు ఆమె రవిరాజ్ టాంక్‌బండ్ మీద టాంకు మోడల్ సమీపంలో కూచుని మాట్లాడుకోవటం సిటీ బస్‌లో వెళుతున్న నేను చూశాను!"

కిరణ్, శ్రీనివాస్ నిటారుగా అయారు.

"మూడు రోజులముందా? అంటే, ఆ రోజు యే తేదీయో గుర్తుందా?" అడిగాడు కిరణ్.

ఆమె రెండు క్షణాలేదో గుర్తు తెచ్చుకొని, "ఆఁ! ఎనిమిదో తేదీ! ఆ రోజు యూనివర్సిటీలో నా పరీక్ష ఫీజు రెమిట్ చేయటానికి ఆఖరు రోజు. కాలేజిలో యిచ్చేస్తే కట్టుకుంటారు. కాని నేను, సమయానికి మా నాన్నగారు లేకపోవటంతో ఫీజు సకాలానికి చెల్లించలేకపోయాను. నామినల్ రూల్స్ క్లోజింగ్ డేట్

ఎనిమిది మార్చి. ఆ రోజు యూనివర్సిటీకి వెళ్ళి తిరిగొస్తూ వయా టాంక్‌బండ్ వచ్చే మినీ బస్ ఎక్కాను. అనుకోకుండా అనిత రవిరాజ్ నాకు టాంక్‌బండ్‌మీద కనిపించారు."

"అప్పుడు సమయం ఎంతయివుంటుంది?"

"రాత్రి తొమ్మిదిన్నర."

"తొమ్మిదిన్నరవరకు యూనివర్సిటీలో ఫీజు తీసుకున్నారా?"

"అక్కడ పని అయిదున్నరకే పూర్తయిందండి, ఓ స్నేహితురాలి బలవంతంమీద సికింద్రాబాద్ ఆనంద్‌లో హిందీ సినిమా చూసివస్తూ ఎనిమిదో నంబర్ బస్‌లో టాంక్‌బండ్ మీదుగా వచ్చాను."

"గుడ్. మీరు చెప్పిన యిన్ఫర్మేషన్ నాకు చాలా ఉపయోగపడుతుంది."

"నేను వాళ్ళు కనుమరుగయ్యేవరకు చూస్తూనే వున్నాను. అప్పుడు యిద్దరు-స్టూడెంట్సులాగే వున్నారు. రెండుసార్లు టాంక్‌బండ్ మీద కారులో వాళ్ళ ముందు నించి టర్న్ కొట్టి సికింద్రాబాదువైపు వెళ్ళిపోయారు. వాళ్ళు కావాలనే అనితను, రవిరాజ్‌ను దగ్గర్నుంచి పరీక్షగా చూసి వెళ్ళినట్టు నాకనిపించింది."

కిరణ్ లేచి "వస్తామండి, థాంక్యూ!" అని హాల్లో కూచుని వున్న మేజర్‌కి చెప్పి యిద్దరు బయటికి వచ్చారు.

# 9

కిరణ్‌ని చూడగానే అనిత ముఖం చిట్లించింది.

"ఎవరో వచ్చారని అటెండర్ చెప్పగానే మీరని మాత్రం అనుకోలేదు. నేను చెప్పవలసినవన్నీ యిదివరకే చెప్పేశాను. మళ్ళీ ఎందుకు వచ్చారు?" అన్నది విసుగ్గా.

"మరేంలేదు. ఓ ముఖ్యమైన విషయం మీతో చెప్పి పోదామని!" అన్నాడు కిరణ్ తాపీగా.

"ఏమిటది?"

"ఆ మామిడిచెట్టుకింద కూచుందాం, రండి!"

"ఫరవాలేదు చెప్పండి."

"రండి చెపుతాను....అలా కూచోండి! మరేంలేదు, మీ బాయ్ ఫ్రండ్సు తమ నేరాల్ని ఒప్పేసుకున్నారు. రవిరాజ్‌ని, కోమలినికూడా చంపింది తామేనని అంగీకరించారు" గాల్లోకి బాణంవేశాడు కిరణ్.

అనిత, పక్కలో బాంబుపడ్డట్టు తుళ్ళిపడి అంతలోనే సర్దుకొని, "ఏమిటి మీరు మాట్లాడుతున్నది?" అన్నది బింకంగా.

"మరేంలేదు, ఆ రోజు అంటే ఎనిమిదో తేదీ గురువారంనాడు టాంక్‌బండ్‌మీద మీరు రవిరాజ్ కూచుని మాట్లాడుకోవటం కోమలి చూసిందనీ అందుకే కోమలిని చంపేశామనీ, అలానే...."

అనిత రెండు చేతుల్లోను ముఖం దాచుకొని, "ఇంకేం చెప్పొద్దు! నేను భరించలేను! రవిరాజ్ మరణానికి నేనే కారకురాల్ని. కోమలిని చంపమని నేను చెప్పలేదు. భాస్కరాన్నిగాని, ఆ ముసలామెనుగాని నేను చెప్పకుండానే వాళ్ళు....వాళ్ళు....చంపేశారు! నా తప్పేం లేదు!" భయంతోను, ఎగ్జయిట్‌మెంటులోను అనిత శరీరం లతలా వణికిపోతోంది.

అంతలో శ్రీనివాస్ అక్కడికి వచ్చాడు.

"ఇన్‌స్పెక్టర్ రవిరాజ్‌ని చంపిన నేరానికి అనితను అరెస్టుచెయ్యి! తక్కిన విషయాలు స్టేషన్‌లో వివరంగా

చెపుతుంది. రికార్డు చేసుకో!" అన్నాడు డిటెక్టివ్ కిరణ్ లేస్తూ.

# 10

అనిత తన స్టేట్‌మెంటులో యిలా చెప్పింది!

"నేను రవిరాజ్‌ని ఎంతో ప్రేమించాను. అతని తోడిదే లోకమనుకున్నాను. కాని రవి నాకు ద్రోహం చేశాడు. చాలామంది అమ్మాయిలతో నాలాగే స్నేహం చేసి, వాళ్ళను కూడా నాతో చెప్పినట్టే పెళ్ళిచేసుకుంటానని మోసగించినట్టు నాకు తెలిసింది.

నా స్నేహితురాలి కోమలితో ఓసారి రవి షాపుకి వెళ్ళాను. అంతే, అప్పట్నుంచీ కోమలిని వెంటనంటి తిరుగుతూ నన్ను అలక్ష్యం చేశాడు. నాకు కసి రేగింది. నాకు దక్కని రవి మరెవరికీ దక్కకూడదనుకున్నాను. అందుకేం చెయ్యాలో పథకం రూపొందించాను.

యూనివర్సిటీ కాలేజీలో నాతోబాటు చదువుతున్న సురేష్, సారధి నేనంటే ప్రాణం పెడతారు. నా కడగంటి చూపుకోసం వాళ్ళిద్దరు యెన్నాళ్ళుగానో తపించిపోతున్నారని నాకు తెలుసు. నేను చెపితే నిప్పుల్లో దూకటానికూడా సిద్ధంగా వున్నారని వాళ్ళ చేష్టల ద్వారా గ్రహించాను. రవిమీద కసి తీర్చుకోవటానికి వాళ్ళ నుపయోగించుకోవాలని వాళ్ళను చేరదీశాను. వారిలో సురేష్‌కు పాత కారు ఒకటుంది.

ఎనిమిదో తేదీ గురువారం రవిని టాంక్‌బండ్ దగ్గరకు తీసుకొస్తాననీ, అతనికి బాగా దేహశుద్ధి చేసి వదిలెయ్యమనీ సురేష్‌కి, సారధికి చెప్పాను. రాత్రి పదిగంటలకరకు టాంక్‌బండ్‌మీద రవితో యెంతో ప్రేమగా కబుర్లు

చెపుతూ ఊచున్నాను. రవి నేను ఒలికించే ప్రేమ నిజమేనని నమ్మేశాడు.

పదిన్నర గంటల ప్రాంతాన టాంక్‌బండ్ నిర్మానుష్యంగా వున్న సమయంలో, టాంక్‌బండ్‌మీద ఫ్లోరసెంటు లైట్సు కనెక్షన్ తీసేసి గాఢాంధకారంగా చేసేశారు సురేష్, సారధి.

చీకట్లో రవిమీదపడి బాగా కొట్టేశారు. రవి తిరగబడ్డాడు. వాళ్ళిద్దరు కోపాన్ని నిగ్రహించుకోలేక రవి పీక నొక్కేశారు. రవి ప్రాణం పోయింది. మేం భయపడి పోయాం. వాళ్ళిద్దరు రవిని వెంటనే సాగర్లో తోసేశారు.

అయితే అనుకోకుండా రవిరాజ్‌ని వెతుక్కుంటూ టాంక్‌బండ్ దగ్గరకు కోమలి వచ్చింది. నేను రవితో టాంక్‌బండ్ దగ్గరకు వెళ్ళటం చూసిన వాళ్ళెవరో కోమలికి చెప్పారట. అతనికోసం ఆఘమేఘాలమీద టాంక్‌బండ్ దగ్గరకు వచ్చి, జరిగిన ఘోరాన్ని చూసి సన్నగా కేకపెట్టింది. సురేష్, సారధి వెంటనే ఆమెను పట్టుకొని తమ మోటార్ కారులో ఆమె నెక్కించుకొని యెక్కడికో తీసుకుపోయారు.

మర్నాడు వాళ్ళిద్దరు, కోమలికూడా కాలేజికి రాలేదు. అయితే పదో తేదీ ఉదయం నాకు కోమలి చంపబడిన విషయం తెలిసి సురేష్ సారధీలను నిలదీసి అడిగాను.

కోమలిని తామే ఒకరోజంతా అనుభవించి చంపేశామనీ, ఆమెను నేషనల్ యిన్‌స్టిట్యూట్ ఫర్ ఫారిన్ లాంగ్వేజస్ బిల్డింగు దగ్గర పారేశామనీ, సరిగ్గా అదే సమయానికి తమకు యేదో స్కూటర్ అడ్డు వచ్చిందనీ,

తమని చూసి అతను ఆగాడనీ, అతనెవరో తమకు తెలియకపోయినా తాము చేసిన హత్య చూసిన ప్రత్యక్ష సాక్షి కావటంవల్ల అతన్ని ప్రాణాలతో వదలకూడదని కారులో అతన్ని వెంబడించారట. అతనే భాస్కరం లెక్చరర్ అని నాకు తర్వాత తెలిసింది.

భాస్కరాన్ని నల్గొండ చౌరస్తాదాకా వెంబడించారట. భాస్కరం మలక్ పేటలో వుంటున్నాడనికూడా తర్వాత తెలిసింది. చౌరస్తా దగ్గర యేదో వెహికల్ అడ్డొచ్చి భాస్కరం స్లో చేశాడట స్కూటర్. అదే అదనుగా సురేష్, సారధి అతన్ని తమ దగ్గరున్న కత్తులతో పొడిచి చంపేశారట.

ఆ ఘోరాన్ని అటువైపుగా పోతున్న ఓ నడివయసామె చూసిందట. ఆమెను ప్రాణాలతో వదిలేతే తమ విషయమెక్కడ బయటపడిపోతుందోననే భయంతో తమకు అలవాటైన పద్ధతిలోనే ఆమెను నోట్లో గుడ్డలు కుక్కి కారులో కూచోబెట్టి విజయవాడ రోడ్ వరకు తీసుకుపోయి పొల్లిమ్మారం దగ్గర, తలమీద మోది, చంపేశారట.

ఆ తర్వాత మరుసటిరోజు కాలేజీలో నాకీ హత్యల గురించి చెప్పారు. నేను కోపంతో, ఆ సంగతి పోలీసులకు చెప్పేస్తానన్నాను. చెపితే తమతోబాటు నన్ను కూడా పోలీసులు హత్యానేరంకింద అరెస్టుచేస్తారని, ఆమె చెప్పినందువల్లనే తామీ హత్యలు చేసిన సంగతి పోలీసులతో చెప్పేస్తామనీ, నా జీవితం అంతటితో అంతమైపోతుందనీ బాగా భయపెట్టేశారు."

—:అయిపోయింది:—

# అందమైన యువతి

టెంపోరావ్

చేతిలో చిన్న సూట్ కేసు పట్టుకుని ఆమె యింటిముందు ఆగింది. గేటు తెర్చి ఆమె ముందు వరండామీదకు వెళ్ళి కాలింగ్ బెల్ బటన్ నొక్కింది. బెల్ మ్రోగగానే 28 ఏళ్ళ యువతి బయటకొచ్చి ఆమెవైపు చూసింది.

"గుడ్ మార్నింగ్!" అందామె.

గుడ్ మార్నింగ్ చెప్పి, "మీకెవరు కావాలి?" అని అడిగింది రాధిక.

ఆమె తీయగా నవ్వింది.

"నా పేరు లత. లక్ష్మి నా కజిన్ సిస్టరు. స్టేషన్ కి వచ్చి నన్ను రిసీవు చేసుకుంటానని రాసింది. కాని మర్చిపోయిందేమో, రాలేదు. చాలా సేపు ఆమెకోసం ఎదురు చూసి యిక్కడికొచ్చాను" అందామె.

"రండి, కూర్చోండి" అంది రాధిక.

హాల్లోని పేము కుర్చీల్లో యిద్దరూ కూర్చున్నారు. పైన ఫాన్ తిరుగుతోంది.

"లక్ష్మి బ్యాంకికి వెళ్ళిపోయింది. సాయంత్రం ఐదింటికి వస్తుంది. ఆమె భర్త రామచంద్రన్ గారు ఫాక్టరీకి వెళ్ళారు. ఆయన రాత్రి ఏడు దాటాక వస్తారు. వాళ్ళు పైభాగంలో వుంటున్నారు.

"గుడ్ గాడ్, సాయంత్రందాకా నేనిక్కడ మిమ్మల్ని బోర్ చేస్తూ కూర్చోవలసిందేనా?" అంది లత.

రాధిక నవ్వింది.

"అలా అనకండి. నేను ఒంటరిగానే వున్నాను. ఆయన ఆరింటికి వస్తారు. మాకు పిల్లలు లేరు."

అలసటగా ఆమె రాధికవంక చూసింది.

"కొంచెం మంచినీళ్ళు యిస్తారా?"

రాధిక లోపలకు వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. కుండలోని నీళ్ళు చల్లగా వున్నాయి. ఆమె గడగడ రెండు గ్లాసుల నీళ్ళు తాగేసింది.

"కాఫీ యిస్తాను, వుండండి" అని రాధిక లేచింది.

"కాస్సేపయ్యాక యిద్దురుగాని" అందామె.

"మీరు ఏం చేస్తున్నారు?"

"బి.ఎ. పాసయ్యాను."

"పెళ్ళి కాలేదనుకుంటాను?"

"ఇంకా కాలేదు. కట్నం యిచ్చి పెళ్ళి చేసుకోడం నాకిష్టంలేదు."

"మీ ఆదర్శాన్ని మెచ్చుకుంటున్నాను. నా పెళ్ళి కట్నంలేకుండానే అయింది. మాది లవ్ మేరేజి!" అంది రాధిక.

"అలాగే వుండాలి. ఐ యామ్ హేపీ!"

లోపలకు వెళ్ళి కాఫీ తెచ్చి రాధిక యిచ్చింది.

"మీకు శ్రమ కల్గిస్తున్నాను!"

"ఫరవాలేదు."

ఆమె కాఫీ తాగింది.

"ఇక్కడెక్కడేనా ఫోనుందా? ఒకసారి బ్యాంకికి ఫోన్ చేసి లక్ష్మితో మాట్లాడ్తాను."

"సమీపంలో వున్న మురగన్ మెడికల్ స్టోర్స్‌లో ఫోనుంది. పై ఫ్లాట్ తాళంచెవులు నాకిచ్చి లక్ష్మి బ్యాంకికి వెళుతుంది. మీరు పైకి వెళ్ళి విశ్రాంతిగా కూర్చోవచ్చు."

"లక్ష్మితో మాట్లాడివస్తాను" అని ఆమె సూట్ కేసును అక్కడ వదిలి బయటకు వెళ్ళిపోయింది.

పదిహేను నిమిషాలు తర్వాత ఆమె తిరిగి వచ్చింది.

"మాట్లాడారా?" అడిగింది రాధిక.

"దాన్ని మహా తిట్టేశాను. ఇవాళ మూడింటికే వస్తానంది. స్నానం చేసి, బట్టలు మార్చుకుని నన్ను తన బ్యాంకికి రమ్మంది. ఇద్దరం తిరిగివస్తాం."

రాధిక లోపలకు వెళ్ళి తిరిగొచ్చి తాళంచెవుల గుత్తిని ఆమెకిచ్చింది.

"ఆ మెట్లమ్మట పైకి వెళ్ళండి. స్నానం చేశాక యిక్కడికొచ్చి భోజనం చేసి వెళ్ళండి" అందామె.

"చాలా థాంక్స్" అని ఆమె పైకి వెళ్ళింది.

అరగంట తర్వాత ఆమె కిందకు దిగి వచ్చింది. తాళంచెవులను ఆమెకిచ్చేసింది.

"సూట్ కేస్‌తో కూడా బ్యాంకికి వెళ్తారా?"

"లక్ష్మి నేనూ కొంత షాపింగ్ చేసి వస్తాం అందుకని సూట్ కేసు పట్టుకెళుతున్నాను."

"భోజనం చేద్దురుగాని రండి!"

"మరోసారి చేస్తాను. యిప్పుడు ఆకలిగా లేదు. నేనిక్కడ రెండు రోజులు వుంటాను."

"బ్యాంకి అడ్రెసు తెల్సుగా?"

"ఫోన్‌లో ఆమె వివరంగా చెప్పింది. మీకు చాలా థాంక్స్. మీరు ఎంతో ఆప్యాయంగా నన్ను చూశారు. వెళ్ళివస్తాను" అందామె.

"రేపు మా యింట్లో భోజనం చేయాలి."

"అలాగే చేస్తాను. మీరిచ్చిన కాఫీ చాలా బాగుంది. మీ వంటకాలుకూడా చాలా బాగా వుండాలి."

నవ్వుతూ ఆమె బయటకు నడిచింది. రాధిక హాల్లోకి వెళ్ళి ముందు తలుపు మూసుకుంది.

## 2

సాయంత్రం ఐదింటికి లక్ష్మి యింటికొచ్చింది. ఆమె వైపు రాధిక ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటి ఒంటరిగా వచ్చారు? మీ కజిన్ సిస్టర్ ఏమైంది?" ప్రశ్నించింది రాధిక.

"కజిన్ సిస్టర్ ఎవరు? నా కటువంటి వాళ్ళెవరూ లేరే!"

క్షణకాలం రాధిక నోటమ్మట మాట పెగల్లేదు.

"ఆమె వచ్చింది. పేరు లతని చెప్పింది. మీతో ఫోన్‌లో మాట్లాడతానని మురుగన్ మెడికల్ స్టోర్స్‌కు వెళ్ళి తిరిగివచ్చి మాట్లాడానంది. తాళంచెవులు ఆమె కిచ్చాను. స్నానంచేసి మీ రే మీ ఆఫీసుకు రమ్మన్నారట. ఆమె అరగంట తర్వాత మీ బ్యాంకికి వెళ్ళింది."

గాభరాతో ఆమె చెప్పినదంతా లక్ష్మి విన్నది.

తాళంచెవులు తీసుకుని లక్ష్మి పైకి పరుగెత్తింది. వెనకనే వెళ్ళింది రాధిక.

"ఆమె మోసగ త్తెలా లేదు. చదువుకున్న, సంస్కారం గల యువతిలా వుంది" అంది రాధిక.

తాళంతీసి లక్ష్మి లోపలకు వెళ్ళింది. బీరువా తెర్చి చూసింది. అమాంతంగా అర్చింది.

"ఆ దొంగముండ నా నగలన్నీ ఎత్తుకుపోయింది. డబ్బంతా పట్టుకుపోయింది. ఆయనవచ్చి ఏమంటారో!"

రాధిక భయంతో లక్ష్మివంక చూసింది.

"ఇంటికొచ్చాక ఆయన యేమంటారో అని నాకు భయంగా వుంది. యాభై వేల రూపాయల విలువగల బంగారం నగలు పోయాయి. అదికాక ఐదు వేలుపైన క్యాష్ మాయమైంది" అంది లక్ష్మి.

"నేను తప్పు చేశాను. ఆమెకు తాళంచెవులు యివ్వ కుండా వుంటే బాగుండేది!" అంది రాధిక.

"ఆమె మిమ్మల్ని నమ్మించింది. నాతో ఫోన్‌లో మాట్లాడానని చెప్పి మీలో ఏర్పడిన నమ్మకాన్ని ఇంకా బలపర్చింది. ఆ స్థితిలో నేనుకూడా తాళంచెవులు ఇచ్చే దాన్ని" అంది లక్ష్మి.

నిమిషాలు గడుస్తున్నాయి. గదులన్నీ లక్ష్మి వెతికి చూస్తోంది.

"బీరువాలోని వస్తువులు మాత్రం అది పట్టుకు పోయింది. మరేమీ ముట్టుకోలేదు!"

లక్ష్మి వంట గదిలోకి వెళ్ళింది. మోడర్న్ బ్రెడ్ కవరు నేలమీద పడివుంది. దానివైపు లక్ష్మి సూటిగా చూసింది.

"ఆ పాకెట్‌లో వుండే బ్రెడ్ ముక్కలు ఆమె పూర్తిగా తినేసింది" అంది లక్ష్మి.

"ఆకలిగా వుండుండాలి! మా యింట్లో కూర్చుని

రెండు గ్లాసుల నీళ్ళు, కాఫీ తాగేసింది. ఆమె దొంగని యెవ్వరూ అనుమానించరు. చక్కగా మాట్లాడుతుంది. చదువుకున్నదయి వుండాలి" అంది రాధిక.

"చదువుకున్న వాళ్ళు వుద్యోగాలు దొరక్క అలా తయారవుతారా" అంది లక్ష్మి.

"ఖర్మగాని దానికి ఉద్యోగం ఎందుకు? ఆమె చాలా అందంగా వుంది. వయసు 24 పైన వుండదు. ఎందరో యువకులు ఆమెను పెళ్ళాడ్డానికి గెంతులేస్తూ వస్తారు" అంది రాధిక.

ఏడు తర్వాత రామచంద్రన్ వచ్చాడు. జరిగినదంతా భార్య అతడితో చెప్పింది.

"వెంటనే పోలీసు రిపోర్టు యివ్వాలి" అన్నాడతను.

రాధిక భర్త వీరేశం అతడివైపు చూశాడు.

"నా భార్యను ఇందులో యిరికించకండి. మీ తాళం చెవులు తీసుకోవద్దని నా భార్యతో యెన్నిసార్లో చెప్పాను" అన్నాడు వీరేశం.

"ఆమె యిందులో యిరుక్కోదు. మీరు భయపడకండి" అన్నాడు రామచంద్రన్.

ఇన్స్పెక్టర్ రాకేష్ శర్మ జీపులో వాళ్ళ యింటికొచ్చాడు. మెట్లెక్కి పైకి వెళ్ళాడు. రామచంద్రన్ అతడితో కరచాలనం చేశాడు.

"ఇన్స్పెక్టర్, ఆమె చాలా తెలివిగా మోసం చేసింది. ఆమెను మీరు వెంటనే పట్టుకోవాలి" అన్నాడు రామచంద్రన్.

"డోంట్ బాదర్, ఆమె యెక్కడుందో మేం కనుక్కుంటాం. అంతా వివరంగా చెప్పండి" అన్నాడు ఇన్స్పెక్టర్.

రామచంద్రన్ అంతా వివరంగా చెప్పాడు.

"మీరు, మీ భార్యా ఆమెను చూడలేదు!"

"లేదు, సార్."

"ఆమెను చూసిన వ్యక్తి శ్రీమతి రాధిక.

"అవును."

"ఆమెతో మాట్లాడాలి!"

"ఆమె కిందభాగంలో వుంటోంది. మీరు అక్కడకు వెళ్ళి ఆమెతో మాట్లాడొచ్చు."

ఇన్స్పెక్టర్ రాకేష్ శర్మ మెట్లు దిగాడు. కింద హాల్లోకి వెళ్ళాడు. వీరేశం అతడివైపు పరధ్యానంగా చూసి, "ఏం కావాలి" అని అడిగాడు.

"రాధికతో మాట్లాడాలి."

వీరేశం భార్యను పిల్చాడు. వంటింట్లోంచి ఆమె నవ్వుతూ వచ్చింది.

ఇన్స్పెక్టర్ ఆమెవైపు సూటిగా చూశాడు.

"మీరు చూసిన యువతి యెలా వుంటుంది?" అడిగాడతను.

"ఆమె చాలా అందంగా వుంది, సార్. బి.ఎ. పాసయ్యానని నాతో చెప్పింది."

"ఆమెను యింకా వర్ణించాలి.

రాధిక కాస్సేపు ఆలోచిస్తూ వుండిపోయింది.

ఆమె పచ్చగా వుంది. కోలముఖం. పొడుగాటి జడ. చెవులకు కమ్మలున్నాయి. మెడలో ఒంటిపేట గొలుసుంది. చేతిలో సూటుకేసు వుంది. ప్రింటెడ్ సిల్కు చీర ధరించిందామె. కాళ్ళకు ఎర్రటి స్లిప్పర్సు వున్నాయి. కుడిచేతికి మాత్రం గాజులున్నాయి. ఎడంచేతికి చక్కటి వాచ్ వుంది."

"ఆమెను యెక్కడేనా మీరు మళ్ళా చూస్తే పోల్చ గలరా?"

"తప్పకుండా పోలుస్తాను."

ఇన్‌స్పెక్టర్ ఆమెవైపు సూటిగా చూశాడు.

"రాధికగారూ, పత్రికల్లో ఇటువంటి మోసాలను గురించి మీరు చదివే వుంటారు. ఆమెను మీరంతగా యెందుకు నమ్మారు?" ప్రశ్నించాడతను.

"ఆమె చాలా మంచిదానిలా నాకు అనిపించింది. ఆదర్శాలున్న యువతి అని అనుకున్నాను. ఆమె చక్కగా మాట్లాడుతుంది.

"ఆమెకు పెళ్ళయి వుంటుందా?"

"కాలేదండి. ఆమె చెప్పిన మాటల్లో కనీసం అదేనా మనం నమ్మాలి" అందామె.

"ఆమె చెప్పిందేదీ నమ్మలేం. ఇటుపైన అటువంటి వాళ్ళు యిక్కడకు వస్తే జాగ్రత్తగా వుండండి" అని అతడు మెట్లెక్కి పైకి వెళ్ళాడు.

రామచంద్రన్ అతడికొక జేబు రుమాలు చూపించాడు.

"ఇన్‌స్పెక్టర్, యీ రుమాలు మాదికాదు, ఆమెదై వుండాలి" అన్నాడతను.

రుమాలువైపు ఇన్‌స్పెక్టర్ పరీక్షగా చూశాడు. అటువంటి రుమాళ్ళు బట్టల షాపుల్లో అనేక చోట్ల దొరుకుతాయి.

"దీన్ని ఎవ్వరూ ముట్టుకోకండి. వెంటనే పోలీస్ డాగ్‌ని రప్పిస్తాను" అన్నాడతను.

"ఇన్‌స్పెక్టర్, పోయిన నగల లిస్టు యిది. అన్నీ వివరంగా చూశాను. అవికాక ఐదు వేలు కాష్‌కూడా పోయింది."

"అంత క్యాష్ మీరు ఇంట్లో ఎందుకు వుంచుకున్నారు? ఏం బ్యాంకిలోనో వేయొచ్చుగా?"

"బ్యాంకిలో వేద్దామనే బీరువాలో దాచాను. ఈ లోపలే యిదంతా జరిగిపోయింది."

"మిష్టర్ రామచంద్రన్, యీనాడు ఎన్నో నేరాలు ప్రజలు అజాగ్రత్తగా వుండడంవలన జరుగుతున్నాయి. ప్రజలు జాగ్రత్తగా వుంటే నేరస్థులు ఏమీ చెయ్యలేరు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాకేష్‌శర్మ.

ఇన్‌స్పెక్టర్ గదిలో పచార్లుచేస్తూ మళ్ళీ రుమాలు వైపు చూశాడు.

"ప్లీస్, రాధికను ఒకసారి పైకి రమ్మనండి!"

లక్ష్మి కిందకు వెళ్ళింది. కాస్సేపట్లో యిద్దరూ పైకి వచ్చారు.

"ఈ రుమాలును ఆమె చేతిలో మీరు చూశారా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఇది నాది సార్! సాయంత్రం లక్ష్మితో పైకివచ్చినపుడు యిక్కడ వదిలేసి వుంటాను" అందామె దాన్ని తీసుకుంటూ.

"పోలీసు కుక్కలకూ, మాకూ శ్రమ తగ్గించారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఆమెవైపు చూస్తూ.

ఇన్‌స్పెక్టర్‌తో రామచంద్రన్ కిందకు వెళ్ళాడు. జీప్ దగ్గర యిద్దరు కానిస్టేబుళ్ళు వున్నారు.

"ఇన్‌స్పెక్టర్, తొందరగా యేదోచేసి మా నగలు మాకు అందేటట్లు మీరు చూడాలి!" అన్నాడు రామచంద్రన్.

ఇన్‌స్పెక్టర్ అతడివైపు చూశాడు.

"రాధిక భర్త వీరేశం ఎక్కడ పనిచేస్తున్నాడు?"

"సునీల్ అండ్ సన్స్ కంపెనీలో సేల్స్‌మన్."

"రాధిక యెటువంటిది?"

"రాధిక, భర్త మంచి వాళ్ళు. ఆమెను మీరు అనుమానిస్తున్నారా?"

"అనుమానించాలిగా! యెవరో యింటికి వచ్చారని చెప్పి, ఆమే అంతా చేసి వుండొచ్చుగా!" అన్నాడు యిన్‌స్పెక్టర్.

"ఆమె అలా చేయదు! చాలాకాలంనుంచి వాళ్ళు మాకు తెలుసు."

"ఆల్ రైట్ చూద్దాం" అని యిన్‌స్పెక్టర్ రాకేష్ శర్మ కానిస్టేబులువైపు చూశాడు.

కానిస్టేబులు జీప్‌ని పోనిచ్చాడు. రామచంద్రన్ మెల్లిగా మెట్లెక్కి పైకి వెళ్ళాడు. లక్ష్మి పరుపుమీద పడుకుని ఏడుస్తోంది.

# 3

ఇన్‌స్పెక్టర్ రాకేష్ శర్మ తన మోటార్ సైకిల్ని వేగంగా పోనిచ్చాడు.

అతడిప్పుడు మామూలు డ్రస్సులో వున్నాడు. డ్యూటీలో లేని సమయాల్లో అతడు పరిశోధన సాగిస్తూ వుంటాడు. అతడొక పోలీసు యిన్‌స్పెక్టరని ఎవ్వరూ తెలుసుకోలేరు.

పాంట్, స్లాక్‌లో రాకేష్ వస్తాదులా కనుపిస్తాడు. అతడు మోటార్ సైకిల్ని ఒకచోట ఆపి దిగాడు. సమీపంలో వున్న మురుగన్ మెడికల్ స్టోర్స్‌వైపు వెళ్ళాడతను.

స్టోర్ యజమాని అతడివైపు నవ్వుతూ చూశాడు.

"ఏం కావాలి, సార్?"

"ఇవాళ మధ్యాహ్నం ఒక యువతి యిక్కడినుంచి యెవరికేనా ఫోన్ చేసిందా?"

"లేదు, సార్. యెవ్వరూ ఫోన్ చేయలేదు."

"జ్ఞాపకం తెచ్చుకోండి! మీరు పనిలో వున్నపుడు యెవరైనా వచ్చి వుండొచ్చు!" అన్నాడు రాకేష్.

"ఈ ఫోన్ వారం రోజులనుంచి పనిచేయడంలేదు. కేబుల్ ఫాల్ట్ అని అన్నారు."

"ఆమె వచ్చి మిమ్మల్ని అడిగి వుండొచ్చుగా!"

"ఎవ్వరూ నన్ను అడగలేదు!"

"థాంక్స్" అని అతడు తన మోటారుసైకిల్ వైపు నడిచాడు.

మోటర్ బైక్ పక్కనే నిలబడి అతడు సిగరెట్ వెలిగించాడు. పొగ వదులూ నలువైపులా చూశాడు. అనేక షాపులున్నాయి. రాధిక భర్త రేసింగ్ గైడ్ కొనుక్కొని తన యింటివైపు పోతున్నాడు. అతడు రాకేష్‌ను చూడలేదు.

వీరేశానికి రేసింగ్ పిచ్చి వుందన్నమాట!

రాకేష్ తన మోటర్‌సైకిల్ని పోనిచ్చాడు. సునీల్ అండ్ సన్స్ కంపెనీలో తనకు తెలిసిన ఒక వ్యక్తి పనిచేస్తున్నాడు. అతడింటిముందు రాకేష్ మోటర్ బైక్ ఆపి దిగాడు.

"సార్, మీరా?" అన్నాడు రామారావు అతడిని చూసి బయటకొస్తూ.

"రామారావు, మీ ఆఫీసులో పనిచేసే వీరేశం తెలుసా?"

"వీరేశమా? అతనిప్పుడు మైలాపూరు బ్రాంచిలో పనిచేస్తున్నాడు."

"అతడిని గురించి ఏం చెప్పగలవు?"

"సేల్స్‌మన్‌గా మంచి పేరుంది. కాని అప్పులతో పీకదాకా నిండివున్నాడు. గుర్రప్పందాలకు వెళ్ళి డబ్బు పోగొట్టుకుంటూ వుంటాడని అందరికీ తెలుసు."

"అతడు నీకేమైనా బాకీపడ్డాడా?"

"ఒకసారి యాభై రూపాయిలిచ్చాను. అది తిరిగి రాలేదు. వసూదనే నమ్మకంలేదు. నన్ను మళ్ళా అతడు అప్పు అడగలేదు."

"అతడికి వేరే చెడ్డ అలవాట్లు వున్నాయా?"

"పేకాడ్తాడు. సిగరెట్లు వూదేస్తాడు. తాగుతాడు ఇవన్నీ సాధారణంగా కలిసే వుంటాయి."

రామారావు, అతడిని నువ్వు కలుసుకుంటే నేను యిదంతా అడినట్లు చెప్పకు!"

"చెప్పను, సార్."

రోడ్డు దీపాలు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. రాకేష్ మోటర్ సైకిల్ని వేగంగా పోనిస్తున్నాడు. యెదురుగా టి.వి.ఎస్ 50మీద వస్తూన్న వ్యక్తికి సౌజ్ఞ చేస్తూ అతడు మోటర్ సైకిలు ఆపాడు.

"హలో, యిన్‌స్పెక్టర్!" అన్నాడు రామచంద్రన్.

"వీరేశానికి మీరు యెప్పుడేనా అప్పుగా డబ్బు యిచ్చారా?"

"ఇచ్చాను. వెయ్యి రూపాయిలు యిచ్చుంటాను. బోనస్ వచ్చాక యిచ్చేస్తానన్నాడు."

రాకేష్ ఆలోచిస్తూ వుండిపోయాడు.

"మీరింకా అతడిని అనుమానిస్తున్నారా?

"అతడు అప్పుల్లో వున్నాడు. రేసుల్లో యెంతో పోగొట్టుకుంటున్నాడు. అటువంటి వాడికి డబ్బు

కావాలిగా?" అడిగాడు రాకేష్.

"అతడికి దొంగ బుద్ధి లేదు, సార్. అడిగి అప్పుగా తీసుకుంటాడు. అతడి భార్య చాలా మంచిది."

"మీరూ అతనూ డ్రింక్స్ సేవిస్తూ వుంటారా?"

"ఆదివారం యిద్దరం కలిసి డ్రింక్స్ తీసుకుంటూ వుంటాం. అతడు రోజూ డ్రింక్ చేస్తాడు. అతడు సేల్స్ మన్ గా! వస్తువులను అతడు క్లయింట్లకు అమ్మేస్తూ వుంటాడు. ఈనాటి వ్యాపారం ప్రతి కంపెనీలోనూ అలాగే సాగుతూ వుంటుంది."

"థాంక్స్, గుడ్ నైట్" అని రాకేష్ తన మోటారు బైక్‌ను పోనిచ్చాడు.

## 4

తేనాంపేటలోని ఒక కాంపౌండులోకి ఆమె ప్రవేశించింది. ముందు వరండామీద నడిచి హాల్లోకి వెళ్ళింది. హాల్లో వున్న పనిమనిషి ఆమెవంక చూసింది.

"అమ్మ లేరూ?"

"పిల్లలతో ఆమె ఎక్కడికో వెళ్ళారు. తిరిగొచ్చేసరికి రెండవుతుందన్నారు. మీరు ఎవరు?"

"ఈ ఇంటి పిల్లలు చదివే స్కూలు హెడ్ మిస్ట్రెస్‌ని. అమ్మ నన్ను రమ్మన్నారు. అందుకని వచ్చాను."

"అలా కూర్చోండమ్మా!" అంది నౌఖరు.

ఆమె సోఫాలో కూర్చుంది. పనిపనిషి ఫాన్ స్విచ్ నొక్కింది. ఫాన్ తిరుగుతోంది.

"మంచినీళ్ళు కావాలా?"

"పట్రా."

పనిమనిషి లోపలకు వెళ్ళి రిఫ్రిజిరేటర్‌లోని నీళ్ళ బాటిల్ను తెచ్చి ఆమెకిచ్చింది. ఆమె బాటిల్లోని నీళ్ళను

పూర్తిగా తాగేసింది. బాటిల్ను పనిమనిషికిచ్చింది.

"నువ్వు తప్ప యింట్లో ఎవ్వరూ లేరా?"

"లేరండమ్మా."

"చాలా కాలంనుంచి యిక్కడ పనిచేస్తున్నావా?"

"రెండేళ్ళనుంచి ఇక్కడే వుంటాను. తిండికూడా యిక్కడేనమ్మా."

"మంచి యింట్లో పడ్డావు!" అందామె.

"మీ పేరమ్మా?"

"హేమలత."

"అమ్మగారు వచ్చాక మీ గురించి చెప్తాను."

"నేను మళ్ళా యిక్కడకు రాలేను. కొత్త ఎడ్మిషన్లతో తీరిక లేదు. ఆమెనే స్కూలుకి రమ్మను."

ఆమె లేచింది. ధరించిన చీర కిందకు జారిపోతోంది. ఆమె చీరను పట్టుకుని పక్క గదివైపు చూసింది.

"ఆ గదిలోకెళ్ళి చీర సరిగ్గా కట్టుకుంటాను" అందామె.

"కట్టుకోండమ్మా."

ఆమె లోపలకు వెళ్ళింది. తలుపును మూసింది. పదిహేను నిమిషాలు తర్వాత బయటకొచ్చింది, తన హేండ్ బాగ్‌తో.

"నువ్వు చాలా మంచిదానవు. నీకెప్పుడేనా పని కావలసివస్తే మా స్కూలుకిరా. ఇక్కడికంటె ఎక్కువ జీతం అక్కడ నీకిస్తాను" అందామె.

"ఈ యిల్లు వదలనమ్మా."

"వదలొద్దు. వదలవలసివస్తే మా స్కూలుకు రావచ్చు."

"మీ స్కూలు ఎక్కడమ్మా?"

"అదంతా మీ అమ్మకు తెలుసు. నేను వచ్చానని చెప్పు. ఎన్నో పనులుండడంవలన వెళ్ళిపోయానని చెప్పు. ఆమెను తప్పక రమ్మను" అందామె.

"అలాగేనమ్మా."

ఆమె బయటకు వెళ్ళిపోయింది.

రెండింటికి యింటిముందు ఫియట్ కారు ఆగింది. మనోరమ, యిద్దరు పిల్లలు దిగి హాల్లోకి వచ్చారు.

"మీకోసం మిస్సమ్మ వచ్చి వెళ్ళారు" అంది పని మనిషి.

"ఎవరు?"

"హేమలతమ్మగారు. పిల్లలు చదివే స్కూలు పంతు ల్నమ్మ."

"ఆమె ఎవరో నాకు తెలియదు."

"మీరు రమ్మన్నారుట."

"ఎవరో పొరపాటున ఇక్కడకు వచ్చుంటారు" అని ఆమె పడగ్గదిలోకి వెళ్ళింది.

కొంతసేపయ్యాక మనోరమ పడగ్గదిలోంచి "కామినీ!" అని పిల్చింది.

పనిమనిషి పడగ్గదిలో కెళ్ళింది. మనోరమ గాడ్రెజ్ బీరువాముందు నిలబడి వుంది.

"నా నగలు లేవు. ఏమయ్యాయి?" అడిగిందామె.

"ఎవరు ముట్టుకుంటారమ్మా? అక్కడే వుంటాయి, చూడండి!"

వెతుకుతున్నకొద్దీ ఆమెలో గాభరా ఎక్కువైంది.

"డైమండ్ కమ్మలు, రవ్వల హారం, డైమండ్ రింగ్స్, గాజులు అన్నీ పోయాయి."

కామిని నోటమ్మట మాట పెగల్లేదు.

"నాకోసం వచ్చినామె యీ గదిలోకొచ్చిందా?"

"చీర జారిపోతూంటే యీ గదిలోకెళ్ళి ఆమె కట్టుకుందమ్మా" అంది పనిమనిషి.

"అది నాకు మొదటే ఎందుకు చెప్పలేదు? నిన్ను నమ్మకొని యింటికి కాపలా పెట్టి వెళ్తే ఆ దొంగముండని యీ గదిలోకి వెళ్ళనిచ్చావా? దిగజారే చీరను హాల్లోనే నీముందు కట్టుకోవచ్చుగా!" అర్చింది మనోరమ.

"నన్ను క్షమించడమ్మా. నా బుర్రకి అదంతా తట్ట లేదు" అంది పనిమనిషి.

"ఆమె వెళ్ళి ఎంతసేపయింది?"

"చాలా సేపయిందమ్మా."

మనోరమ గాభరాగా కారులో కూర్చుంది.

"డ్రయివర్ కాన్వెంట్‌కు పద!" అందామె.

"పిల్లల్ని చూసుకో! ఎవ్వర్నీ లోపలకు పంపకు" అని ఆమె పనిమనిషిని హెచ్చరించింది.

కారు కాన్వెంటువైపు దూసుకుపోయింది. పెద్ద కాంపౌండులో కారు ఆగింది. ఆమె దిగి ప్రిన్సిపాల్ రూముకు వెళ్ళింది.

మిస్ జాన్‌మేరీ ఆమెవైపు నవ్వుతూ చూసింది.

"మనోరమగారూ, ఏమిటి సంగతి?" అడిగిందామె.

"మీ స్కూలునుంచి యెవరైనా మా యింటికి వచ్చారా?"

"ఎవ్వరూ వచ్చుండరు. నే వెళ్ళమనలేదు. నేను వెళ్ళమంటేగాని ఎవ్వరూ వెళ్ళరు. ఇదంతా ఎందుకడుగుతున్నారు? ఏమైంది?" ప్రశ్నించిందామె.

జరిగినదంతా మనోరమ చెప్పింది.

"పాపం పెరిగిపోతోంది. ఈ లోకంలో నేరస్తులు

ఎక్కువై పోతున్నారు. మరోసారి జీసస్ అవతరించి లోకాన్ని బాగుపర్చాలి" అందామె.

మనోరమ కుర్చీలోంచి లేచింది.

"వెంటనే పోలీసు రిపోర్టు యివ్వండి" అని ఆమె సలహా యిచ్చింది.

మనోరమ వెళ్ళి కారులో కూర్చుంది. ఆమె గుండె దడదడలాడ్తోంది.

"డ్రయివర్, యింటికి పద!" అందామె.

కారు దిగి ఆమె హాల్లోకి వెళ్ళింది.

"ఆ పంతులమ్మ దొరికిందా?" అడిగింది పనిమనిషి.

మనోరమ జవాబివ్వలేదు. టెలిఫోన్ వైపు నడిచి రిసీవర్ ఎత్తింది. ఒక నంబర్ను తిప్పింది.

"హలో. మనోరమా షుగర్ మిల్స్!" అంది టెలిఫోన్ ఆపరేటర్.

"వెంటనే రామరాజా గారితో మాట్లాడాలి."

"ప్లీస్, వుండండి."

మరుక్షణంలో కనెక్షన్ యివ్వబడింది.

"హలో, మనూ!" అన్నాడు రామరాజా.

జరిగినదంతా ఆమె చెప్పింది.

"మనూ, డోంట్ బాదర్! పోయిందేదో పోయింది. ఇలా దొంగతనాలుచేసే ఒక యువతి గురించి యీ మధ్య పేపర్లో చదివాను. యిన్స్పెక్టర్ రాకేష్‌శర్మ ఆమెను గురించి దర్యాప్తుసాగిస్తున్నాడు. అతడికి నేను రిపోర్టిస్తాను. ఏం చేయాలో అతడు చూసుకుంటాడు" అన్నాడు రామరాజా.

"అంత విలువైన నగలు పోయినా మీరు లెక్క చేయడంలేదు!" అందామె.

"మనూ, పోయిందాన్ని గురించి విచారించడంవలన లాభించదు. పోయినదంతా ఒక్క రోజులో నేను గడించగలను. దానికోసం ఏడుస్తూ కూర్చుంటే ఏ పనీ చెయ్యలేను. ఇది నీకూ, నాకూ కూడా వర్తిస్తుంది. కామినిని ఎక్కువగా తిట్టకు! ఎవరు యేం చెప్పినా అది నమ్ముతుంది. అదొక బిలీవింగ్ యిడియట్!"

"ఆల్ రైట్, అలాగే చేస్తాను" అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

## 5

ఇన్‌స్పెక్టర్ రాకేష్ శర్మ ఏర్ కండిషండ్ గదిలోకి నడిచాడు. స్ప్రింగ్ తలుపు అతడి వెనకనే మూసుకు పోయింది.

రామరాజు అతడితో కరచాలనంచేసి కూర్చు మన్నాడు.

"మీ లత మళ్ళా మోసంచేసి నగలుపట్టుకుని పారి పోయింది. పేరు కొద్దిగా మారింది. ఆమె హేమలత అయింది" అన్నాడు రామరాజు.

"ఎక్కడ ఏం జరిగిందో చెప్పండి, సార్."

"ఇవాళ ఆమె మా యింటిమీద దాడి చేసింది. ఆ సమయంలో పనిమనిషి కామిని మాత్రం ఇంట్లో వుంది. నా భార్య మనోరమ, యిద్దరు పిల్లలు ఎక్కడికో వెళ్ళారు."

తర్వాత జరిగినది రామరాజు చెప్పాడు.

"గుడ్ గాడ్, చాలా తెలివిగా, ధైర్యంగా ఆమె దొంగతనాలు సాగిస్తోంది" అన్నాడు యిన్‌స్పెక్టర్ రాకేష్ శర్మ.

"ఈసారి ఆమె పట్టుకుపోయిన నగల విలువ లక్ష

రూపాయలు పైన వుంటుంది."

పోయిన నగలలిస్టు కాగితంమీద రాసి అతడు యిన్‌స్పెక్టర్‌కి యిచ్చాడు.

"రామరాజుగారూ, ఒకసారి నేను మీ యింటికి వెళ్ళాలి!"

రామరాజు నవ్వుతూ అతడివైపు చూశాడు.

"అక్కడ మీరు చూడవలసింది ఏమీ లేదు. అయినా సాయంత్రం మామూలు డ్రస్సుల్లో రండి. పోలీసు జీప్‌లో వస్తే మా యింట్లో ఏదో జరిగిందని అందరూ అనుకుంటారు. నాకా పబ్లిసిటీ అంటే అంతగా గిట్టదు. పోయింది దొరికితే, గుడ్! దొరక్కపోతే నాకు ఫికార్ లేదు!"

"అలాగే ఐదింటికి వస్తాను. మీరూ వీలైతే అక్కడ వుండండి."

"ఆల్‌రైట్, వుంటాను" అన్నాడు రామరాజు.

ఇన్‌స్పెక్టర్ సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు. రామరాజు భార్యకు ఫోన్ చేశాడు.

"మనూ, ఇన్‌స్పెక్టర్ రాకేష్ శర్మ మనింటికి ఇవాళ ఐదింటికి వస్తాడు. మంచి టిఫిన్ రెడీగా వుంచు."

"అలాగే" అందామె.

"అతను మఫ్టీలో వస్తాడు. పోలీసు యిన్‌స్పెక్టర్ అని కామినికి చెప్పకు. చెప్తే అది భయపడుతుంది."

"చెప్పను" అందామె.

"ఆల్‌రైట్, మనూ" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

సరిగ్గా ఐదింటికి మోటర్‌బైక్ యింటిముందు ఆగింది. రామరాజు అతడికి స్వాగతం చెప్పి హాల్లోకి తీసుకెళ్ళాడు.

"విత్ ఎట్ హోమ్!" అన్నాడు రామరాజు.

ఇద్దరూ సోఫాల్లో కూర్చున్నారు.

"ఆమె యీ గదిలోనే కూర్చుంది. తర్వాత పడక గదిలోకి వెళ్ళి చీరను సర్దుకుంది."

"పదండి, ఆ గదిలోకి వెళ్దాం" అన్నాడు రాకేష్.

ఇద్దరూ పడగ్గదిలోకి వెళ్ళారు. రాకేష్ గది నలు మూలలా చూశాడు. గాడ్రెజ్ బీరువాను పరీక్షించాడు. యటాచ్‌డ్ బాత్‌రూంలోకి వెళ్ళాడు. అన్నివైపులా చూశాడు.

"ఆమె యెక్కడా ఏమీ వదలడంలేదు. చాలా జాగ్రత్తగా వుంటోంది" అన్నాడు రాకేష్.

"ఆడవాళ్ళు మొగాళ్ళకంటె తెలివిగా దొంగతనం చేయగలరు!" అన్నాడు రామరాజు.

ఇద్దరూ ముళ్ళా హాల్లోకి వచ్చారు. కాస్సేపట్లో మనోరమ గదిలోకి వచ్చింది. రామరాజు ఆమెను రాకేష్‌కి పరిచయం చేశాడు.

"త్వరలో ఆ యువతిని మేం పట్టుకుంటాం. మీరు బెంగెట్టుకోకండి" అన్నాడు రాకేష్.

"చాలా థాంక్స్" అందామె.

"కామిని యిక్కడే వుందా?"

"అది పల్లెటూరిది. దానితో మాట్లాడ్డం మీకు యే విధంగానూ వుపయోగపడదు. అంతే కాదు. దానికి పోలీసులంటే వల్లమాలినంత భయం" అన్నాడు రామరాజు.

"నేను పోలీసు యిన్‌స్పెక్టర్‌గా లేనుగా! ఒకసారి పిలవండి. మాట్లాడి చూస్తాను."

మనోరమ పిలవగానే కామిని గదిలోకొచ్చింది.

"ఈయన నా ఫ్రెండు రాకేష్" రామరాజు ఆమెతో చెప్పాడు.

"నమస్కారాలు అయ్యా" అంది కామిని.

"ఇక్కడికొచ్చిన యువతి ఎలా వుంటుంది?"

"పెద్దింటి పిల్లలా వుందయ్యా. చక్కటి చుక్కలా వుంది. నాకు ఉద్యోగంకూడా యిస్తానంది. నేనీ యిల్లు వదలనన్నాను."

"ఆ గదిలో ఆమె ఎంత సేపుంది?" అడిగాడు రాకేష్.

"ఎక్కువసేపే వుందయ్యా."

"ఆమెను ఎక్కడేనా చూస్తే పోల్చగలవా?"

"పోల్చగలనయ్యా."

రామరాజు సోఫాలోంచి లేచాడు.

"రాకేష్, మా యింటికి మీరు రావడం యిదే మొదటిసారి. డైనింగ్ హాల్లోకి వెళ్ళి టిఫిన్ తిందాం, పదండి" అన్నాడు రామరాజు.

కామిని వెళ్ళిపోయింది. రామరాజు, రాకేష్ లోపలున్న డైనింగ్ హాలువైపు నడిచారు. ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు. అనేక పదార్థాలు ప్లేట్లలో టేబులుమీద పెట్టబడి వున్నాయి.

"రాకేష్, ఆ యువతిని కాస్సేపు మర్చిపోయి మెల్లిగా టిఫిన్ సేవించుదాం" అన్నాడు రామరాజు.

## 6

బస్సు పక్కనుంచి టాక్సీ దూసుకుపోయింది. బస్సులో కూర్చున్న సుబ్బారావు టాక్సీలో కూర్చున్న యువతిని చూసి వులిక్కిపడ్డాడు.

ఆమెను చూసి చాలా కాలమైంది. రెండేళ్ళపైగా ఆమెకోసం అతడు వెతుకుతున్నాడు. ముందు వెళ్తూన్న

టాక్సీవైపే అతడు చూస్తున్నాడు. టాక్సీ యింకా కనబడ్తోంది. కాని బస్సులో తను ప్రయాణం చేస్తే టాక్సీ యెక్కువసేపు కనబడకపోవచ్చు.

బస్సు ఆగగానే అతడు దిగాడు. పక్కనుంచి పోతున్న ఆటోలో కూర్చుని వేగంగా వెళ్ళమని డ్రైవర్ని హెచ్చరించాడు.

ఆటో వెళ్తోంది. దూరంలో టాక్సీ కనిపిస్తోంది.

"ఇంకా వేగంగా పోనీ!" అర్చాడతను.

"ఎక్కడికెళ్ళాలి?" అడిగాడు డ్రయివర్.

"ఆ టాక్సీ వెనకనే పోనీ!"

ఇప్పుడు టాక్సీకి ఆటో దగ్గరైంది. ఆ టాక్సీలో వున్నది నిజంగా ఆమేనా, కాదా?

పెద్ద హోటల్ కాంపౌండులోకి టాక్సీ వెళ్ళింది. పోర్టికోలో ఆగింది. ఆమె దిగి హోటల్లోకి నడిచింది.

అతడు ఆటోలోంచి దిగాడు. వేగంగా లోపలకు వెళ్ళాడు. ఆమె మెట్లెక్కి పైకి వెళ్తోంది. కొంచెం దూరంలో ఆమెను అతను వెంబడించాడు.

వెనుకనుంచి ఆమెను గమనిస్తున్నాడు. సందేహం లేదు. ఆమే!

నడవమ్మట నడిచి ఒక గది తాళం తెర్చి ఆమె లోపలకు వెళ్ళి తలుపు మూసుకుంది. అతడు పెద్ద అంగల్లో అదే గదిముందుకు వెళ్ళాడు.

నడవాలో కాస్సేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు. తన్ని చూసి ఆమె ఏమనుకుంటుంది? తన్ని బంతిలా విసిరి కొట్టింది. ఇప్పుడతను మళ్ళా ఆమె ముందుకు వెళ్తే ఏమంటుందో!

అతడు ధైర్యంచేసి తలుపును తట్టాడు. ఆమె తలుపు

తెర్చి అతడివైపు ఆశ్చర్యంగా చూసింది. ఆమె మొహంలో నవ్వులేదు. కోపంలేదు.

"నువ్వింకా బతికే వున్నావా?" అడిగిందామె.

"చచ్చాననుకున్నావా?" అడిగాడతను.

అతడు గదిలోకి దూరాడు. తలుపును మూశాడు. ఆమె సోఫాలో కూర్చుంది. గ్లాసులోని స్కాచ్ విస్కీని తాగింది. టీపాయిమీద స్కాచ్ విస్కీ బాటిలుంది.

"తాగుతావా?" ప్రశ్నించిందామె.

"నాకా అలవాటు లేదు."

ఆమె పరిహాసంగా అతడివైపు చూసింది.

"నీది చీమ బతుకు. నెలకు మూడొందలు గడిస్తావు. అరాకొరిగా తిండి తింటావు. మాసిన గుడ్డలతో భార్య పక్కనే పడుకుంటావు. నీ దుర్వాసనకి హృదయంలోని ప్రేమ హరించి పోతుంది. డర్టీ బెగర్లీ లైఫ్!" అందామె.

అతడు మౌనంగా వుండిపోయాడు.

ఆమె మునపటిలా లేదు. ఖరీదైన దుస్తులు. ఒంటినిండా నగలు! ఇవన్నీ ఆమెకెలా వచ్చాయి? ఆమె ఏం చేస్తోంది?

గ్లాసులో ఆమె మళ్ళీ స్కాచ్ పోసుకుంది. సోడా కలిపి ఐస్‌క్యూబ్స్ వేసింది. కొంచెం తాగి అతడివైపు చూసింది.

"రియల్ లైఫ్ అంటే యిది! ప్రతిక్షణంలోనూ ఒక వింత అనుభవం! ఒక థ్రిల్! నువ్వు యిక్కడికెందు కొచ్చావు?"

"నిన్ను యింటికి తీసుకెళ్ళడానికి."

"ఆ యమ కూపంలోకి నేనీ జీవితంలో రాను. శాశ్వతంగా గుడ్‌బై చెప్పేశాను" అందామె.

"ఈ గది స్వర్గంలా కనిపిస్తే నీతో నేనూ ఇక్కడే వుంటాను" అన్నాడతను.

"నువ్విక్కడ రాణించవు. ఎలక్ట్రాన్నంలో బతకడం నీకు అలవాటైపోయింది. అక్కడి సుఖం నీకిక్కడ దొరకదు!" అందామె ఆక్షేపణగా.

"నువ్వు ఆనందంగా వుంటే నాకు చాలు. నువ్వు ఏం చేసినా నేను ఏమీ అనను. నీ యిష్టమొచ్చినట్లు నువ్వు బతకొచ్చు" అన్నాడతను.

"నాకు దూరంగా వుండడం నీకంత కష్టంగావుందా?"

"చాలా బాధకరంగా వుంది. నీకోసం వెతుకుతూ నేను జీవిస్తున్నాను. ఎప్పుడో ఎక్కడో నువ్వు కనబడావని నా విశ్వాసం. అలాగే యివాళ కనపడ్డావు."

"నిన్ను చూస్తే జాలివేస్తుంది. ఐ పిటీ యు!" అందామె.

"నామీద ఆమాత్రం జాలి నీలో మిగిలినందుకు సంతోషిస్తున్నాను."

"నా అడ్వెంచర్స్ గురించి వింటే నువ్వు నాతో వుండడానికి భయపడ్తావు!"

"నీ జీవితం గురించి చెప్పు. వింటాను ఆత్రంగా."

"పత్రికల్లో నువ్వు చదివే వుంటావు. లత, హేమలత!" అందామె.

అతడు తృళ్ళిపడ్డాడు. ఆమె వైపు గాభరాగా చూశాడు.

"అదంతా నువ్వే చేశావా? నేను నమ్మను. అంత ధైర్యం నీకెలా వచ్చింది?" అడిగాడతను.

"నీకు దూరంగా పోతే ప్రతి మనిషి ధైర్యవంతు

డవుతాడు. పిరికిపందలమధ్య జీవించడం మనిషికి మంచిది కాదు.''

"ఇంతవరకూ అయిందేదో అయింది. ఇటుపైన అటు వంటి జీవితం మానేయి. జైలు పాలవుతావు. తర్వాత విచారిస్తావు!''

ఆమె పకపక నవ్వింది.

"నన్నెవరూ పట్టుకోలేరు! నే నెవ్వరికీ దొరకను!''

"ఈనాడు నాకు కనిపించినట్లే మరెవరికో కన పడొచ్చు. వాళ్ళు నిన్ను పోలీసులకు పట్టిస్తారు.''

"అది నువ్వే చేయెచ్చుగా!'' అందామె.

"అది నేను చెయ్యను.''

"తర్వాత నీ ఆలోచనలు మారొచ్చు. నన్ను పట్టిస్తే ఐదువేలు బహుమతిగా యిస్తామని ప్రకటించారు. పత్రికల్లో చూశావా?''

"చూశాను. నా మాట విను. మనిద్దరం ఈ పట్నం వదిలి యే బొంబాయో పోదాం. అక్కడ సుఖంగా బతకొచ్చు.''

"అందులో సుఖంలేదు. నాకిదే నచ్చింది. యే క్షణంలో ఏమవుతుందో తెలియదు. రియల్ ఎడ్వెంచర్!'' అందామె.

అతడు ఆమెవైపు సూటిగా చూశాడు.

"రెండేళ్ళ తర్వాత నువ్వు కనబడ్డావు. నన్ను వచ్చి నీతో వుండమంటావా?''

"ఆలోచించి రేపు చెప్తాను. రేపు సరిగ్గా పదింటికి యిక్కడకు రా!''

అతడు సంశయిస్తూ వుండిపోయాడు.

"రేపు నేను వచ్చేసరికి నువ్వు ఇక్కడ వుంటావా?''

ఆమె కిలకిల నవ్వింది.

"వుంటానని నమ్మి వెళ్ళు! నేను లేకపోతే నాకోసం వెతుకు! నీ జీవితం చాలా థ్రిల్లింగ్‌గా వుంటుంది!" అందామె.

"రేపు వస్తాను" అని అతడు గదిలోంచి బయటకు నడిచాడు.

# 7

ఆ రాత్రి సుబ్బారావుకు నిద్రపట్టలేదు. జాగారం చేస్తూ తన గదిలో కూర్చున్నాడు.

గదిలో ఫ్లోరసెంట్ లైటు వెలుగుతోంది. కుర్చీలో కూర్చుని తన గతాన్ని అతడు జ్ఞప్తికి తెచ్చుకుంటు న్నాడు.

పెళ్ళినాటికి జయ వయస్సు ఇరవైఒకటి వుంటుంది. తనలా ఆమె కూడా బి.ఎ. పాసయ్యింది. తను ఒక పబ్లిషింగ్ కంపెనీలో మేనేజర్‌గా వుంటున్నాడు. పెళ్ళి అయ్యాక అతడు భార్యను మద్రాసు తీసుకొచ్చాడు. తనకొచ్చే మూడువందలమీద వాళ్ళు జీవించేవారు. డబ్బు విషయంలో అతడు చాలా జాగ్రత్తగా వుండేవాడు.

ఒకనాడు ఆఫీసునుంచి అతడు యింటికి తిరిగివచ్చాడు. ఆమె యింట్లో లేదు. తలగడకింద ఆమె ఉత్తరం దొరికింది.

"సుబ్బారావు,

నీతో గడిపిన సంవత్సరం ఎలా గడిచిందో అని నాకు ఆశ్చర్యంగా వుంది. ఈ చీమ బతుకుతో నాకు విసుగెత్తుతోంది. ఒక్క క్షణం కూడా యింక యిక్కడ వుండలేను. నన్ను మర్చిపో!

నాకు థ్రిల్, అడ్వెంచర్ కావాలి. తీగమీద నడిచినట్లు వుండాలి జీవితం. కింద పడ్తానేమో అనే భయం, నడవగలననే ధైర్యం నాకెంతో థ్రిల్ని యిస్తాయి. ప్రేమనే పాశానికి బలై నీ జీవితం పాడు చేసుకోకు!

గుడ్ లక్ అండ్ గుడ్ బై!

జయ."

ఆ ఉత్తరాన్ని అతడు ఎన్నిసార్లు చదివాడో లెక్క లేదు. వారం రోజులపాటు అతడామెకోసం పట్నమంతా పిచ్చిగా వెతికాడు. ఆమె ఎక్కడా కనపడలేదు.

కాకినాడకు టెలిగ్రామ్ పంపాడు. ఆమె అక్కడకు రాలేదని వాళ్ళు టెలిగ్రామ్ద్వారా తెలియజేశారు. తలిదండ్రులున్న కాకినాడకు జయ వెళ్ళలేదు. ఆమె ఎక్కడకు పోయింది? ఆమె ఎలా బతుకుతుంది?

జయ అందమైన యువతి. ఎవరో ఆమెను నమ్మించి మోసం చేయొచ్చు. ఇదంతా వూహించుకుని అతడు బాధ పడేవాడు.

ఒకరోజు కంపెనీ యజమాని అతడిని పిల్చి వార్నింగ్ యిచ్చాడు.

"సుబ్బారావు, నువ్వు మునపటిలా వుషారుగా పని చేయడం లేదు. నీ భార్య యిల్లు వదిలి యెక్కడకో పోయిందని చెప్పావు. ఆమెను గురించి ఆలోచించి నీ ఆరోగ్యాన్ని పాడుచేసుకుంటున్నావు. మా కంపెనీ పని వెనకబడ్తోంది. ఇలా యింకా కొంతకాలం సాగితే మరో మేనేజర్ని మేం పెట్టుకోవలసి వస్తుంది."

"సద్దు సార్, ఇటుపైన సవ్యంగా పనిచేస్తాను" అని అతడు హామీ యిచ్చాడు.

అటుపైన రాత్రి కొంతసేపు పనిచేసి కంపెనీ వర్క్ వెనకపడకుండా అతడు జాగ్రత్తపడ్డాడు. కాని అతడు జయను మర్చిపోలేకపోయాడు. ఆమెను గురించే కలలు కనేవాడు. తొందరపడిపోయినా ఆమె తర్వాత తిరిగి రావచ్చని ఆశించేవాడు.

గతంలోంచి అతడు మేలుకొని జయ ఫోటోవైపు చూశాడు. ఆమె చాలా మారిపోయింది.

సరిగ్గా పదింటికి అతడు ఆమె హోటల్ కు చేరుకున్నాడు. గది ముందుకు వెళ్ళి తలుపును తట్టాడు. కాని జవాబులేదు.

అతడు కిందకు పరుగెత్తాడు. రిసెప్షన్ గుమస్తా ముందుకు వెళ్ళాడు.

"రూమ్ నంబర్ యాభైలో వుండే ఆమే ఏమైంది?" ప్రశ్నించాడతను.

"నిన్న రాత్రి ఆమె గది ఖాళీచేసి వెళ్ళిపోయింది" అన్నాడతను.

సుబ్బారావు బయటకు నడిచాడు. తను అనుకున్నట్లే అయింది. జయను ఎవ్వరూ నమ్మలేరు. అతడి కళ్ళు నీళ్ళతో నిండాయి.

ధైర్యం తెచ్చుకుని అతడు తన ఆఫీసుకు చేరుకున్నాడు. టైపిస్టు రేఖ అతడివైపు నవ్వుతూ చూసింది.

"ఏమిటలా వున్నారు?" అడిగిందామె.

"ఏమీలేదు" అన్నాడతను.

"సుబ్బారావుగారూ, జీవితాన్ని బాగుచేసుకోడం పాడుచేసుకోడం మీ చేతుల్లో వుంది. అవకాశమిస్తే మిమ్మల్ని నేను ఎంతో క్షేమంతో చూడగలను" అందామె.

"ఆ అవకాశం దైవం యివ్వాలి నీకు! ఏమవుతుందో చూద్దాం" అన్నాడతను.

"మీకు ఆనందాన్ని యివ్వమని దేవుడిని ప్రార్థిస్తు న్నాను" అంది రేఖ.

# 8

నాలుగో అంతస్తులో వున్న ఫ్లాట్ ముందు గుమ్మం వైపు ఆమె నడిచింది. ఫ్లాట్ M—2

తలుపు మూసి వుంది. ఆమె బెల్ నొక్కింది. ఒకతను తలుపు తెర్చి ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

గుండు చేయించుకున్న తల. గళ్ళ లుంగీ ధరించా డతను. పొట్టిగా, సన్నగా వున్నాడు. అతడివైపు ఆమె చూసింది.

"శకుంతల వుందా?" అడిగిందామె.

"మీరెవరు?" అడిగాడతను.

"నా పేరు ప్రేమలత. శకుంతలా, నేనూ బి.ఎ.లో క్లాస్ మేట్స్ం."

"రండి లోపలకు" అన్నాడతను.

ఆమె లోపలకు వెళ్ళింది. సోఫాలో కూర్చుంది.

"మీ గురించి ఆమె నాకు చెప్పింది. మీ పేరు మేనకని ఆమె చెప్పినట్లు నాకు జ్ఞాపకముంది" అన్నా డతను.

ఆమె నవ్వింది.

"మేనక మా క్లాస్ మేట్. శకుంతల నా గురించి మీకు చెప్పలేదేమో!"

"శకుంతల పుట్టింటికి వెళ్ళింది. ఎల్లుండి సాయంత్రం వస్తుంది" అన్నాడతను.

"ఇల్లక్! ఆమెను చూసి చాలా కాలమైంది. యేదో

పనిమీద యిలా మద్రాసు వచ్చాను. ఆమెను చూడకుండా వెళ్ళడం నాకిష్టంలేదు" అందామె.

"ఆమెను చూసే వెళ్ళండి. ఆమె వచ్చినదాకా మీరు యిక్కడే వుండొచ్చు. మా ఫ్లాట్ పెద్దది— రెండు బెడ్ రూమ్స్ వున్నాయి. నేను వంటచేయడంలో భీముడిలాంటి వాడిని" అన్నాడతను.

నవ్వుతూ ఆమె అతడివైపు చూసింది. గుండెలమీద, చేతులమీద బొచ్చు బాగా వుంది.

"నేను పెళ్ళికాని పిల్లను. ఒంటరిగా యిక్కడ వుండలేను. ఎల్లుండి వస్తాను" అందామె.

"ఇది పట్నం. ఈ ఫ్లాట్‌లో యెవరున్నారో పక్కవాళ్ళు పట్టించుకోరు. ఎవరి గొడవ వాళ్ళదే! మీరు యిక్కడే వుండొచ్చు."

"మీరు అంతగా చెప్పాక ఉండక తప్పదు" అందామె.

అతడు హుషారుగా ముందు తలుపు మూశాడు.

"మీకు కాఫీ తెస్తాను" అని వంటింట్లోకి వెళ్ళాడు. కాస్సేపట్లో హాట్ కాఫీ తెచ్చి ఆమెకిచ్చాడు.

ఆమె థాంక్స్ చెప్పి కాఫీ తాగింది.

"బెస్టు కాఫీ! అఖండంగా వుంది" అందామె.

"నేను తయారుచేసే డిన్నర్ యింకా బాగుంటుంది" అన్నాడతను.

"మీలాంటి భర్త నా ఫ్రెండ్ శకుంతలకు దొరికినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను" అందామె.

"మా యింట్లో రెండు పూటలూ నేనే వంటచేస్తాను. హాయిగా పత్రికలు చదువుకుంటూ శకుంతల కూర్చుంటుంది" అన్నాడతను.

"శకుంతల వెరీ లక్కీ!" అందామె.

ఆమె గదినలువైపులా చూసింది. ఒక టేబుల్ మీద మెక్ డొవెల్స్ విస్కీ బాటిల్, గ్లాసు వున్నాయి.

బాటిల్ వైపు ఆమె చూడ్డం అతడు గమనించాడు.

"మా తండ్రిగారు ఆర్మీలో పనిచేసేవారు. బీరుమీద మమ్మల్ని పెంచారు అందువలన ప్రతిరోజూ నేను డ్రింక్ చేస్తూ వుంటాను." అన్నాడతను.

"దానికేముంది. నేను కూడా అలాగే బీర్ మీద పెరిగాను. నా తండ్రి ఏర్ ఫోర్స్‌లో వున్నారు. మా యింట్లోని ఆడవాళ్ళందరూ విస్కీ, జిన్, బ్రాందీ సేవిస్తూనే వుంటారు" అందామె.

అతడు వుషారుగా ఆమెవంక చూశాడు.

"మీరు విస్కీ తీసుకుంటారా?"

"తీసుకుంటాను" అందామె.

"మీరు మీ సూట్ కేసు ఆ గదిలో పెట్టుకోండి. వెళ్ళి స్నానం చేసిరండి" అన్నాడతను.

ఆమె గదిలోకి వెళ్ళింది. తలుపు మూసుకుంది. అర గంట తర్వాత మేక్సీ ధరించి ఆమె హాల్లోకొచ్చింది.

అతడు వంటింట్లో బిజీగా వున్నాడు. కొంత సేపయ్యాక అతడు హాల్లోకొచ్చాడు. ఆమెవంక నవ్వుతూ చూశాడు.

"యూ ఆర్ లవ్ లీ!" అన్నాడతను.

రెండు గ్లాసుల్లో అతడు విస్కీ పోసి, సోడా కలిపి, ఐస్ క్యూబ్స్ వేసి ఒక గ్లాసును ఆమెకిచ్చాడు.

"చియర్స్!" అన్నాడతను.

"చియర్స్!" అందామె.

"కాస్సేపట్లో గ్లాసులు ఖాళీ అయ్యాయి.

అతడు గ్లాసుల్లో మళ్ళా విస్కీ పోశాడు. సోఫా

లోంచి లేచి ఆమె అతడిపక్కకు వెళ్ళింది. ఇద్దరూ గ్లాసులను అందుకున్నారు.

"మీ పేరు చెప్పలేదు!" అందామె.

"వేణుగోపాల్" అన్నాడతను.

ఇద్దరూ విస్కీ తాగేశారు. అతడు వంటింట్లోకి వెళ్ళాడు. కాస్సేపట్లో తిరిగి వచ్చాడు.

గ్లాసుల్లో విస్కీపోసి ఆమె రెడీగా వుంచింది.

"కనీసం యీ పని నేను చేస్తాను" అందామె.

"వంట పూర్తయింది" అన్నాడతను.

హాల్లో లైట్లు వెలుగుతున్నాయి. ఆమె నిషాతో సోఫాలో కూర్చుంది. అతడు మెల్లిగా వెళ్ళి ఆమె పక్కనే కూర్చున్నాడు.

ఆమెవైపు చూశాడతను.

"ఇంత అందంగా వున్న మీకు యింతవరకూ పెళ్ళవకుండా ఎలా వుంది?"

"నా హేబిట్స్! నేను చాలా ముందుకు పోయిన యువతిని. తాగుతాను. సిగరెట్ కాలుస్తాను. అదంతా మెచ్చుకునే వ్యక్తి కావాలి" అందామె.

అతడు ఆమెకు సిగరెట్ ఇచ్చాడు. ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు.

"నా పెళ్ళిముందు మీరు నాకు కనిపించివుంటే!" అని ఆగాడతను.

"ఏంచేసేవారు?" అడిగిందామె.

"మిమ్మల్ని పెళ్ళాడేవాడిని!" అన్నాడతను.

ఆమె మౌనంగా వుండిపోయింది.

"బెటర్ లేట్ దెన్ నెవ్వరు అన్నారు పెద్దలు. ఐ లవ్ యూ!" అన్నాడతను.

"నేను తప్పక మిమ్మల్ని పెళ్ళాడేదాన్ని. కాని శకుంతల నా ఫ్రెండ్. ఆమెకు ద్రోహం చెయ్యలేను" అందామె.

గ్లాసులోని విస్కీ అయిపోయింది.

"మరో రౌండ్ వేద్దామా?" అడిగాడతను.

"లాస్టు రౌండ్!" అందామె.

అతడు విస్కీ పోసి ఆమెకిచ్చాడు. అతడు బాగా నిషాలో వున్నాడు. ఇద్దరూ తాగుతూ, సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ కూర్చున్నారు.

పదింటికి యిద్దరూ భోజనం చేశారు.

"మీ వంట అఖండంగా వుంది" అందామె.

"తనివితీరా తినండి" అన్నాడతను.

భోజనాలు అయ్యాక ఆపిల్ పళ్ళు కోసి ప్లేటులో పెట్టి అతడామెకిచ్చాడు.

"హెల్తుకు మంచిది, తినండి" అన్నాడతను.

ఇద్దరూ ఆపిల్ ముక్కలు తింటూ కూర్చున్నారు.

ఆవులిస్తూ ఆమె సోఫాలోంచి లేచింది.

"పడగ్గది తలుపు మూసుకోకుండా పడుకుంటాను" అందామె.

"పడుకోండి. భయంలేదు" అన్నాడతను.

ఆమె అతడికి "గుడ్ నైట్" చెప్పి గదిలోకి వెళ్ళిపోయింది. పరుపుమీద పడుకుంది. ఫ్లాట్ లోని లైట్లన్నీ ఆరిపోయాయి.

ఆమె పక్కకు దొర్లింది. యెవరి శరీరమో ఆమెకు తగిలింది.

"ఎవరు?" అందామె.

"నేనే, గోపాల్ ని" అన్నాడతను.

"ఇది శకుంతల చూస్తే నన్ను మన్నించదు!"

ఆమె పుట్టింట్లో వుంది. ఆమె చూడలేదు."

ఆమెమీద అతడు చెయ్యి వేశాడు. ఆమెను దగ్గరకు లాక్కొని పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"ప్లీస్, నన్ను బలాత్కారించకండి!" అందామె.

"అలా యెన్నడూ జరగదు. మీ అంగీకరంతోనే అంతా జరుగుతుంది.

అతడి ఛాతీ మీదున్న బొచ్చును. ఆమె నిమిరింది.

"నా కింతవరకూ ఏ పురుషుడితోటీ సంపర్కంలేదు. రేపు రాత్రివరకూ నాకు టైము యివ్వండి. నేనేదో నిశ్చయించుకుంటాను. మీలాంటివాడికి దూరంగా వుండడం కష్టమే" అందామె.

"మీ యిష్టం. అయితే నేను వెళ్ళి పడుకుంటాను. ఈ రాత్రే మీరు నిశ్చయించుకోగల్గితే నా గదికి వచ్చేయండి. తలుపులు తెర్చివుంటాయి" అన్నాడతను.

అతడు తన గదికి వెళ్ళిపోయాడు. ఆమె కాస్సేపట్లో నిద్రపోయింది. రాత్రి రెండింటికి ఆమె లేచింది. అతడి గదిలోకి వెళ్ళింది. అతడు గాఢనిద్రలో వున్నాడు.

గదిలో వున్న బీరువావైపు ఆమె నడిచింది. ఇరవై నిమిషాలు తర్వాత ఆమె తన గదికి చేరుకుంది. వెంటనే నిద్రపోయింది.

పక్క గదిలో పడుకున్న వేణుగోపాల్ గుర్రు సముద్రపు హోరులా ఫ్లాట్‌లో ధ్వనిస్తోంది.

# 9

పోస్టులో వచ్చిన కవరును యిన్‌స్పెక్టర్ రాకేష్‌శర్మ చింపి లోపలున్న ఫోటోవైపు చూశాడు. ఎవరు ఆమె?

కవరులో వున్న ఉత్తరం కిందపడింది. అతడు ఆత్రంగా వుత్తరం చదివాడు.

"ఇన్‌స్పెక్టర్,

ఈ పట్నంలో లత, హేమలత, ప్రేమలత అనే పేర్లతో ఒక స్త్రీ ఎన్నో దొంగతనాలు చేసింది. ఆమె ఫోటో యిది. ఒకప్పుడు ఆమెతో నాకు సంబంధం వుండేది. ఆమె నన్ను వదిలి వెళ్ళిపోయింది. ఆ తర్వాత ఈ నేరాలు చేయడం మొదలెట్టింది. ఈ పట్నంలోని ప్రజలు క్షేమంగా వుండాలనే ఉద్దేశంతో ఆమె ఫోటో మీకు పంపుతున్నాను.

ఆకాశరామన్న."

వుషారుగా రాకేష్ బెల్ నొక్కాడు. ఒక కానిస్టేబుల్ లోపలకు వచ్చాడు.

"జీప్ రెడీగా వుంచు, వెళ్ళాలి" అన్నాడతను.

ఇన్‌స్పెక్టర్ రాకేష్ జీప్ రాధిక యింటిముందు ఆగింది.

రాధిక ఫోటోవైపు చూసింది.

"ఈమే యిక్కడకు వచ్చింది" అందామె.

కాస్సేపట్లో పోలీసు జీప్ రామరాజు కాంపౌండులో ఆగింది. పోలీసులను చూసి కామిని వులిక్కి పడింది. ఫోటోవైపు ఆమె పరీక్షగా చూసింది.

"ఇక్కడకు వచ్చినది యీమే!" అంది పనిమనిషి కామిని.

వేణుగోపాల్ ఫోటోను చూసి ఆమెను పోల్చాడు.

పోలీస్ జీప్ శరవేగంగా వెళ్ళిపోయింది.

ప్రతి పోలీసుస్టేషన్‌కు ఆమె ఫోటో పంపబడింది. అన్ని పత్రికల్లోనూ ఆమె ఫోటో ముద్రించబడింది.

"త్వరలో ఆమె మనకు దొరుకుతుంది" అన్నాడు రాకేష్‌శర్మ విలేఖర్లతో మాట్లాడుతూ.

* * *

సుబ్బారావు ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"రేఖా, నిన్ను పెళ్ళాడ్డానికి నిశ్చయించుకున్నాను" అన్నాడతను.

"చాలా సంతోషం" అందామె.

"నా భార్యనుంచి విడాకులు తీసుకున్నాక నిన్ను పెళ్ళాడ్తాను. అంతవరకూ నువ్వు వేచివుండగలవా?" అడిగాడతను.

"మీకోసం ఎంతకాలమేనా వేచివుండగలను" అంది రేఖ.

అతడామె చెయ్యి పట్టుకున్నాడు. మెల్లిగా నిమిరాడు. ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"రేఖా, పందులముందు ముత్యాలు పడేసినట్లు అనర్హురాలైన స్త్రీని ప్రేమించడం వ్యర్థమని నీనుంచి నేను నేర్చుకున్నాను. నీకు చాలా థాంక్స్" అన్నాడతను.

"మీనుంచి నేను నేర్చుకోవలసింది యెంతోవుంది" అంది రేఖ.

"నేర్పడం, నేర్చుకోడం రెండూ చేయొచ్చు మనం యిటుపైన" అన్నాడతను.

* * *

రాజేశ్వరరావు దినపత్రికలోని ఫోటో చూసి ఉలిక్కిపడ్డాడు.

తన భార్యను పిల్చాడు. రజని పరుగెత్తుకొచ్చింది.

"ఈ ఫోటోను చూడు" అన్నాడతను.

"మనింట్లో వుంటున్న ఆమెదే!" అందామె.

అతడు కుర్చీలోంచి లేచాడు. మెట్లెక్కి పైకి వెళ్ళాడు. హాల్లో కూర్చుని ఆమె స్కాచ్ విస్కీ సేవిస్తోంది. అతడామెవైపు చూశాడు.

"మేడమీది ఫ్లాట్ మీకు సౌకర్యంగా వుందా?" అడిగాడతను.

"చక్కగా వుంది" అందామె.

అతడివైపు ఆమె చూసింది.

"కొంచెం విస్కీ తాగుతారా?" అడిగిందామె.

"నా భార్య తిడుతుంది" అన్నాడతను.

"డోంట్ బాదర్! ఆమె ఏమీ అనకుండా నేను చూస్తాను" అందామె.

"ఇప్పుడే వస్తాను, వుండండి." అని అతడు బయటకు నడిచాడు.

మెట్లపైనున్న తలుపు మూసి బయట తాళంవేశాడు. ఆమె మేడమీద యిరుక్కుపోయింది. యెక్కడకూ పోలేదు!

అతడు కిందకు దిగాడు. ఇన్‌స్పెక్టర్ రాకేష్‌శర్మకు ఫోన్ చేశాడు.

"హలో, రాకేష్" అందో కంఠం అటువైపునుంచి.

"ఇన్‌స్పెక్టర్ సాయంత్రం దినపత్రికలో వచ్చిన లత ఫోటోను చూశాను. ఆమె మా యింట్లో మేడమీద వుంటోంది. మేడమెట్లు పైనున్న తలుపుకు తాళంవేశాను. ఆమె ఎక్కడకూ పారిపోలేదు. మీరు వెంటనే రండి" అన్నాడతను.

"మీ అడ్రెస్ చెప్పండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.
రాజేశ్వరరావు అడ్రెసు చెప్పాడు.
"వస్తున్నాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

* * *

ఆమె నిషాలో వుంది. బాల్కనీలో నిలబడి కిందకు చూస్తోంది. పోలీసు జీపు వచ్చి యింటి ముందు ఆగింది.

ఆమె వేగంగా లోపలకు పరిగెత్తింది.

ఇన్‌స్పెక్టర్ రాకేష్‌శర్మతో రాజేశ్వరరావు కరచాలనం చేశాడు.

"పదండి పైకి వెళ్దాం" అన్నాడతను.

ఇన్‌స్పెక్టర్, రాజేశ్వరరావు, ఇద్దరు కానిస్టేబుళ్ళు మెట్లెక్కి పైకి వెళ్ళారు. రాజేశ్వరరావు తాళం తెరిచాడు. అందరూ వేగంగా హాల్లోకి వెళ్ళారు. అక్కడ యెవ్వరూ లేరు. పక్కనున్న పడగ్గదిలోకి వాళ్ళు వెళ్ళారు.

పరుపుమీద ఆమె పడుకుని వుంది. ఇన్‌స్పెక్టర్ మంచం దగ్గరగా వెళ్ళాడు.

"బాగా తాగి ఆమె నిద్రపోయి వుంటుంది" అన్నాడు రాజేశ్వరరావు.

ఇన్‌స్పెక్టర్ రాకేష్‌శర్మ ఆమెవైపు సూటిగా చూశాడు. అనుమానంతో అతడామె నుట్టుకు చూశాడు. నాడి కొట్టుకోడంలేదు.

"ఆమె మరణించింది" అరిచాడు రాకేష్.

"ఇంపాసిబుల్" అన్నాడు రాజేశ్వరరావు.

పై నుంచి పోలీస్ జీప్‌ను ఆమె చూసి వుంటుంది. పోలీసులకు చిక్కకూడదనే వుద్దేశంతో

ఆమె ఏదో మింగి మరణించి వుండాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అందరూ మౌనంగా నిలబడి పరుపుమీద పడుకున్న ఆమెవైపు చూశారు.

"అందమైన రూపం! తన జీవితాన్ని ఆమె చేతులారా నాశనం చేసుకుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఫ్లాటంతా కానిస్టేబుళ్ళు వెతకడం మొదలెట్టారు. ఇన్‌స్పెక్టర్ రాకేష్ పోలీసు డాక్టర్ కోసం ఫోన్ చేశాడు.

డాక్టర్ సుధాకర్ శవాన్ని పరీక్షించాడు.

"కేస్ ఆఫ్ సూయిసైడ్, ఆత్మహత్య" అన్నాడు డాక్టర్ సుధాకర్.

"ఆమె ఏం మింగింది?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"శవపరీక్ష అయ్యాక అది తెలుస్తుంది" అన్నాడు డాక్టర్ సుధాకర్.

* * *

దినపత్రికను చూసి సుబ్బారావు రేఖవైపు తిరిగాడు.

"రేఖా, ఆమె ఆత్మహత్య చేసుకుని మరణించింది. మనం వెంటనే పెళ్ళి చేసుకోవచ్చు" అన్నాడతను.

"మీరు వచ్చి మా తల్లిదండ్రులతో మాట్లాడండి" అందామె.

"ఇవాళ సాయంత్రం యిద్దరం వెళ్దాం" అన్నాడు సుబ్బారావు.

—: సమాప్తం :—

# పోస్టు బాక్స్

బి. రాజేశ్వరి

ఓ రాత్రి సమయంలో హఠాత్తుగా మెలకువ వచ్చి చూసింది అమల. పక్కలో అంతదాకా పడుకుని నిద్రపోతుండిన భర్త కనిపించలేదు. టేబిల్ మీద అలారం టైంపీసు రెండుగంటల పదినిమిషాలు చూపిస్తోంది. లేచి పెద్ద లైటువేసి వరండాలోకి వచ్చింది.

వరండాలోకి చేర్చివున్న పెరట్లో పూలతొట్టెల పక్కన వున్న సిమెంటు చప్టామీద కూచుని సిగరెట్ కాలుస్తూ యేవో దీర్ఘాలోచనలో వున్నాడు వేణు. అమల అతని పక్కకొచ్చి నిలబడింది. కాని, అతనదేమీ గమనించకుండా ఎటో శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తూనే వున్నాడు.

"ఏమిటి, యీ సమయంలో పెరట్లో యేం చేస్తున్నారు....?" అన్నది అమల భర్తవైపు పరిశీలనగా చూస్తూ.

వేణు ఉలిక్కిపడి చూశాడా మెకంక.

"ఏంలేదు, ఏం తోచక ...." నని గేశాడు.

"ఏం తోచకపోతే, అర్ధరాత్రి యీ చలిగాలిలో కూచోవటమెందుకు?....మీ ఆరోగ్యం అసలే మంచిది కాదు, లోపలికి పదండి. సిగరెట్లు మానేస్తానని చెప్పి నాకు తెలీకుండా పెట్టెలకు పెట్టెలు కాల్చేస్తున్నారన్న మాట!"

"అబ్బెబ్బె. పెట్టెలు కూడానా, యిదే."

"బుకాయించకండి. కింద ఎనిమిది పీకలున్నాయి. మీ చేతిలో తొమ్మిదో సిగరెట్ వుంది. అంటే చాలా సేపట్నుంచీ మీ రిక్కడే కూచుని ఆలోచనల్తో మీ మనసుని, సిగరెట్టు పొగతో మీ శరీరాన్ని కాల్చుకుం టున్నారని నా కర్ధమయింది."

"ఓహ్, నేను దొంగ దాయాలన్నా దాచలేను. నువ్వు లోపలికి పద, పదినిమిషాల్లో వచ్చేస్తాను."

"ఉహూ, అదేం కుదరదు. పదండి, ముందు."

భార్య ముఖంలోకి ఓసారి చూసి, లేచి ఆమె వెంట లోనికి నడిచాడు వేణు. అమల లోనికి అడుగులు వేస్తూ భర్త మనసునంత తీవ్రంగా కలచివేసిన సమస్య ఏదై వుంటుందా అని ఆలోచిస్తోంది.

ఇది మొదటిసారి కాదు. తను వారం రోజుల్లో మూడుసార్లు భర్త యిలా ఒంటరిగా, నిద్రపోని రాత్రిళ్లు గడపటం గమనించింది.

ఇప్పుడు కూడా వచ్చి పక్కమీద పడుకున్నాడేగాని వేణు పరుపుమీద అసౌకర్యంగా కదుల్తూనే వున్నాడు. అమల అంతా గమనిస్తూనే వుంది. అతని మనసు నేదో పట్టి పీడిస్తోంది. అదేమిటో తెల్సుకోవటం భార్యగా తన ధర్మం! అతని మనోవ్యధను తను ఉపశమింపచేయగలిగితే,

అతనికి మనశ్శాంతి కలగజేస్తే....

అమల పక్కకి తిరిగి భర్తను ప్రశ్నించాలనుకుంది. కాని అప్పుడే నిద్ర పట్టినట్టుంది. ఉచ్ఛ్వాసనిశ్వాసలు బరువుగా జరగటం గమనించి, అతన్ని భంగపర్చటం ఇష్టంలేక, తన ప్రయత్నం విరమించుకుంది.

తెల్లవారుఝామున ఎప్పుడో నిద్ర పట్టిందామెకు.

## 2

మరునాడు కూడా వేణు అన్యమనస్కంగానే వున్నట్టు గమనించింది అమల. పిల్లలిద్దర్నీ తయారుచేసి స్కూల్‌కి పంపించేసింది. వేణుకి అన్నంపెట్టి రమ్మని పిలిచినా అతను అలాగే కుర్చీలో కూచుని పేపరు చదువుతుండటం ఆశ్చర్యమనిపించి, కుర్చీ వెనకనుంచి పేపర్లోకి చూసింది.

వేణు పేపరు తిరగేసి పట్టుకున్నాడు. అంటే చదవటం లేదన్నమాట! ఏదో దీర్ఘాలోచనలో పడి కొట్టుకుపోతున్నాడు. అతనంత దీర్ఘంగా పరధ్యానంగా ఆలోచించే విషయమేమిటి? ఎందుకతను రెండు మూడు రోజులుగా యిలా ఉదాసీనంగా, ఏదో పోగొట్టుకున్నట్టు ఉంటున్నాడు?

అడిగెయ్యాలనుకుని, రెండోసారి తన ప్రయత్నం విరమించుకుంది అమల.

"అన్నం వడ్డించాను, రండి!" అన్నది.

అతను ఉలిక్కిపడ్డట్టు చూశాడామెవంక. "ఆఁ? ఆఁ, వస్తున్నా, పద!...." అంటూ హడావిడిగా లేచాడు.

ఆఫీసుకి వెళ్ళేముందు, "ఈ రోజు కాస్త ఆలస్యంగా

యింటికొస్తాను. ఆఫీసులో అక్కౌంట్స్ వెరిఫై చేసు కోవాలి!"

అమల వెంటనే యేం మాట్లాడలేదు. సాధారణంగా అయిదు దాటిం తర్వాత ఆఫీసులో ఒక్క క్షణం కూడా వుండడు వేణు. అలాంటిది యీ రోజు ఆఫీసులో పని వుందంటుంటే ఆమెకు నమ్మ బుద్ధి కాలేదు.

మౌనంగా తలూపింది.

స్కూటర్ మీద వేణు ఆఫీసుకి వెళ్ళిపోయాడు. అయిదు నిమిషాలవరకు అతను వెళ్ళినవైపే చూస్తూ గుమ్మందగ్గరే నిల్చుండిపోయింది.

తర్వాత గుడ్డలుతకటానికి బట్టలు బాత్ రూంలో పడేస్తూంటే చేతికి గరగరమని తగిలింది భర్త జేబులో. ప్యాంటు వెనకజేబు నుంచి ఓ కాగితాన్ని బయటికి తీసింది.

అందులో అందమయిన చేతివ్రాతతో నాలుగే పంక్తులున్నాయి. అమ్మాయి దస్తూరీ అని చూడగానే తెలిసిపోతోంది.

"డియర్ వేణూ, నువ్వెందుకు తాత్సారం చేస్తున్నావో తెలీదు. నన్ను పెళ్ళి చేసుకోవటానికి నీకున్న అభ్యంతర మేమిటో అంతకన్న తెలీదు. వెంటనే డేట్ నిర్ణయించు. నేను ఆలస్యాన్ని, నీ ఉదాసీనతను భరించలేకపోతున్నాను. వెంటనే నీ నుంచి సమాధానం కావాలి. ఎదురుచూస్తుంటాను.

నీ

ప్రతిమ."

ఉత్తరం చదివి అలాగే స్థాణువులా నిల్చుండి పోయింది అమల. ఆ ఉత్తరం సాక్షాత్తు తన భర్తకే రాసింది. ఎవరీ ప్రతిమా? ఈమెకు తన భర్తతో ఏమిటి సంబంధం? ఈయన్ని పెళ్ళిచేసుకోవట మేమిటి? ఇతనికి పెళ్ళయిన నిజం ఆమెకు తెలీదా? తెలిసే సిద్ధపడుతోందా? ఈయన నిజాన్ని కప్పిపుచ్చి తనకి పెళ్ళికాలేదని అబద్ధం చెప్పి ఓ అమాయకురాలితో ఆటలాడుతున్నారా?

అయితే ఈమధ్య ఆయన పరధ్యానానికి యిదన్నమాట కారణం!? తనేం తక్కువ చేసిందని యీయన మనసు అన్యాక్రాంతమైపోవలసి వచ్చింది? ఇద్దరు బిడ్డల తండ్రి అయినాక యిప్పుడు కన్నెపిల్లమీదికి మనసు పోయిందా? తనని, పిల్లల్ని ఏంచేద్దామని ఆయన ఉద్దేశ్యం?

గుడ్డలు ఉతికే ప్రసక్తి మానేసి కుర్చీలో కూలబడింది అమల. ఆమె మెదడు మొద్దుబారిపోయింది. ఏ పని చెయ్యటానికి మనస్కరించలేదు.

చెవుల్లో సముద్రపు హోరు. తల సమ్మెటతో మోదినట్టు విపరీతమైన బాధ. తట్టుకోలేని టెన్షన్. మెదడు నరాలు తెగిపోతాయేమో నన్నంత వేదన! ఆమె శరీరం దాన్ని తట్టుకోలేక చిగురాకుల్లా వణికిపోతోంది.

వేణు యింత మోసగాడా? తనకి యిద్దరు పిల్లలకి అన్యాయం చెయ్యాలనుకుంటున్నాడా? ఈ బుద్ధి అతనిలో ఎప్పుడు పుట్టింది? తనంటే ప్రాణంపెట్టే భర్త తనపట్ల యింత అమానుషంగా ప్రవర్తించగలిగాడా? అతనింత చంచలుడా?

ఆమె మనసు సమాధానపడలేక పోతోంది. వేణు గురించి తనకి బాగా తెలుసు. ద్రోహం చెయ్యాలన్న ఆలోచన అతనిలో యెంత వెతికినా కనిపించదు. అతని ప్రేమ

సర్వస్వం తనకే అంకితమని తానిన్నాళ్ళు గర్వపడు తుండేది.

కాని, యిప్పుడు....తన అదృష్టచక్రం తిరగబడింది. తను గుడ్డిగా నమ్మిన తనభర్త తనకు ద్రోహం చెయ్యబోతు న్నాడు. బహుశా యేదో క నెపం చూపించి తనని వద లించుకుంటాడు. తన బిడ్డల్ని కూడా తనతో పంపేస్తా డేమో! తనెలా బతకాలి? వేణులేని జీవితం ఊహించు కోటానికే భయంగా వుంది. మనసును ఎవరో యినుప పిడికిలితో పిండినట్టు విలవిల లాడిపోతోంది. ఆ పరిస్థితి ఎదురుకాకముందే ప్రాణత్యాగం చేసుకోవాలని అనిపి స్తోంది.

భగవాన్, ఎంత విషమపరిస్థితి తెచ్చిపెట్టావు? నేనేం చెయ్యాలి?

అమల మనసు తెగిన గాలిపటంలా ఎక్కడెక్కడో ఏదేదో ఆలోచిస్తోంది. కళ్ళనుంచి కన్నీరు ధారపాతంగా కారిపోతుంటే, ఆవేదన భరించలేక మంచంమీద పడి పోయి, దిండులో తలదూర్చి భోరున ఏడవసాగింది.

## 3

సాయంత్రం పిల్లలు స్కూల్‌నించి వచ్చేవరకు అమల అలా ఏడుస్తూనే వుంది. తెరలు తెరలుగా దుఃఖం తన్ను కొస్తుంటే, ఆపుకోవటం ఆమెకు శక్యం కాలేదు.

పిల్లలు చూస్తే, వాళ్ళు వేసే సవాలక్ష ప్రశ్నలకు సమాధానం చెప్పటం కష్టమని, లేచి ముఖం చల్లటి నీటితో కడుక్కునివచ్చి కూచుంది. కాస్త నేదతీరినట్టని పించిందిగాని, మానసికంగా బాగా కుంగిపోయింది అమల. ఒక్కసారిగా పదిరోజుల్లో జ్వరంపడి లంఖణాలు చేసిన దానిలా నీరసపడిపోయింది.

మనసులో ములుకులా ఆ ఉత్తరంలోని వాక్యాలే తలెత్తి భయపెడుతున్నాయి. తన సర్వస్వాన్ని తననించి తీసేసుకోవటానికెవరో కుట్ర పన్నినట్టు, తన జీవితానికి చరమాంకం ఆరంభమయినట్టు పదే పదే ఆమెకి అనిపిస్తోంది.

సాయంత్రం వేణు వచ్చింతర్వాత ఏమయినాసరే ఆ విషయం అడిగెయ్యాలి. అతను తనకేదో చెప్పాలని యీ నాలుగురోజులుగా మథనపడుతున్నాడు. అతనికి అంత శ్రమివ్వకుండానే తనకి విషయం తెలిసిపోయింది. పరిష్కారం తనే సూచిస్తుంది.

అతని మనసు అన్యాక్రాంతం కాకూడదు. కాని అయింది! ఇంకా అతన్నే పట్టుకు వేళ్ళాడాలనుకోవటం తన అవివేకం! ఏదో అభాండం తన నెత్తిన వేసి తనను వదిలించుకోవటానికి అతనేదో పన్నుగడ పన్నేలోపల తనే మర్యాదగా అతని జీవితంనుంచి బయటపడటం మేలు!

కాని.... కాని.... యిన్నాళ్ళ వైవాహిక జీవితంలో అతనితో అనుభవించిన కష్టసుఖాలు, తమ అనురాగ ఫలితంగా కలిగిన యిద్దరు బిడ్డలు, వాళ్ళ భవిష్యత్తు— యివన్నీ తెంచుకుని తను పోగలదా? ఊహుఁ! అది తన తరంకాదు. అతనికి దూరంగా తను ఒకరోజైనా గడపలేదు. తనకి అతను కావాలి! అతనులేని జీవితం వ్యర్థం! తను భర్తృతిరస్కృతగా ఒక్కరోజు కూడా బతకలేదు. అతని పాదాలముందే తన జీవితం గడిపేస్తే తనకు గౌరవం, తన జీవితానికి అదే అర్థం, పరమార్థమూను.

పిల్లల అవసరాలు చూసి వాళ్ళు నిద్రపడ్డాక వాలు కుర్చీలో కూచుని మళ్ళీ ఆలోచనల్లో పడింది. రాత్రి

ఆలస్యంగా వస్తానని చెప్పివెళ్ళాడు వేణు. ఎనిమిదిన్నర దాటినా యింకా యిల్లు చేరలేదు.

అతను ఆఫీసులో పని వుండటంవల్ల ఆలస్యం చెయ్య లేదని, చాలా ముఖ్యమయిన కారణమే వుండివుంటుందని గ్రహించింది. ప్రతిమని కల్సుకోవటానికి వెళ్ళా డేమో....! అసలా ప్రతిమ యెవరో మాచాయగానైనా తన కరంకాలేదు. అతని ఆఫీసులో పనిచేసే కొలీగా? అతని చిన్ననాటి స్నేహితురాలా? అనుకోకుండా పరి చయమైన ఆగంతకురాలా? ఎవరు?

అమల తలవిదిలించింది. తల చాలా భారంగా వుంది. గోడ గడియారం పదిగంటలు కొట్టింది. వేణు యింకా తిరిగిరాలేదు. అంతదాకా ఏ స్కూటర్ శబ్దం వినిపించినా అత నేనని తలుపు తెరిచి చూస్తూ, కాదని తెలిసి నిరా శతో మూసి లోనికి వస్తున్నది.

తలుపు తెరిచి వీధిలోకి వచ్చింది. వీధంతా నిర్మా నుష్యంగా వుంది. అప్పుడో స్కూటర్, అప్పుడో మోపెడ్, చిన్న కార్లు వస్తూ పోతూ వున్నాయి. భర్త జాడ కనుచూపు మేరలో ఎక్కడా కనిపించలేదు.

అమలకు నీరసం వచ్చేసింది. ఇంత ఆలస్యంగా ఇంటికి రావటం చాలా అరుదుగా చేస్తాడు వేణు. సాధారణంగా రాత్రి ఏడుగంటలు దాటకుండా యింట్లో వుంటాడు. తనిదివరలో ఓసారి గొడవచేసింది—"వెళ్ళేది స్కూటర్ మీద, రోజూ యెక్కడ విన్నా రోడ్డు ప్రమాదాల గురించిన వార్తలే! మీరు ఆఫీసు కాగానే మరో గంటలో యింటి దగ్గర వుండకపోతే నా మనసు కీడు శంకిస్తుంది. ఆ టెన్షన్ భరించలేక ఏమైపోతానో, నాకే తెలీదు, దయచేసి వెంటనే యింటికొచ్చేయండి" అంది.

అప్పట్నుంచి సాయంత్రం అయిదున్నర ఆరుగంటల మధ్య ఖచ్చితంగా యింట్లో వుంటున్నాడు వేణు. మళ్ళీ యిన్నాళ్ళ తర్వాత యీ రోజే అతను ఆలస్యంచేశాడు. వెళ్ళేముందు, తన గురించి తెలిసే, ఆలస్యంగా వస్తానని చెప్పి మరీ వెళ్లాడు. కాని ఆ ఆలస్యం యిన్ని గంటలని తనకి తెలీదు. పోనీ అతను మామూలు పరిస్థితుల్లో వెళ్ళి వుంటే అది వేరే విషయం! ఇప్పుడతను తనకు దేన్నో పోటీ తీసుకొచ్చే ప్రయత్నంలో వుండి ఆలస్యం చేశాడు.

తనని వదిలించుకోవటానికి ఆ ప్రతిమతో కలిసి యే హోటల్లోనో, మరెక్కడో ప్లాన్ చేస్తున్నాదేమో....! ఆమెతోబాటు ఆమె తరఫువాళ్ళు కూడా యెవరైనా తోడుండి వుండొచ్చు. వాళ్ళు వేణుని జాగ్రత్తగా ఉచ్చులోకి లాగి వుండొచ్చు—ప్రతిమని ఎరవేసి.

వేణు మనసు చంచలమైందికాదు. అతనికి తన మీదున్న ప్రేమానురాగాలు తక్కువ కూడా కాదు. మరి, యీ ప్రలోభంలో ఎలా చిక్కుకున్నాడో అర్థం కాదు! తనకింత అన్యాయం చేయటానికెలా తలపెట్టాడో అసలే అర్థంకాకుండా వుంది! మనసా వాచా తను అతన్నే నమ్ముకున్నది.

తలుపులు మూసి లోనికొచ్చి పక్కమీద అశాంతిగా వాలింది. దేనిమీదా దృష్టి నిలవటంలేదు. ఆకలి దహించి వేస్తోంది. దానికన్న వేణు చేసిన పనికి గుండెలు మండి పోతున్నాయి. శరీరం, మనసు కూడా కుతకుతలాడిపో తున్నాయి. ఈ బాధ తను భరించలేదు. ఈ నరకం తనకి వద్దు. పగవాడికూడా యిలాంటి పరిస్థితి ఎదురు కాకూడదు. తను పడ్తున్న యాతన సామాన్యమైనదికాదు.

యే క్షణంలోనైనా పగిలే అగ్నిపర్వతంలా వుంది తన గుండె.

ఆమె కళ్ళు మళ్ళీ వర్షించటం మొదలెట్టాయి. వేణుతో గడిపిన మధుర క్షణాలు, అతనితో పెనవేసుకుపోయిన తన జీవన లతకు పట్టిన దుర్గతి ఒకేసారి ఆమె మనసును ఆవహించుకుని ఆమె మెదడుమీద విపరీతమైన ఒత్తిడి తీసుకువస్తున్నాయి. తను పిచ్చిదై పోతుందేమోనన్నంత ఒత్తిడి!

పదకొండు, పన్నెండు....గడియారం రెండు గంటలు కొట్టేవరకు అమల మెలకువగా, పక్కమీద అసహనంగా దొర్లుతూనే వున్నది. కాని అతను రాలేదు. భయంకరమైన ఒంటరితనం ఆమెను వేధిస్తోంది. పిల్లలు గాఢనిద్రలో వున్నారు. నిష్కల్మషంగా, అమాయకంగా వున్న వాళ్ళ ముఖాలు చూస్తూంటే అప్రయత్నంగానే ఆమె కళ్ళు మళ్ళీ సజలాలయ్యాయి.

అటు భర్త వైపుగాని, యిటు తనవైపుగాని బంధువులులేని తను ఎంత ఒంటరిదో గుర్తొచ్చి మనసు కకావికలమైపోయింది. తన తల్లి దండ్రి ఒకేసారి చనిపోయారు ఏక్సిడెంట్లో. అప్పటికి తనకి పెళ్ళయి సంవత్సరం కూడా కాలేదు.

తన తోడబుట్టిన వాళ్ళెవరూ లేరు. తనొక్కతే సంతానం కావటంవల్ల అల్లారు ముద్దుగా పెంచి, వేణుకి పాతిక వేలు కట్నంగా యిచ్చి చేశాడు తన తండ్రి! అప్పటికి వేణు తండ్రి మాత్రం బతికి వున్నాడు. సంవత్సరం క్రితం ఆయనా పోయాడు. తనకిలాగానే వేణుకి తోడబుట్టిన వాళ్ళు లేరు!

బంధువులమని చెప్పుకునేవాళ్ళు చాలామంది వున్నా,

వేణు వాళ్ళెవరినీ దగ్గరికి చేరనివ్వడు. వీళ్ళందరికీ మన ఆస్తిపాస్తులమీదేగాని, మనమీద అభిమానం, ప్రేమ ఏమీ లేవు. వచ్చి తినిపోతారు. చేతికి అందినవి పట్టుకు పోతారు. అందుచేత వీళ్ళని మనకు అమడదూరంలో వుంచాలి—అనేవాడు వేణు.

అనటమేకాదు వాళ్ళని దూరంగా పెట్టాడు. భార్యాభర్తల మధ్య గొడవలు రావటానికి కూడా యిలాంటి బంధువులే కారకులని చెప్తుండేవాడు. అలాంటి కొరివి లాంటి బంధువుల్ని నెత్తికెక్కించుకుంటే యిక చెప్పేదేంలేదు, తలలు బోడులై పోతాయి—అంటూ నవ్వేవాడు!

తనకీ యిలా ఒంటరిగా, భర్తతోను పిల్లలతోను సింపుల్‌గా బతకటం అలవాటైపోయింది. యెంతో సంతృప్తిగా వుంది కూడా. ఇప్పుడు యెవరైనా బంధువు వస్తే ఒక్క రోజుకూడా భరించే ఓపికగాని, ఆసక్తిగాని తమకు లేవు!

ఆలోచనల మధ్య ఎప్పుడు నిద్రపట్టిందో, యెప్పుడు తెల్లారిందో అమలకు తెలియదు.

తలుపు చప్పుడుకు చటుక్కున మెలకువ వచ్చింది. లేచి, హడావిడిగా చీర సర్దుకుని తలుపు తెరిచింది.

వేణు కాదు, పనిమనిషి!

తన పిచ్చిగాని, వేణు రాత్రి యెక్కడో హాయిగా ఆమెతో గడుపుతుండి వుంటాడు. తను మాత్రం కలత నిద్రతో నిద్రలేమితో రాత్రంతా అశాంతిగా అదురుబెదురుగా గడిపింది.

గిన్నెలు తోమటానికి వేసుకుంటున్న పనిమనిషికి

నిండుగా వున్న అన్నం గిన్నె, కూరలు కన్నులపండువుగా కనిపించాయి.

## 4

పిల్లల్ని స్కూల్‌కి పంపేసింది అమల. పనులన్నీ అన్యమనస్కంగానే పూర్తిచేసింది. ఆ వీధి చివర వేణు ఆఫీసులో పనిచేసే క్లార్కు ఒకాయన వున్నాడు. వెళ్ళి అతన్నుంచి వేణు సంగతి ఎంక్వయిరీ చేయాలనుకుంది.

ఉదయం తొమ్మిదిగంటలయింది. తలుపుకు తాళంపెట్టి వీధి చివరున్న ఆ యింటికి వెళ్ళింది. అతన్ని అడగటంవల్ల భర్త పరపతికేమైనా లోపం వస్తుందా అని ఓ క్షణం ఆలోచించింది. కాని అంతలోనే అతని క్షేమంకోసే మనసు దాన్ని పెద్ద అభ్యంతరంగా తీసుకోకుండా కొట్టేసింది.

ఆమె వెళ్ళేసరికి అతను ఆఫీసుకు వెళ్ళేప్రయత్నంలో వున్నాడు. ఆఫీసరు కేడర్లో వున్న వేణు భార్య స్వయంగా తమ యింటికి రావటం చాలా ఆనందం కలుగ జేసింది గుమస్తా వెంకట్రావుకి.

"వేణు సార్ నిన్న సాయంత్రమే ఆఫీసు వదిలేశా రండి. రాత్రి రాకపోవటం వింతగా వుంది ..." అన్నాడు వెంకట్రావు తన ఆశ్చర్యాన్ని ప్రకటితం కాకుండా.

అమల తన వూహే నిజమైందని గ్రహించింది.

"ఆఫీసునించి ఎక్కడికి వెళ్ళారో చెప్పగలరా?"

"తెలీదండి. సాధారణంగా ఆయనకు బయటి వ్యాపకాలేం వుండవు. సరాసరి యింటికి వెళ్ళిపోతుం టారు. ఇల్లు, ఆఫీసు తప్ప యితర వ్యాపకాలులేని మంచి ఆఫీసరుగా మా ఆఫీసులో ఆయన్ని అందరు గౌర

విస్తుంటారు" అన్నాడు వెంకట్రావు భార్యకు వినపడ కుండా. అర్ధరాత్రి ఊరంతా తిరిగొచ్చే తనని భార్య ప్రతిరోజూ తూర్పారబెట్టేస్తుయ్యటం అతని మనసులో మెదిలింది.

ప్రతిమ అనే అమ్మాయి ఎవరైనా వాళ్ళ ఆఫీసుల్లో పనిచేస్తుందేమో అడగాలనుకుంది. కాని, ఎంతో మంచి చరిత్ర వున్న తన భర్త పరువుమీద ఆ ప్రశ్న తీవ్రమైన దెబ్బ తీస్తుందనిపించింది అమలకు. అందుకే ఆ ప్రశ్న అడగటం విరమించుకుంది.

వెంకట్రావుకి థాంక్స్ చెప్పి వచ్చేసింది. ఈ ఎంక్వయిరీవల్ల వెంకట్రావులో కొత్త అనుమానాలు తనే రేకెత్తించినట్టయింది. వేణుమీద ఆఫీస్‌లో చాలా మంచి అభిప్రాయముంది. ఇప్పుడు ఊహాగానాలు మొదలవుతాయేమో....

ఇంటికొచ్చి పడింది. మనసంతా ముక్కలు చింపిన విస్తరిలా వుంది. ఓ పక్క ఆకలి బాధ. రాత్రి తినలేదు. ఉదయం టిఫిన్ చెయ్యలేదు. ఓ కప్పు కాఫీ మాత్రం అలవాటుగా తీసుకుంది, అంతే!

పదకొండు గంటలవుతుండగా ఆమెకో ఆలోచన వచ్చింది. లేచి, తలుపులు తాళంపెట్టి దగ్గర్లో వున్న పోస్టాఫీసుకు వెళ్ళి ఏభై పైసల నాణెం వేసి భర్త ఆఫీసుకి ఫోన్ చేసింది. ఆఫీసు అటెండర్ కాబోలు ఫోన్ అందుకున్నాడు.

"చూడు బాబూ, ప్రతిమ వచ్చిందా?" అన్నది.

"పేరేమిటమ్మగారూ?" అన్నాడు.

"మా స్నేహితురాలు. మీ ఆఫీసులోనే పనిచేస్తున్నట్టు చెప్పింది."

"ఆ పేరుగల అమ్మ యీడలేదమ్మా! ఇంకో దఫ్తర్ల పజ్జేసన్నదో, ఏఁవో?"

"నీకు బాగా తెలుసా?"

"బలేవోరమ్మగారూ! ఈ దఫ్తర్ల నేను పాతికేళ్ళుగా పజేసుండాను. నాకు యాదులేదంటుండ్రా?"

"వేణుగారు అక్కడేనా పనిచేస్తున్నారు?"

"వేను సారు అయితే యీడే పజ్జేసుండారు ఆయన మా సారే!"

"వచ్చారా?"

"ఇంకా రాలేదమ్మా."

"మీ అయ్యగారికి ఆడవాళ్ళు యెక్కువగా ఫోన్ చేస్తూంటారేమిటి?"

"ఈ మద్దెన ఒకటి రెండుమార్లు నేనే ఫోనెత్తిన. అమ్మాయిలెవరో పలికింద్రు. అవునమ్మ, యాదొచ్చింది. మీరిందాకా అన్నారే పెతిమా యెవరో....ఆయమ్మ ఫోన్ చేసినాది, రెండు మూడుసార్లు ఓసారి సార్ కోసం వొచ్చినాదిగూడా."

"ఆఁ, ఆఁ! ఆ అమ్మాయి సంగతే నేనడిగినది!"

"అలా జెప్పండి. ఈ ఆఫీసుల పనిజేస్తన్నాదంటే, నాకు తెల్వని మడిసెవరా అనుకుంటాను."

"ప్రతిమ, వేణుసార్ గారికోసం మెందుకు వచ్చేది?"

"ఏమోనమ్మా, ఆడు సేయితులేమో!"

"అంతేనా, మీ సార్‌తో ఆమెకు...."

"ఏమిటమ్మా, నువ్వెవరో తెల్వదుగాని, మా సార్ గురించి నీకు తెల్వదులా వుంది. ఆయన అనోంటోడుగాదు. నిప్పు.... తెల్సా?"

అమల ముఖంలో ఒక్క క్షణం గర్వంతో కూడిన

చిరునవ్వు మెదిలింది. "అయితే నిన్న సాయంత్రం మీ సార్ కోసం ప్రతిమ వచ్చిందన్నమాట!" అన్నది.

"వొచ్చిందని నేననలేదే! మీతో ఎవరన్నారు?"

"నాతో ప్రతిమ చెప్పింది. నిన్న సాయంత్రం నన్ను అక్కడికి రమ్మంది. వచ్చాను. అప్పటికే మీ ఆఫీసులో అందరు వెళ్ళిపోయారు. బహుశా మీ సార్‌తో వెళ్ళి పోయి వుంటుందని అడిగాను. అందుకే యిప్పుడు ఫోన్ చేశాను ఆమెకోసం. సరే, మళ్ళీ సాయంత్రం ఫోన్ చేస్తానుగాని, ప్రతిమ వస్తే మీ స్నేహితురాలు నీకోసం ఫోన్ చేసిందని చెప్పు!" అని ఫోన్ పెట్టేసింది.

అతను మరీ అంత తెలివైనవాడు కాదని అతని మాటలనిబట్టే గ్రహించింది అమల. అందుకే సందర్భాను సారం అతనికి అనుమానం రానివిధంగా తనకు కావలసిన సమాచారం రాబట్టుకుంది.

ప్రతిమ ఆఫీసుకికూడా వచ్చి వెళ్ళేదంటే, ఆమెకు వేణుతో బాగా సన్నిహితత్వం కలిగివుంటుంది. అయితే వేణు చాలా రిజర్వుడుగా వుండే మనిషి కావటంవల్ల అతన్ని ఆఫీసులో ఎవరూ అనుమానించలేదింతవరకు. ఆ రెండరు కూడా అనుమానపడనివిధంగా వ్యవహారం నడుస్తోందన్నమాట!

అయితే తను అనుమానించినట్టు నిన్న సాయంత్రం వేణుకోసం ప్రతిమ రాలేదు. మామూలుగానే ఆఫీసు అవర్సు అయేవరకు వుండి వేణు ఆఫీసునుంచి బయల్దేరి వెళ్ళిపోయాడు. బహుశా ఫోన్‌లో పిలిపించుకుని వుం టుంది. వాళ్ళిద్దరు కల్సుకునే సంకేత స్థలం ఏదో వుండి వుంటుంది. అక్కడికి వెళ్ళి వుంటాడు. రాత్రంతా అక్కడే గడిపివుంటాడు. ఉదయం సరాసరి ఆఫీసుకు

రావాలనుకుని కూడా రాలేకపోయి వుంటాడు.

అతనికోసం తానింత తాపత్రయ పడిపోయి, అతని క్షేమంకోసం తహతహపడనక్కర్లేదు. అతను తన సుఖం తను చూసుకుంటూ, భార్యా పిల్లల్ని కూడా పట్టించుకోకుండా భోగలాలసుడై కొట్టుకుపోతుంటే తను అతనేమైపోయాడోనని గంగ వెర్రులెత్తిపోవటం అనవసరం!

ఈ ఆలోచన రాగానే సరాసరి యింటికి తిరిగొచ్చేసింది అమల. అతని గురించి తను తిండి తినకుండా మాడినందుకు తనమీద తనకే కోపంవచ్చి, శుభ్రంగా వడ్డించుకుని తిన్నది. తిండి తిన్నాక ఎక్కడలేని నీరసం ఆవహించి పక్కమీదపడి సాయంత్రంవరకు ఒళ్లెరగకుండా నిద్రపోయింది.

## 5

సాయంత్రం అకస్మాత్తుగా మెలకువ వచ్చి లేచింది అమల.

గోడగడియారంవంక చూసింది. అయిదు గంటలు దాటి రెండు నిమిషాలయింది. అయిదు కొడ్తుండగా మెలకువ వచ్చింది — గడియారం గంటలకేనన్నమాట!

అంటే అయిదు దాటిపోయింది, కాని, స్కూలుకి వెళ్ళిన పిల్లలిద్దరు తిరిగి రాలేదు. నాలుగున్నర లోపునే వాళ్ళు రిక్షాలో తిరిగొస్తారు. కాని ఇంతదాకా రాకపోవటమేమిటి?''

ఆమె పక్కమీదినించి ఒక్క ఉదుటున లేచి బయటికొచ్చింది. రోడ్‌మీద రిక్షాలు కనిపిస్తాయేమోనని! పిల్లల్ని తీసుకొస్తున్న కాన్వెంటు రిక్షాలు హడావిడిగా రోడ్డున పోతున్నాయి. బహుశా యీరోజు యెందుకో స్కూలు ఆలస్యంగా వదిలిపెట్టి వుంటారు. తను అనవసరంగా

హడావిడి పడిపోయింది.

లోపలికొచ్చి పిల్లలకోసం గబగబ పాలు కాచి హార్లిక్స్ కలిపింది. వాళ్ళొచ్చేసరికి పొగలు కక్కే హార్లిక్స్ తయారుగా వుండాలి. లేకుంటే వంటగదిలోకి జొరబడి నానా హడావిడి చేస్తారు.

బయట రిక్షా ఆగిన శబ్దం వినిపించింది. పిల్లలు వచ్చేశారు, అనుకుంటూ బయటికి తొంగిచూసింది. రిక్షా కాన్వెంటు పిల్లల్ని తీసుకొచ్చే వీరాస్వామిదే. కాని, పిల్లలు లేరందులో.

వీరాస్వామి దిగులుగా నించుని, "అమ్మగారూ!" అని పిలిచాడు. ఒక్క అంగలో బయటకొచ్చింది.

"పిల్లలుగాని యింటికొచ్చారా, అమ్మా?" అన్నాడు వీరాస్వామి.

"లేదే! అదేమిటి, స్కూల్లో లేరా?"

"లేరమ్మగోరూ! సానాసేపు సూసిన. తవ బిడ్డలిద్దరు అపల్లేదు. ఒకేల ఏదన్నా పనిబడి ముందుగా తీస్కొచ్చేశారేమోనని వొచ్చేసిన. ఇక్కడకొత్తే తవరిలాగంటున్నారు!?"

అమల పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. పిల్లల్ని ఎత్తుకుపోయే మనుషుల గురించిన కథలు గుర్తొచ్చి ఒళ్ళంతా చల్లబడిపోయింది.

భగవాన్ తన పిల్లలకు యెలాంటి అపద యెదురు కాకూడదు. వాళ్ళు క్షేమంగా వుండాలి! నువ్వే రక్ష తండ్రీ—అంటూ లోలోపలే వెయ్యి దేముళ్ళకు మొక్కుకున్నది అమల.

"చూడు వీరాస్వామీ, మళ్ళీ యింకోసారి వెళ్ళి పరీక్షగా చూడు. ఏ పక్కనయినా ఆడుకుంటూ వుండి

పోయారేమో. నిన్ను చూడకపోయుండవచ్చు. వెంటనే వెళ్ళు ...”

ఆమె నోటిలో మాట నోట్లో వుండగానే “అట్లాగే నమ్మ....” అంటూ వీరాస్వామి రిక్షామీద రయ్యిన వెళ్ళిపోయాడు.

అమల నిస్సహాయంగా, నించున్న చోటనే కూలబడి వీధిలోకే దృష్టిని నిలిపి చూస్తోంది.

# 6

రీసెస్ టైం. పిల్లలు గోలగా స్కూలు బయటకొచ్చి స్వేచ్ఛగా గాలి పీల్చుకుంటున్నారు. అంతదాకా చండశాసనుల్లాంటి టీచర్ల పరిధిలో నుంచి బయటపడి కాసేపయినా స్వేచ్ఛలోని ఆనందం అనుభవించడానికి ఉరకలు వేస్తున్నారు.

రవి, వాసు బయట నించుని రోడ్డుపక్కన అమ్మే తినుబండారాల వంక చూస్తున్నారు. అమ్మ పొరపాటున కూడా అలాంటివాటిని తినకూడదని చెప్పింది. కలరా టైఫాయిడ్ లాంటి తీవ్రమైన వ్యాధులు వస్తాయని, అలాంటివి తినకూడదని చెప్పిందిగాని, వాటిని చూస్తూంటే అలా అనిపించటంలేదు. తినాలనే కోరికను బలవంతంగా అణచుకుంటూ అలాగే నించున్నారు.

ఇంతలో యెవరో ఓ పెద్దాయన బయట వున్న పిల్లల్ని అడుగుతున్నారు—“వేణుగోపాల్ గారి పిల్లలెవరు మీలో?”—అని.

“వాళ్ళ పేర్లేమిటో చెపితే తెలుస్తుందిగాని ఫాదర్ పేరు చెపితే యెలా?” అని ప్రశ్నిస్తున్నాడో వాకుడు గాయి వచ్చాడు.

“తొందర్లో అడిగిరావటం మర్చిపోయాను బాబూ!

వాళ్ళ నాన్నగారి పేరు మాత్రమే తెల్సు. ఆయన స్కూటర్ ఏక్సిడెంట్లో హాస్పిటల్లో వున్నారు. వాళ్ళమ్మ గారు వెంటనే వాళ్ళిద్దర్నీ తీసుకురమ్మన్నారు...." అంటున్నాడతను.

క్షణాలమీద అక్కడున్న పిల్లల్లో సంచలనం వచ్చింది.

రవి, వాసుల చెవుల వేణు అన్న మాట పడగానే ఆ మనిషి దగ్గరకు గబగబ వచ్చారు. నిన్న సాయంత్రంనుంచీ నాన్నగారింటికి రాలేదని మమ్మీ చెపుతోంది. ఇప్పు డేమయ్యింది నాన్నగారికి?

"వేణుగారు మా డాడీయే, ఏమయింది? మీరెవరు?" అనడిగాడు రవి, పెద్దవాడు. వాసు రెండో తరగతి రవి మూడో తరగతి చదువుతున్నారు.

"మీరేనా బాబూ? మీ నాన్నగారి స్కూటర్ని లారీ కొట్టింది. హాస్పిటల్లో వున్నారు. మీ యిద్దర్నీ వెంటనే తీసుకురమ్మన్నారు బాబూ!...." అన్నా డతను.

రవి, వాసు వెంటనే "పద, పద!" అన్నారు.

అతను వాళ్ళిద్దర్నీ ఆటోలో యెక్కించుకుని వెళ్ళుం డగా, టీచర్సు స్కూల్ బయటికొచ్చి "వాట్ హాపెండ్ ఛిల్డ్రన్?" అనడిగారు.

ఓ పెద్ద కుర్రాడు జరిగిన సంగతి చెప్పాడు.

"అరె, అలాగా. ఎవరి మా కెందుకు తెలియచెయ్య లేదు? ఆ మనిషి మా పర్మిషన్ తీసుకోకుండా పిల్లల్నెలా తీసుకువెళ్ళాడు?" అన్నది ఓ టీచరు ఇంగ్లీషులో.

"ఐ డోంట్ నో టీచర్!" అన్నాడా కుర్రాడు. మరికొందరు కుర్రాళ్ళు కూడా మెల్లిగా తప్పుకున్నారు

టీచర్ యేమన్నా అంటుందనే భయంతో.

పక్కనున్న టీచర్, "ఆ తొందర్లో, ఆ వచ్చిన వ్యక్తి మనకు చెప్పకుండానే తీసుకుపోయివుంటాడు. అలాంటి సమయాల్లో స్కూలు రూల్సు, రెగ్యులేషన్స్ వాళ్ళకేం తెలుస్తాయి?" అన్నది సర్దిచెప్తున్నట్టుగా.

7

వీరాస్వామి మళ్ళీ వచ్చి జరిగిన సంగతంతా చెప్పే సరికి నిలువునా నీరయిపోయింది అమల. తను భయపడినంతా అయింది. ఎవడో తన పిల్లల్ని మాయ మాటలు చెప్పి దొంగిలించుకుపోయాడు. టీచర్సుకి తెలవకుండా, వాళ్ళు రీసెస్‌లో బయటికొచ్చి ఆడుతున్న సమయంలో తీసుకుపోయాడు.

వాడికి వేణు పేరు తెలుసు. కావాలనే తమ పిల్లల్ని తీసుకుపోయాడు. బహుశా తమ పిల్లల్ని వాడు గతంలో చూడకపోయివుండొచ్చు. అందుకే వేణు పిల్లలెవరని ఎంక్వయిరీ చేశాడు. వాడు కావాలనే తమ పిల్లల్ని అడిగి మరీ తీసుకుపోయాడు. అంటే వాడు తమకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పరిచయమున్నవాడే!

ఎవరు వాడు? యెందుకు తన పిల్లల్ని యెత్తుకుపోయాడు? సమయానికి వేణు లేకపోవటం, ఈ సంఘటన జరగటం అమలకు పిచ్చెత్తిపోయింది. నోట మాట రాకుండా చాలాసేపు అలాగే వుండిపోయింది.

"పోలీసు రిపోర్టు యివ్వండమ్మా, రండి నా రిక్షాలో యెల్దాం—" అన్నాడు వీరాస్వామి కర్తవ్యం గుర్తుచేస్తూ.

అప్పటికి విషయం తెలిసిన యిరుగు పొరుగు ఆడవాళ్లు

చేరారక్కడ. తలోకరు తలో మాట అంటున్నారు. గతంలో పిల్లల్ని యెత్తుకుపోయిన సంఘటనలు—వాళ్ళ కాళ్ళు చేతులు విరిచేసి ముష్టివాళ్ళుగా మార్చిన సందర్భాలు, ఏదో నిధినిక్షేపాల కాశించి దేవతకు బలిచ్చిన సంఘటనలు—చెప్పుకుంటున్నారు గోలగా.

కర్తవ్యం గుర్తుచేసింది వీరాస్వామి ఒక్కడే. అప్పటికే నలుగురు వేణు గురించిన ప్రసక్తి తెస్తున్నారు. అతను లేని విషయం వాళ్ళముందు చెప్పవలసిన అవసరం రాకూడదని అమల చటుక్కున రిక్షా ఎక్కేసింది.

పోలీసు సబిన్స్పెక్టరు కేసు రిపోర్టు తయారుచేసి, యిన్ఫర్మెంటుగా ఆమె సంతకం తీసుకుని "మా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాం" అన్నాడు.

ఆమెకు పోలీసుస్టేషనంటే ఎలర్జీ. పోలీసులు నేరస్తుల పట్లకన్న, నిర్దోషులపట్ల చాలా కఠినంగా, అమానుషంగా ప్రవర్తిస్తారన్న నిజాలను విని, చదివి, పోలీసులంటేను, పోలీస్ స్టేషనంటేను అసహ్యాన్ని పెంచుకుంది.

ఇప్పుడు అదే స్టేషన్లో రిపోర్టివ్వటం బాధాకరంగానే వున్నా తప్పనిసరిగా తెలియచేసి బయటపడింది—ఒక్క క్షణం అక్కడ నిలబడలేనట్లుగా.

ఆ రాత్రి వెంకట్రావు విషయం తెలిసివచ్చి ఓదార్చాడు అమలను. వేణు ఆఫీసుకు రాని విషయం, సెలవు కూడా పెట్టని విషయం చెప్పాక, అమలకు పరిస్థితి మరీ అగమ్యగోచరంగా అనిపించి, ఆ రాత్రి నిద్రపట్టలేదు.

# 8

తెల్లవారేవరకు సంతతధారగా ఏడుస్తూనే వున్నది అమల. భర్త, పిల్లలు ఒకేసారి పగబట్టినట్టు తననించి మాయమైపోయారు. ఇంకా తన గుండె ఆగిపోకుండా,

బదులు రాకుండా ఎలా వుంటా అని ఆశ్చర్యంగా వుందామెకు. తన కష్టం చెప్పుకోవటానికి తనవాళ్ళంటూ ఎవరూ లేరు. తన గుండెకోత, కడుపుకోత ఎవరికి చెప్పుకుంటుంది?

ఆమె మనసు ఎందుకో కీడు శంకిస్తోంది. భర్త భోగలాలసుడై యింటికి కూడా రాకుండా ఎక్కడో ప్రియురాలి కౌగిట్లో బందీ అయిపోతే తన పిల్లలు ఏ క్రూర రాక్షసుడి చేతిలోనో బందీలుగా చిక్కిపోయారు. పిల్లల అల్లరితో, రణగొణ ధ్వనులతో కళకళలాడిన ఇల్లు బోసిపోయి, భయంకరమైన నిశ్శబ్దంతో తన మనసును తూట్లు పొడుస్తోంది.

"అమ్మా, పోస్టు" అన్న కేకతో చటుక్కున, బాత్ రూంకి వెళ్ళబోయినదల్లా బయటకొచ్చింది.

పోస్టుమాన్ "రూపాయి డ్యూ పడిందమ్మా!" అంటూ నలిగిపోయిన ఓ కవరు ఆమె చేతికందించాడు. దానిమీద అసలు పోస్టేజి అతికించనేలేదు.

కవరుమీది దస్తూరివైపు ఆమె కళ్ళు పరుగెత్తాయి.

పరిచయమైన దస్తూరి. ఆ తర్వాత తట్టింది, అది భర్త చేతిరాతేనని.

వెంటనే రూపాయి చెల్లించి పోస్టుమాన్ను పంపేసి, కవరును ఒణికే చేతుల్తో విప్పింది.

హడావిడిగా నాలుగే వాక్యాలు రాశాడు వేణు, అంతా చిందరవందరగా బాగా నలిగిపోయిన కాగితం మీద రాశాడు. కవరు కూడా బాగా నలిగిపోయి వుంది. బ్రౌన్ కలరు, ఆఫీసు కవరు.

"అమలా, యీపాటికి నా గురించి బాగా కంగారు పడుతూ వుంటావు. నేనో విషవలయంలో చిక్కుకు

పోయాను. ప్రస్తుతం ఓ దుష్టశక్తి చేతిలో బందీగా వున్నాను. ఎక్కడ బంధించబడ్డానో వివరాలు తెలియదు. మన పిల్లల్ని జాగ్రత్తగా యింట్లోనించి బయటకు రానివ్వకుండా చూసుకో. వాళ్ళని యెత్తుకుపోయే ప్రయత్నం జరగొచ్చు. నేనెలాగో తప్పించుకొస్తాను. వివరాలు రాయటానికి టైంలేదు....” అంతే, సంతకం కూడా పెట్టకుండా హడావిడిగా పోస్టు చేసేసినట్టుంది. అందుకే స్టాంపులు అతికించలేదు.

ఆ ఉత్తరం చదివి అనుల కళ్ళవెంట కన్నీరు బొట బొటా కారిపోయింది. భర్తని తను చాలా ఘోరంగా అపార్థం చేసుకుంది. ఎవరో ఆయన్ని అపహరించుకుని పోయారు. ఆయన చేసిన హెచ్చరిక తనకు యీ రోజు అందింది. ఈలోపలే పిల్లల్ని యెత్తుకుపోవటం జరిగి పోయింది.

చటుక్కున కవరుమీది పోస్టు ముద్ర చూసింది. స్టాంపు లేకపోవటంవల్ల 'డ్యూ' ముద్రవేసి, పక్కన పోస్టాఫీసు ముద్రవేశారు. నిన్న సాయంత్రం మూడు గంటలకు ఆ ఉత్తరం భరత్ నగర్లో పోస్టయింది. కూకట్ పల్లి సమీపంలో.

ఆమె కళ్ళు మెరిశాయి. ఆయనను బహుశా కూకట్ పల్లి సమీపంలోనే యెక్కడో బంధించి వుండాలి. అక్కడ కొత్తగా కాలనీలు లేస్తున్నాయి. కొంత మేర కొండలు, బండలు రాళ్ళు రప్పలు వున్నా, అదంతా చదును చేసి యిళ్ళు కట్టేస్తున్నారు. అక్కడే ఎక్కడో భర్తని బంధించి వుండాలి! పిల్లల్ని ఎత్తుకుపోయిన వాళ్ళకు, వేణును బంధించిన వాళ్ళకు సంబంధముందని తెలుస్తోంది. పిల్లల్ని ఎత్తుకుపోతారని ఆయనకు ముందే

తెలుసు! కాని సమయం మించిపోయింది.

అయినా, ఫరవాలేదు. తన భర్తను, పిల్లల్ని రక్షించుకోవటానికి తను ప్రాణాలైనా త్యాగం చేస్తూంది అవసరమైతే!

అప్పటికప్పుడే ఓ నిర్ణయాని కొచ్చేసింది అమల. చకచక తయారయింది. తలుపుకు తాళంపెట్టి రోడ్ మీది కొచ్చింది.

# 9

"ఇదిగో ఫ్రెండ్, నీ కొడుకుల్ని కూడా తీసుకొచ్చాను నీకు తోడుంటారని!" రవిని, వాసుని చెరో రెక్కా పట్టుకుని లాక్కొచ్చాడు. అతను.

వేణు చివ్వున తలెత్తి, "ఛీ, చివరికి యీ పసివాళ్ళను కూడా నీ పాచికలుగా ఉపయోగించుకోవాలను కుంటున్నావా? నిన్ను భగవంతుడు కూడా క్షమించడు!" అన్నాడు కోపంగా.

వాసు, రవి తండ్రిని చూడగానే "డాడీ!" అంటూ పరుగెత్తుకుని రాబోయారు.

అతను వాళ్ళిద్దర్నీ రెక్కలుపట్టి ఆపేసి, "ఆగండ్రా నాయనలూ! అంత తొందరగా మీ నాన్నతో చేరిపోనిస్తానా? మిమ్మల్ని కత్తితో కండలుగా కోసి, మీ నాన్నముందే సమాధి చేసెయ్యనూ? ఆగండాగండి!" అన్నాడు నవ్వుతూ.

"నువ్వు మనిషివా, రాక్షసుడివా? నీ పాడు పనికి వీళ్ళను కూడా ఉపయోగించుకోవాలనుకోవటం రాక్షసత్వం."

"మరేం ఫరవాలేదు, నువ్వు మా దారికొస్తే ఎవరి ప్రాణాలకు ప్రమాదం రాకుండా మేం చూసుకుంటాం.

నువ్వు మా మాట వినటం లేదు కదా!"

"ఛ, దేశద్రోహానికి తలపడే తొత్తును కాదు నేను!"

"అందరూ మొదట్లో అలాంటి కబుర్లు చెప్పినవాళ్ళే! తర్వాత డబ్బుకి లొంగిపోయి, గతంలో నీ స్థానంలో వున్న ఆఫీసర్లు మాకు బాగా సాయంచేశారు. డబ్బుకి కూడా లొంగనివాళ్ళు ఇదిగో మా రీటా అందచందాలకు దాసోహమన్నారు. కమాన్ మిస్ రీటా, అయ్ మీన్ మిస్ ప్రతిమా!" అన్నాడతను అక్కడే వున్న ఓ సుందరి వైపు కన్నుగీటి.

వయ్యారంగా నడుచుకుంటూ వచ్చింది ప్రతిమ, అలియాస్ రీటా.

"ఛీ, దీన్ని నాకు ఎరగావేసి నా చేతకాని పనులు చేయించాలని పన్నాగం పన్నావు. యేదో బలహీన క్షణంలో నేను లొంగిపోతే, అదంతా ఫిల్ముతీసి, నన్ను బ్లాక్ మెయిల్ చేయాలనుకుంటున్నావు. నేను, నా భార్యకు చేసిన ద్రోహానికి యిప్పటికే కుమిలి కుమిలి ఛస్తున్నాను. ఆ మహాసాధ్వి మొహం చూడలేక తప్పించుకు తిరగాను యిన్నాళ్ళు. నేను లొంగి రాకపోవటంతో నన్ను బలవంతాన ఎత్తుకొచ్చి బంధించావు. నేను కాదన్నానని కక్ష సాధింపుకి నా పిల్లల్ని కూడా మాయమాటలు చెప్పి ఎత్తుకొచ్చావు. నేను లొంగివస్తాననేగా నీ ఉద్దేశం? నెవర్ .... నెవర్ ...." ఆవేశంతో అరిచాడు వేణు.

"నీ పిల్లల్ని నీ ముందే ఖండఖండాలుగా కోసినా దారికి రాకపోవటానికి నువ్వు తండ్రివేగాని, కసాయి వాడివి కాదుకదా! అప్పటికీ మా దారికి రాకపోతే ఇంకా నీ భార్య వుందికదా! ఆమెను క్షణాల్లో ఇక్కడికి

తీసుకోస్తాం. ఎలా పరాభవించాలో మాకు తెలుసు అప్పటికైనా మా దారికి వస్తావనే నమ్మకం మాకుంది. యెందుకంటే తన కళ్ళెదుటే భార్యను మానభంగం చేస్తూంటే మాస్తూ సహించగల భర్తలు ఎవరుంటారు చెప్పు?....” అతను ఫెళ్ళున నవ్వాడు.

రీటా శ్రుతి కలిపింది. వాళ్ళిద్దర్నీ సమూలంగా నరికి పారేద్దామన్నంత క్రోధం, కసి రేగాయి వేణులో. బల వంతాన నిగ్రహించుకున్నాడు.

అతను నవ్వి, అన్నాడు. “నువ్వు చాలా మొండి వాడివి. కాని మొండితనం అన్నివేళలా మంచిది కాదు బ్రదర్! నీది ప్రభుత్వంలో కీలకమైన ఉద్యోగం. ఈ దేశానికి, రక్షణకి సంబంధించిన శాఖ నీది. అందుకే నీ సీటుకి పెద్ద డిమాండు, లక్షలు లక్షలు కుమ్మరించి రహ స్యాలను కొనుక్కోవటానికి నాలాంటి స్వదేశీయులు ఎందరో విదేశీయులకి చేరం కుదుర్చుకోవటానికి అదే కారణం.

మా మాట విన్న నీ ముందు పనిచేసిన ఆఫీసర్లు మేడలు మిద్దెలు కట్టుకున్నారు. పొలం, పుట్రా కొనుక్కున్నారు. లక్షలకి లక్షలు కామ్ని తన వాళ్ళందరి పేర్లతోను అకౌంట్సు తెరిచి దాచుకున్నారు. నగలు కొనుక్కున్నారు.

కాని నువ్వోట్టి ఫూల్‌వి. నిన్ను నమ్ముకున్న పెళ్ళాం బిడ్డలకి చివరికి చిప్ప చేతికిచ్చేలా వున్నావు. అయితే ప్రతివాడిలోను ఓ వీక్ పాయింటుంటుంది. నీలో ఉమన్ వీక్‌నెస్ వుంది. నువ్వు స్త్రీ లోలుడివని నిరూపించు కున్నావు. కాని ఆ పిల్లని ఉపయోగించుకొని కూడా రహ స్యాలని మా కప్పగించనన్న మొండివాడిని నిన్నే

చూశాను. చివరికి ఫిల్మ్ బయటపెట్టి నీ పరువుతీస్తానన్నా సిద్ధపడ్డావుగాని, రహస్యాల్ని చెప్పటంలేదు.

నువ్వు చెప్పొద్దుగాని, ఆ ఫైలు మా మొహాన పారెయ్యి. తుణాలమీద మైక్రో ఫిల్మ్‌తో ఫొటోలు తీసుకుని పువ్వుల్లో పెట్టి....ఛ ఛ....లక్షల్లో పెట్టి నీకు అప్పగించేస్తాం. ఈ సంగతి మూడో కంటివాడికి తెలియ నివ్వం. నీ పొజిషన్‌కి ఏం దెబ్బరాదు. హాయిగా లక్షాధి కారివై పోతావు. లేదా, పెళ్ళాం బిడ్డలతో ఈ యింట్లో సజీవ దహనమయిపోతావు.

నీకీ రాత్రి టైమిస్తున్నాను. ఒప్పుకున్నావా సరే, లేదా నీ పిల్లల్ని ముక్కలు ముక్కలుగా తరిగేస్తాను. నీ భార్యను నీ ముందే....గుర్తుంచుకో!" అంటూ బయటకి వెళ్ళిపోయాడు, రీటాతో.

వేణు పిల్లలిద్దరివంకా చూశాడు.

వాళ్ళిద్దరినీ నిర్దాక్షిణ్యంగా చేతులు వెనక్కి విరిచి కట్టేశాడు రాబర్టు. సోఫా కాళ్ళకు తాళ్ళ చివర్లను కట్టేశాడు. ఇద్దరు బాగా ఏడ్చిన గుర్తుగా కళ్ళు ఉబ్బి పోయాయి.

"డాడీ! ఏమిటి డాడీ యిదంతా? ఆ బూచాడెవరు? మనల్ని ఎందుకిలా కట్టేశాడు? నీకు ఏక్సిడెంట్ అయిందని చెప్పి తీసుకొచ్చాడు."

"అంతా అబద్ధం బాబూ! మోసంచేసి నన్ను తీసు కొచ్చారు. నాకు ఏక్సిడెంట్ అయిందని చెప్పాడా ఆ రాస్కెల్? మీరు నిజమని నమ్మివచ్చి ఉచ్చులో పడి పోయారు. మీ అమ్మ ఎలా వుంది? మీకోసం అలమ టించి పోతుంటుంది."

"ఎలా డాడీ, తప్పించుకోవటం?"

"అదే ఆలోచిస్తున్నాను! ఏం తోచటంలేదు" నిస్సహాయత ధ్వనించింది వేణు కంఠంలో.

# 10

భరత్ నగర్ కాలనీలో బస్ దిగింది అమల. పోస్టాఫీసు ఎక్కడుందో ఎంక్వయిరీ చేసింది. అక్కడ పోస్టుబాక్సులున్న ఏరియాలు తిరిగిచూసింది. కాలనీ అంతటికీ మూడుచోట్ల మాత్రం బాక్సులు కనపడ్డాయి.

ఇదే పోస్టాఫీసులో ఉత్తరం పోస్టయింది కాబట్టి, ఈ బాక్సుల్లో ఏదొకదానికి సమీపంలో వేణు బందీ అయిపోయాడని అనుకోవాలి. యెందుకంటే పోస్టుబాక్సులో ఉత్తరం వేసేటంత సావకాశం వేణుకి వుండనివ్వరు శత్రువులు! కాబట్టి పోస్టు బాక్సు చాలా సమీపంలో, అందుబాటులో వుండి వుండాలి వేణుకి!

ఆ మూడింటిలో ఒక పోస్టు బాక్సు ఒక ఇంటి కిటికీకి వేలాడదీయబడింది. అదే ఇల్లు అయివుండాలనుకుంది అమల. ఆ చుట్టుప్రక్కల ఎంక్వయిరీ ప్రారంభించింది.

ఆమె ప్రశ్నలకు ఎవరూ సరిగ్గా సమాధానం చెప్పలేదు.

అయినా ఆమె తన ప్రయత్నం విరమించుకోలేదు. అలా అలా అడిగిన ప్రశ్నలే అడుగుతూ తిరుగుతోంది. తన ప్రయత్నంలో ఆ శత్రువే ఎదురవుతాడేమో అన్న భయం ఓ పక్క బాధిస్తోంది. అప్పుడు తన ప్రయత్నం ఫలించినా, తనూ ఆ ఉచ్చులో బిగిసిపోవాల్సి వుంటుంది. అది కూడా తనకి ఆనందదాయకమే? ఇందరు కలిసి ఒకచోట బతికినా, మరణించినా ఆనందమే!

చివరకు ఓ వృద్ధురాలు చెప్పింది. "ఓ గడ్డపాయన

ఇద్దరు మొగపిల్లల్ని తీసుకొచ్చాడమ్మా. అదిగో ఆ ఎర్ర డబ్బా తగిలించి వున్న యింటికి తీసుకు వెళ్ళాడు. ఆళ్ళ బిడ్డలుగావాల్ను, అతని వెనకనే చెయ్యి పట్టుకుని వెళ్ళారు!" అని.

ఎర్ర డబ్బా-పోస్టు బాక్సు!

అమల చకచక ఆ పోస్టు బాక్సున్న యింటివైపు అడుగులు వేసింది. తక్కిన ఇళ్ళకు కొంచెం దూరంగా విడిగా వుందా ఇల్లు.

సరాసరి ఆ ఇంటికి పోకుండా పక్కనుంచి వెళ్తూ ఓసారి ఆ ఇంటిని పరిశీలించింది అమల. తలుపులు లోపల బిగించి వున్నాయి. పోస్టు డబ్బా వున్న కిటికీ వైతలుపులు మాత్రం కొద్దిగా తీసి వున్నాయి.

కిటికీలోనుంచి తొంగి చూసింది అమల.

ఆమె కళ్ళు మెరిశాయి.

లోపల తన కొడుకులిద్దరు సోఫాకి బంధించబడి వున్నారు. తన భర్త వేణును వెడరెక్కలు విరిచికట్టి ఓ పెద్ద రాటకు కట్టేశారు.

వేణు ముఖంమీద కత్తితో కోసిన గుర్తులు. రక్తం చారికలు. అతని వంటిమీద షర్టులేదు. ఛాతీమీద కూడా శాకతో పొడవునాకోసి, హింసించిన గుర్తులు. తన పిల్లల్ని కూడా బాగా హింసించినట్టున్నారు శత్రువులు. కోపతో తలలు వాల్చేసిన వాళ్ళను చూస్తే ప్రాణం వుందా అన్న అనుమానం కలుగుతుంది.

వేణు కెదురుగావున్న వ్యక్తి చేతిలో రివాల్వర్ నిగనిగ మెరుస్తోంది. పక్కనే ఓ పాతికేళ్ళ యువతి నించుని వుంది. ఆమె ఎవరో తేలిగ్గానే ఊహించుకుంది అమల. ఆ గడ్డపాదే తన భర్తను, పిల్లల్ని అపహరించుకుపోయిన

వాడని అరమైపోయింది. వాడు భర్తను రివాల్వర్‌తో చంపుతానని బెదిరిస్తున్నాడు.

అమల ఆలస్యం చెయ్యలేదు. పక్కనే వున్న పెద్ద రాయిని తీసుకుంది.

తలుపు తట్టింది. రీటా తలుపు తెరిచి "ఎవరు?" అన్నది పక్కలకు చూస్తూ. వెంటనే బండరాయితో ఆమె తలమీద మోదింది. రీటా నేలమీద పడిపోయింది అరుస్తూ.

హడావిడిగా రాబర్టు బయటికొచ్చేలోపల అమల మరో రాయితో సిద్ధంగా వుంది. అతను తల బయటికి పెట్టబోయేంతలో మెరుపు దాడిచేసింది. బండరాతితో అతని తలమీద బలంగా మోదింది.

రాబర్టు నేలమీదపడి గిలగిల కొట్టుకుంటుండగా రివాల్వరు చేజిక్కించుకొని భర్త దగ్గరికి వెళ్ళి కట్లు బాకుతో కోసేసింది. పిల్లల బంధాలు కూడా కోసేసింది.

"పదండి, వెంటనే పోలీసులకి తెలియజెయ్యాలి. చుట్టుపక్కలవాళ్ళు వస్తున్నారు. వాళ్ళకు నిజంచెప్పి వీళ్ళు తప్పించుకుపోకుండా చూడాలి...." అన్నది అమల ఆయాసంతో.

"అమలా, నన్ను క్షమించు!" అంటున్న భర్త నోరు చేతితో మూసి, అతని కళ్ళలోకి ప్రేమగా చూసి నవ్వింది అమల.

—: అయిపోయింది: —

సీరియల్

(గత సంచిక తరువాయి)

అశ్విని అనుమానంగా చూశాడు కార్తీక్ వంక.

కార్తీక్ కళ్ళతోనే సంజ్ఞ చేశాడు.

"సరే, మేం నమ్ముతాం, కాని మమ్మల్ని యేమైనా చెయ్యాలనుకున్నా, క్షుద్ర విద్యలు ప్రయోగించబోయినా మీ అంతు చూస్తాం!" అన్నాడు కార్తీక్.

అందులో ఓ వ్యక్తి ముందుకొచ్చి, "మాకు క్షుద్ర విద్యలు తెలియవు. ఆ విద్యలు తెలిసిన మాంత్రికుడ్ని అతని అనుచరుల్ని మీరు చంపేశారు కదా!" అన్నాడు.

"అయితే, మీరు మాంత్రికుడికి సంబంధించినవాళ్ళు కాదా?" హిమవంత్ అడిగాడు.

"ఒకవిధంగా సంబంధించిన వాళ్ళమేగాని, మీకు శత్రువులం కాదు! మా గురువుగారు వేరే వ్యక్తి! మాంత్రికుడు ఆయనకు సంబంధించిన మనిషి. అలాగే మాంత్రికుడి అచుచరులుకూడా!"

"అయితే మీ గురువు ఎవరు?"

"ఆయన పేరు మాకు తెలియదు. అందరం కళ్యాణ స్వామి అంటాం."

"కళ్యాణస్వామినా? వింత పేరు? ఆయన వుండే దెక్కడ?" అడిగాడు కార్తీక్.

"కళ్యాణ దుర్గం!"

కార్తీక్‌తో బాటు తక్కిన యిద్దరు ఆశ్చర్యంగా నోళ్ళు తెరిచారు. "కళ్యాణ దుర్గమా?" అన్నారు.

"అవును కళ్యాణ దుర్గంలో ఓ రహస్య స్థలంలో మా స్వామి వున్నారు. ఆయనతో బాటు మేముకూడా అక్కడే వుంటున్నాం!"

"ఎందుకు? యే పనిమీద వుంటున్నారు?"

"ఆ విషయం మాట్లాడుదామనే మేము వచ్చాం. మేము వెంటనే వెళ్ళిపోవాలి!"

"మీరు శత్రువులు కాకపోతే మీ చేతుల్లో ఆ శూలాలు దేనికి?" అడిగాడు హిమవంత్. అనుచరుల చేతుల్లో కుడిచేత శూలం, యెడమచేత కాగడా ధరించి వున్నారు!"

"అసలు మిమ్మల్ని బంధించి తీసుకురమ్మని మా స్వామి ఆజ్ఞ కాని మాకు మా స్వామిపట్ల సదభిప్రాయంలేదు. ఆయన చర్యలు మాకిష్టంలేదు. అందుకే మేం మీతో చేతులు కలపాలనుకుంటున్నాం. మీ తాలూకు అమ్మాయి కూడా మా వద్దనే వున్నది!"

అందరు ఏక కంఠంతో "నిజంగానా? ఆమె క్షేమమే కదా!" అన్నారు.

"ఇప్పటివరకు క్షేమమే! నిధి చేజిక్కేవరకు క్షేమంగానే వుంటుంది. నిధికోసం ఆమెని బలిచేయాలని మా

స్వామి నిర్ణయం!"

కార్తీక్ దవడ కండరాలు బిగుసుకున్నాయి.

"ఎంత దారుణం! నిధికోసం ఓ అమాయకురాలి నిండు ప్రాణం బలిచేయాలని తలపెట్టారా?"

"ప్రాణం బలిచేసేనేగాని నిధి దక్కదు! ఓ కన్నె పిల్ల రక్తం తర్పణంతో నిధికి పట్టిన పిశాచం తొలగిపో తుంది సంతృప్తిపడి! ఆ తర్వాత నిధి మా వశమవుతుంది. అందుకే స్వామి మీ అమ్మాయిని ఎత్తుకువచ్చి నిర్బం ధించాడు మా సావరంలో!"

కార్తీక్ పిడికిళ్ళు టెన్షన్‌తో బిగిశాయి. "అయితే యిప్పుడు మీరు వచ్చిన పని....?" అడిగాడు.

"నిధి కోసమనే మీతో మాట్లాడాలని వచ్చాం! ఆ నిధినిక్షేపాలను సూచించే రాగిపలక మీ వద్ద వున్నదని మా వాళ్ళకి తెలిసింది. అది లేకుండా నిధి రహస్యం తెలుసుకోవటం చాలా కష్టం. మీరు మాకు ఆ ఫలకం యిస్తే, మేము ఆ నిధిని కనుక్కుంటాం. సగం మీకు, సగం మాకు!"

"అయితే రాగిపలక మీద నిధి వివరాలన్నీ వివరంగా రాసి వున్నాయా?"

"అవును. చాలా వివరంగా వుంటాయి. ఆ తామ్ర పత్రంకోసమని మా గురువుగారు పన్నెండు సంవత్స రాలుగా ప్రయత్నిస్తున్నారు. కాని దొరకలేదు. మీకెలా చిక్కిందో మాకెవరికీ అర్థం కాలేదు!"

"మీ కళ్యాణస్వామికి క్షుద్ర విద్యలు తెలుసా?"

"తెలుసు. ఆయన ఒక్కడికే తెలుసు. ఆయన నిత్యం దేవిని ఉపాసిస్తుంటాడు. ప్రత్యేకంగా ఓ పూజామందిరం కట్టుకుని అందులో దేవిని ఉపాసిస్తుంటాడు. ఆ మందిరం

లోనికి మాక్కూడా ప్రవేశంలేదు!"

అశ్వని వెంటనే యేదో గుర్తుకొచ్చి అడిగాడు. "కొద్ది నిమిషాల క్రితం మా ముందు అస్థిపంజరాలు నాట్యం చేశాయి. పెద్దగా అరుస్తూ కేకలు వేశాయి. వాటిని మామీద ప్రయోగించిన వాళ్ళు మీరు కాదా?" అని.

"మాలాంటి మరో నలుగురు అనుచరులు! అయితే వాళ్ళక్కూడా క్షుద్ర విద్యలు తెలియవు. కేవలం హస్త లాఘవంతోను, ధ్వన్యనుకరణతోను మీకు నిజంగా అస్థిపంజరాలు నాట్యంచేస్తున్న భ్రమ కల్పించారు!"

"అంటే....నిజంగా అవి నృత్యం చెయ్యలేదా?"

"చేయించారు....మీకు చీకట్లో కనిపించి వుండదు గాని యిప్పుడు మీరున్న సొరంగంపైన చిన్న చిన్న కంతలున్నాయి. మనం యిప్పుడు నిల్చుని వున్న యీ సొరంగం నేలమాళిగన్నమాట! దీని పై కప్పునుచేరే అక్కడనుంచి సరాసరి కళ్యాణ దుర్గం చేరతాం. మరి కొంతదూరం వెళ్ళాక సొరంగం మలుపు తిరుగుతుంది. ఆ మలుపులో మెట్లున్నాయి పైకి. అవి ఎక్కితే మీరీ దారి లోకి ప్రవేశించిన ముఖద్వారం, రెండో సొరంగందారి విడిపోయిన కూడలికి సరాసరి తోవ యేర్పడుతుంది.

"మా సహచరులైన అనుచరులు సొరంగం పైనుంచి అస్థిపంజరాల చేతులకి తాళ్ళుకట్టి, వాటిని వాళ్ళు పైనుంచి లాగటంవల్ల దించటంవల్ల అస్థిపంజరాలు గాల్లో నృత్యం చేసిన భ్రమ కలుగుతుంది మీకు!"

అందరు ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు.

హిమవంత్ ముందుగా తేరుకుని, "మరి ఆ భయంకర శబ్దాలు, అరుపులు, కేకలు....?" అంటుండగానే అను చరుల్లో ఒకడు అందుకుని, చెప్పానుగా, అది ధ్వన్యను

కరణ. పైనున్న కంతలద్వారా నోరు పెట్టి రకరకాల శబ్దాలు నోటతో చేసి అవి పిశాచాలు క్షుద్రశక్తులు అరిచినట్లుగా భ్రమింపచేస్తారన్నమాట! మీ దృష్టి అంతా అస్థిపంజరాల శ్రోవ్యంమీద కేంద్రీకరింపబడి వుండటం వల్ల మీకు ఆ కేకలు అస్థిపంజరాల నోళ్ళనుంచే వచ్చినట్టు అనిపిస్తోంది. ఇదంతా మా గురువుగారిచ్చిన ట్రయినింగు."

"అలా చెయ్యటంవల్ల మీకొచ్చే లాభమేమిటి?"

"బయటనుంచి యెవరూ కళ్యాణ దుర్గం చేరనివ్వకుండా మా గురువుగారు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశారు. ఇలా యెవరైనా ప్రవేశిస్తే వాళ్ళను అక్కడికక్కడే చంపేసే యేర్పాటు ఇది! ప్రతిసారి మా గురువుగారు రానక్కర్లేకుండా, యెలాంటి ఆయుధాలు వాడనవసరం లేకుండా, శత్రువుకు యెదురుపడకుండానే చంపే పద్ధతి యిది! అస్థిపంజరాలు గాల్లో లేచి ఆడగానే, భయంతో శత్రువు బిగుసుకుపోయి ప్రాణాలు వదిలేస్తాడు కదా! అంతకీ ప్రాణం పోకపోతే సరాసరి అస్థిపంజరాల్ని రాళ్ళమీదికి విసిరేస్తారు. దాంతో శత్రువు బేజారెత్తి ప్రాణాలు వదుల్తాడు. అప్పటికీ చావకపోతే మా చేతుల్లోని శూలాల్ని ఉపయోగిస్తాం?"

"ఆ పనేదో మొదటే చెయ్యొచ్చు కదా!"

"చెయ్యవచ్చు గాని, ఎక్కువమంది శత్రువులున్నప్పుడు, వాళ్ళ చేతుల్లో మారణాయుధాలునప్పుడు, స్వామి యీ పద్ధతిని ప్రయోగించమని చెప్పాడు!"

"దారుణం, అమానుషం! మనిషిని హింసించి, భయభ్రాంతుల్ని చేసి చంపటమన్నమాట!"

"మాకు తిరిగి వెళ్ళాల్సి వుంది కాబట్టి, మనం యిక విడిపోవాలి. రాగిరేకు మాకు యిచ్చి మీరు యిక్కడే

ఎక్కడో దాక్కొని వుండండి. తెల్లవారేసరికల్లా గుట్టు చప్పుడు కాకుండా తక్కిన అనుచరుల్ని, కళ్యాణ్య స్వామిని పట్టు పెట్టి, నిధిని చేజిక్కించుకుంటాం. మీ స్నేహితురాల్ని క్షేమంగా కాపాడి తీసుకొస్తాం. మీకు రావలసిన సొమ్ము మీకు పంచి యిచ్చేస్తాం!" మొదటి వ్యక్తి అన్నాడు.

కార్తీక్ అతనివంక చూసి, మరి మా వాళ్ళు మరో యిద్దరు రెండోదారి వెంబడి వచ్చారు, కనిపించారా?" అనడిగాడు.

"ఈసరికి వాళ్ళు మావాళ్ళ చేతుల్లో పడుంటారు. ఆ దారి సరాసరి కళ్యాణదుర్గం చేరిపోతుంది. మలుపుతిరిగితే మనం నిల్చున్న ఈ సారంగం మెట్లదగ్గరికి దారితీస్తుంది. మెట్లెక్కితే సరాసరి కళ్యాణదుర్గం కనిపిస్తూవుంటుంది. మరి, మీ అనుమానాలు తీరినట్టే కదా, ఆ రాగిరేకు యిస్తారా?"

"మిత్రులారా, దురదృష్టవశాత్తూ ఆ రాగిరేకు మా రెండోవర్గం వాళ్ళతో వుండిపోయింది. ఈపాటికి వాళ్ళు కళ్యాణదుర్గం చేరివుంటే, మీ సహచరులు దాన్ని స్వాధీనం చేసుకుని వుంటారేమో!...." అన్నాడు కార్తీక్.

"అరె. ఎంతపని జరిగింది? రాగిరేకు మీ దగ్గర వున్న విషయం మా స్వామికి తెలిసిపోయింది. అసలు మీ అందర్ని తన దగ్గరకు రప్పించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాడు.మీ స్నేహితురాల్ని హింసించి మీ అందర్నీ పేరు పేరునా పిలవమని శాసించాడు. ఆమె పిలిచే సమయంలో మేం అక్కడే వున్నాం!"

కార్తీక్ మనసు పిండినట్టయింది ఈ మాటలతో.

"మన్మల్ని రక్షించుకోవటానికి ఆ అమ్మాయిని హింసించటం దేనికి? బంధింపజేసి తీసుకుపోవచ్చు కదా!" అన్నాడు.

"చెప్పాను కదా, మా స్వామి మన స్తత్వం చాలా విచిత్రమయినది. హింసించి చంపటం, ప్రాణాలతో ఆడుకుని ఆనక వాటిని తీసెయ్యటం—ఆయన సరదాలు. అలాంటి ఆటలో ఓ భాగమేలే ఆమెను హింసించటం!"

"అయితే మాకు ఎలాంటి ఆక్రందనలు వినిపించలేదే....?"

"చెప్పాను కదా, యీ దారికన్న మీ మిత్రులు వెళ్ళిన దారి సరాసరి కళ్యాణదుర్గాన్ని చేరే దారి అని. వాళ్ళకు వినిపించి వుంటుంది! ఈ మలుపు తిరిగితే మీకూ వినిపిస్తూంది!"

"అయితే మమ్మల్నేం చెయ్యమంటారో చెప్పండి" అన్నాడు కార్తీక్.

"రాగిరేకు యీ పాటికే మా వాళ్ళకు చిక్కివుంటే వెంటనే తమ కార్యక్రమం అమల్లో పెట్టేస్తారు. అది మీ స్నేహితురాలి బలి కార్యక్రమంతోనే ప్రారంభమవుతుంది!"

వింటున్న ముగ్గురు త్రుళ్ళిపడ్డారు.

"అయితే మనం ఉపేక్షించటానికి వీల్లేదు! వెంటనే మేము కళ్యాణదుర్గం చేరుకోవాలి....!" అన్నాడు కార్తీక్.

"అదెంతసేపు? పది నిమిషాల్లో మీరు కళ్యాణదుర్గం చేరుకోగలరు! అయితే మీ ప్రాణాలకు ప్రమాదం రాకుండా చూసుకోవాలి కదా! మీరు ఎవరికీ కనపడకుండా కళ్యాణదుర్గం రెండో ద్వారం దగ్గిర యెదురు

చూడండి. దుర్గానికి రెండు ద్వారాలుంటాయి. మొదటి ద్వారం మా గురువుగారి స్థావరానికి, పూజామందిరానికి దారితీస్తుంది. రెండో ద్వారందగ్గర యెవరూ వుండరు. మీరు అక్కడ వున్న రాళ్ళగుట్టల వెనక దాక్కొని వుండండి. ఏం జరిగినదీ వివరంగా మాలో ఒకడు అక్కడి కొచ్చి తెలియజేస్తాడు. మేము వెంటనే వెళ్ళి మీ స్నేహితురాలు బలి కాకుండా జాగ్రత్త తీసుకుంటాం!" అన్నాడు మొదటి వ్యక్తి.

కార్తీక్ తలూపాడు.

హిమవంత్ కాగడాలు చెరో చేత్తోను పట్టుకున్నాడు.

"ఇవిగో యీ రెండు కాగడాలు మీ రుంచుకోండి. అవసరమైతే తప్ప వీటిని ఉపయోగించవద్దు. వెలురు కనిపిస్తే ప్రమాదం! ఆర్పివేసి మీతో వుంచుకోండి" అన్నాడు ఆ వ్యక్తి.

"మరి వీటిని వెలిగించుకోవటానికి మాదగ్గర అగ్గిపెట్టె లేదు, ఎలా మరి!"

"ఇదిగో, అందుకు సాధనం—చెకుముకిరాళ్ళు! వీటితో నిప్పుచేసి కాగడా వెలిగించుకోండి!"

కార్తీక్ "కాగడాలు తీసుకో హిమా!" అన్నాడు.

"మేం వెళ్తున్నాం. మా వాళ్ళకు ఇప్పటికే అనుమానం వచ్చివుండొచ్చు. జాగ్రత్తగా వ్యవహరించకపోతే అందరికి ప్రమాదం!" అంటూ వాళ్ళు నలుగురు వచ్చినదారినే చకచక వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిన కొద్ది నిమిషాలకు కార్తీక్, అశ్విని, హిమవంత్ బయల్దేరారు.

ఓ ఫర్లాంగుదూరం వెళ్ళేటప్పటికి సొరంగం మలుపు తిరిగింది.

ఒక్కసారిగా పచ్చటి వెల్తురు వాళ్ళ కళ్ళలోకి సూటిగా పడింది.

హిమవంత్ ని చూసి, "అదిగో అదే కళ్యాణదుర్గం అయివుంటుంది. ఆ వెల్తురు అక్కడ్నుంచే వస్తున్నదని వాళ్ళు చెప్పారు కదా!" అన్నాడు కార్తీక్. "కాగడాలు ఆర్పెయ్యి."

హిమవంత్ కాగడాలు నేలకొట్టి ఆర్పేశాడు.

అక్కడ పైకి వెళ్ళటానికి మెట్లు కనిపించాయి.

* * *

"అదిగో, ఆ పచ్చటి వెల్తురు వస్తున్నవైపునుంచే దీప్తి కేకలు వినిపించాయి!" అన్నాడు అభిలాష్.

పచ్చటి వెల్తురు చాలా దగ్గర్లో కనిపించింది.

ఆ వెలుగు పడినంతమేరం పరిసరాలన్నీ పచ్చటి కాంతిని సంతరించుకుంటున్నాయి.

"అదేమిటి, ఏదో కోట ప్రాకారంలాగా కనిపిస్తోంది. ఏదో దుర్గంలాగా లేదూ?" అన్నాడు వర్మ దీక్షగా ఆ కాంతివైపు చూస్తూ.

"అవును, ఆ పచ్చటి కాంతికిరణాలు మనకు దూరం నుంచి యేదో దీపంలాగా కాంతివంతంగా కనిపించింది. ఆ దుర్గంమీది నుంచి పగలు ఒక రకంగానూ, రాత్రి మరో రకంగానూ కనిపిస్తోంది వెల్తురు" అన్నాడు అభిలాష్.

వర్మ రివాల్వర్ గురిగా పట్టుకుని, "సరే, అక్కడ దీప్తికి ఎలాంటి ప్రమాదం యెదురయిందో నాకు ఊహ కందటంలేదు! ఆమె అరుపులు కూడా ఆగిపోయాయి. కొంపతీసి యీ పాటికి ఆమెను...." అంటూ ఆగిపోయాడు.

"అదే నాకూ అనుమానం వస్తోంది! సరే ముందుకు పోదాం, యేమవుతుందో చూద్దాం! ఆ అరుపులు మాత్రం కచ్చితంగా మిస్ దీప్తివే, అనుమానం లేదు!...."

ఇద్దరు వేగంగా అడుగులు వేస్తున్నారు. పచ్చటి కాంతి వాళ్ళకు చక్కటి బాటలాగా కనిపిస్తోంది.

"మిస్టర్ అభిలాష్, అది మామూలు దుర్గం కాదు. దాని గోడలు బంగారువర్ణంతో మెరిసిపోతున్నాయి. బురుజులు బంగారు రేకుతో తాపడం చేసినట్టు మిలమిల మెరుస్తోంది. ఎక్కడినుంచీ కాంతికిరణాలు రావటం లేదు. ఆ బంగారురంగు పచ్చటి కాంతిగా పరావర్తనం చెంది వెలుగుగా ప్రసరిస్తోంది.

"అదిగో ముఖద్వారం చూశారా? అదికూడా బంగారు రంగుతో మెరుస్తోంది. నాలుగయిదు నిలువుల ఎత్తు సింహద్వారం, దానికి యెంతో బలమైన తలుపు—అన్నీ బంగారు వర్ణంతో ధగధగ లాడుతున్నాయి. ప్రాకారాలు, దుర్గం శిఖరాగ్రం, అన్నీ బంగారంతో చేసినట్టే కళ్ళు మిరుమిట్లుగొలుపుతున్నాయి.

"అభిలాష్, యీ రేకు సరిగ్గా చూసి చెప్పు! ఇదిగో, యీ బొమ్మకు యీ దుర్గానికి యెంతో దగ్గర సంబంధం వుంది కదూ! నన్నడుగుతే ఇదే నిధిని నిక్షేపాలున్న ప్రదేశమయివుంటుంది. నాకు నమ్మకం కలుగుతోంది. నిధి పాతిపెట్టబడిన ప్రదేశం ఖచ్చితంగా ఇదే. ఇదే! కొన్ని వేల కోట్ల విలువచేసే నిధి. లక్షా, రెండులక్షలా! కొన్ని వేల కోట్లు! ఓహ్, ప్రపంచంలో యే సామ్రాజ్యాధినేత కూడా ఇంత ఐశ్వర్యవంతుడయి వుండలేదు. లక్ష్మీదేవి కోరి మనల్ని వరిస్తోంది."

"కమాన్, టెల్ మీ! ఈ గుర్తులు, దాని కింద సంస్కృతంలో రాసిన అక్షరాలు యేమిటో వివరంగా చెప్పు! ఎక్కడ అవి నిక్షిప్తమై వున్నాయో, ఎంత లోతున ఉన్నాయో అన్నీ గబ గబా చెప్పాలి, క్విక్!"

వర్మ అడ్డూ అపు లేకుండా, ఉన్మాదిలాగా పేల్తున్నాడు. అతని ముఖం ఆనందంతో వెలిగిపోతోంది. నాట్యం చేస్తున్నట్టు చకచక ముందుకు ఉరుకులు పరుగులు పెడుతున్నాడు. రాగిరేకును పదేపదే ముద్దు పెట్టుకుంటున్నాడు. నిధి అప్పుడే తనవశమైపోయినట్టు తను కోటికి పడగలెత్తిన మహాసామ్రాజ్యాధినేతలాగా ఆనందంతో ఉప్పొంగిపోతున్నాడు.

అభిలాష్‌కు చర్రున కోపం వచ్చేసింది. "వర్మగారూ! అవతల మిస్ దీప్తి ఆపదలో వున్నది. బతికే వున్నదో, ఈపాటికి ప్రాణాలు పోగొట్టుకొన్నదో మనకు యేసంగతీ తెలియదు. మీరు చూడబోతే నిధి—నిక్షేపం అంటూ ఆనందతాండవం చేస్తున్నారు. ఇది డబ్బుకోసం పాకులాడే సమయమా? మనిషి ప్రాణంకన్నా డబ్బుకే విలువ ఎక్కువా?" అన్నాడు.

వర్మ ఉత్సాహమంతా నిప్పులో నీళ్లు చల్లినట్టు ఒక్కసారిగా చల్లారిపోయింది.

"సారీ, మిస్టర్ అభిలాష్. నేను ఈ దుర్గం చూసిన ఆనందంలో ఒళ్లు మరిచి...." అతనింకేదో అంటుండగానే దుర్గం లోపలినుంచి దీప్తి ఆర్తనాదం, స్పష్టంగా, చాలా స్పష్టంగా మళ్ళీ వినిపించింది.

అభిలాష్ వర్మవంక చురుగ్గా చూశాడు. వర్మ తప్పు చేసినవాడిలా ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

ఇద్దరూ కళ్యాణదుర్గం సమీపించారు.

దీప్తి కేకలు వినిపించటంలేదు. మళ్ళీ పరిసరాలు భయంకరమైన నిశ్శబ్దంతో, చీమ చిటుక్కుమన్నా విని పించేలా సద్దుగా అయిపోయాయి.

వర్మ రివాల్వర్ చేతిలో గురిగా పట్టుకున్నాడు.

ఇద్దరూ దుర్గం ముఖద్వారాన్ని చేరుకున్నారు.

బ్రహ్మాండమయిన తలుపు ముఖద్వారాన్ని పూర్తిగా మూసేసివున్నది. చుట్టూ ఎత్తయిన ప్రాకారం! అంతటా పచ్చటి వెలుగుకిరణాలు ఆ ప్రదేశాన్ని దేదీప్యమానంగా ప్రకాశింప చేస్తున్నాయి.

"ఇక్కడ లోపలికి ప్రవేశించటానికి ద్వారం కనిపిం పించటంలేదే!" అన్నాడు వర్మ, తలెత్తి ముఖద్వారాని కున్న బ్రహ్మాండమైన తలుపులవంక చూస్తూ.

తలుపుల ఎత్తు కనీసం ఇరవైనాలుగు అడుగులకు తక్కువ వుండదు! తలెత్తి చూస్తే మెడలు నొప్పి పుట్టే టంత ఎత్తయిన తలుపులు! తలుపులకి తాపటం చేసిన బంగారు రేకు, వన్నె మాసిపోయినా కాంతి మాత్రం తగ్గలేదు!

"ఇదిగో, ఈ పక్కనుంచి చిన్న తలుపు వున్నది, చూశారా?" అన్నాడు అభిలాష్. పెద్ద తలుపులు రెండిటిలో ఓ తలుపుకు అడుగుభాగంలో రెండడుగుల వెడల్పు, నాలుగడుగుల ఎత్తూ వున్న చిన్న తలుపు అమర్చబడివున్నది! ఆ తలుపు కాస్త ఓరవాకిలిగా తెరిచి వున్నది! మనిషి లోపలికి కెళ్ళాలంటే, సగానికిపైగా వంగిపోయి లోపలికి ప్రవేశించాల్సి వుంటుంది.

కరెక్టు! చాలా పురాతనమయిన కట్టడాలకు ఇలాంటి పెద్ద తలుపులు పెట్టి, కిందినుంచి ఇలాంటి తలుపుపెట్టడం

నేను చాలా ఉదంతాలు విన్నాను. అంతఃపుర ద్వారాలకు కూడా మహారాజులు ఇలాంటి ఏర్పాట్లు చేస్తూండే వారట!" అన్నాడు వర్మ.

తలుపు తోశాడు అభిలాష్—కిర్రుమనే చప్పుడుతో తెరుచుకున్నది తలుపు.

ముందుగా అభిలాష్ లోపలికి అడుగు పెట్టాడు. వర్మ అతని వెనుకనే రివాల్వర్ గురిచేసుకుని తలుపుదగ్గిర వంగుతున్నాడు.

అంతే! అతని చేతిలోని రివాల్వర్ ఎగిరి దూరంగా పడింది. అకస్మాత్తుగా నలుగురు వ్యక్తులు వాళ్ళిద్దరిమీద ఎక్కడినుంచో వచ్చి పడ్డారు.

అభిలాష్ వాళ్ళకు చిక్కకుండా తప్పించుకుని, ఎగిరి ఒకడి డొక్కలో తన్నాడు. వాడు కుయ్యోమంటూ కూలబడిపోయాడు. ఇంకొకడ్ని యెగిరి గుండెలమీద తన్నాడు. వాడు అల్లంతదూరంలో పడి, మళ్ళీ అంత వేగంగాను లేచి నించున్నాడు.

ఈలోపల వర్మ తనమీద పడిన యిద్దర్నీ చంకల్లోను యిరికించుకుని బలంగా నొక్కాడు. వాళ్ళు చుక్కల్లా వంగి అతని పట్టునుంచి తప్పించుకున్నాడు. ఈలోగా అభిలాష్ చేత తన్నులుతిన్న యిద్దరు లేచి, అంత వేగంగాను అభిలాష్‌మీద పడ్డారు.

వర్మ నేలబారుగా దొర్లి రివాల్వర్ అందుకోవాలని ప్రయత్నించాడు. కాని అతని ప్రయత్నం ఫలించేలోపల తక్కిన ఇద్దరు వ్యక్తులు వర్మను గట్టిగా పట్టుకున్నారు. రివాల్వర్‌ని కాలితో తన్నేశాడు ఒకడు. రెండోవాడు వర్మ దుస్తులు వెతకసాగాడు.

ఈలోపల అభిలాష్‌ను పట్టుకున్న వ్యక్తులు అతని

దుస్తులు వెతికి "లేదు!" అంటూ తక్కిన ఇద్దరికీ సంజ్ఞ చేసి చెప్పారు.

అందులో ఒకడు వాళ్ళిద్దరివంకా తీవ్రంగా చూస్తూ, "ఆ రాగి ఫలకం ఎక్కడ దాచారు?" అన్నాడు.

"ఏ రాగి ఫలకం?" అన్నారు వర్మ, అభిలాష్ ఒకే సారి.

"ఏ రాగిఫలకమో మీకూ తెలుసు, మాకూ తెలుసు. అది ఎక్కడ దాచారో వేగిరం చెప్పండి. లేకపోతే మీ యిద్దరి ప్రాణాలు నిలువునా తీసేస్తాం!" అన్నాడు ఓ వ్యక్తి.

"మీరనేదేమిటో మాకర్ధంకావటంలేదు. మాకు ఏ విధమైన రాగిపలక గురించీ తెలియదు. మీరెవరు, మమ్మల్ని ఎందుకిలా నిర్బంధిస్తున్నారో అంతకన్నా తెలియదు!" అన్నాడు వర్మ.

మొదటి వ్యక్తి వర్మ రెండు చెంపలు ఛెళ్ళుఛెళ్ళున చరిచాడు. "అబద్ధమాడాలని ప్రయత్నిస్తే అమ్మవారికి బలేస్తాం, జాగ్రత్త! మర్యాదగా ఎక్కడ దాచారో చెప్పండి!" అన్నాడు.

వర్మ కోపంతో పళ్ళు పటపట కొరికాడు. ఒక్కసారిగా వాళ్ళ పట్టు సడలించుకుని లాగి ఆ వ్యక్తి చెంపమీద బలంగా కొట్టాడు. ఇంకా కసితీరక ఎగిరి వాడి గుండెలమీద తన్నాడు.

ఈలోపల అభిలాష్ కూడా తన బంధాలు వదిలించుకోవాలని చూశాడు. కాని ఆ ఇద్దరు వ్యక్తులు యే మాత్రం పట్టు సడలించలేదు.

మొదటి వ్యక్తి కిందపడివున్న శూలంతీసి దాన్ని

వర్మ గుండెలకు గుచ్చి, "యేరా పొగరుగా వుందా? నామీదనే చెయ్యి చేసుకుంటావా? జాగ్రత్త, యీ శూలాన్ని నిలువునా నీ గుండెల్లో దించేస్తాం" అన్నాడు శూలాన్ని మరింత నొక్కిపడుతూ.

వర్మ గుండెల దగ్గర రక్తం చివ్వున పైకి తన్నింది.

"మిస్టర్ వర్మా, వాళ్ళతో వాదన పెట్టుకోవద్దు! కోరి కొరివితో తలగోక్కున్నట్టే!" అన్నాడు అభిలాష్ మెల్లగా.

ఈ లోపల ఓ వ్యక్తి యెక్కడినుంచో తాళ్ళు పైకి తీసి వర్మను వెడరెక్కలు విరిచి కట్టాడు. అదే తాడుతో అభిలాష్ చేతులుకూడా వెనక్కి విరిచి కట్టేశాడు.

నలుగురు ముందుకొచ్చి, "మీ చేత నిజం యెలా చెప్పించాలో మా గురువుగారు చూసుకుంటారు, మేము మర్యాదగా అడిగితే చెప్పరూ? సరే, పదండి!" అంటూ తాళ్ళు రెండు చివర్లో పట్టుకుని లాక్కుపోసాగారు.

• • •

కార్తీక్, అశ్విని, హిమవంత్ మెల్లెక్కి పైకొచ్చారు. సమతలమైన ప్రదేశం కనిపించింది.

దూరంగా పచ్చటి వెలుగు కళ్ళకు మిరుమిట్లు గొలుపుతోంది.

"కార్తీక్, ఆ వెలుగు యెక్కడ్నుంచి వస్తున్నదో యిప్పుడర్థమవుతోంది. వాళ్ళు చెప్పిన కళ్యాణ దుర్గంనుంచే ఆ కాంతికిరణాలు వస్తున్నాయి. అదే మనకు ఏదో దీపం వెలుగా అనిపించింది. అద్భుతమైన దృశ్యం!" అన్నాడు అశ్విని.

అందరు ఆ దుర్గం సౌందర్యాన్ని, బంగారుకాంతు లీనుతున్న ప్రాకారాల్ని, బురుజుల్ని, కోట తలుపుల్ని,

వాటికి తాపడం చేసిన బంగారు రేకుల్ని స్పష్టంగా, అతి దగ్గరగా చూశారు.

"ఈ వెలుగే మనకు ఈ సారంగంలోనికి ప్రవేశించి ముందునించీ కనిపిస్తోంది. ఎంత గొప్ప కట్టడం! కళ్యాణ వర్మ నిజంగా కలియుగ మయ బ్రహ్మలా వున్నాడు. సారంగాన్ని తొలిచి అద్భుతమైన దుర్గాన్ని నిర్మించాడు!" అన్నాడు కార్తీక్.

"మనం చూసిన రాగిఫలకంలో ఈ దుర్గం స్కెచ్ గీయబడి వున్నది! ఇందాక కళ్యాణస్వామి అనుచరులు చెప్పినదాన్నిబట్టి చూస్తే ఆ రాగిఫలకంమీద నిధి నిక్షేపాల సంగతి పూర్తిగా వివరించబడివుండే వుంటుంది. అభిలాష్ కావాలనే అన్ని వివరాలు పైకి చెప్పలేదు, లోలోపల చదువుకోవటం చూసినపుడే అనుకున్నాను. అతను కావాలనే ఏదో దాస్తున్నాడని!" హిమవంత్ అన్నాడు.

"మనం అభిలాష్‌ని ఈ విషయంలో తప్పు పట్టాల్సిన పనిలేదు. వర్మ రాగిఫలకం విషయంలో అనవసర శ్రద్ధ చూపించటంవల్లనే అతడు కావాలని వివరాలు దాచి చెప్పాడు. ఓపక్క దీప్తి అంతర్ధానమయి, మనం బాధ పడుతుంటే వర్మ నిధి నిక్షేపాల గురించి అడుగుతున్నాడు కదా, అభిలాష్ అందుకే నిజం చెప్పకుండా దాట వేశాడు" అన్నాడు కార్తీక్.

అశ్విని ఏదో చెప్పాలని నోరు తెరిచాడు. ఇంతలో ఎక్కడినుంచో స్త్రీ ఆర్తనాదం చెవులకు స్పష్టంగా తాకింది.

ముందుగా కార్తీక్ ఆ స్వరాన్ని గుర్తుపట్టాడు.

"అవును, ఆ కంఠస్వరం దీప్తిదే! అనుమానంలేదు"

అన్నాడు శాస్త్రీక్.

అతని గుండె వేగంగా కొట్టుకుంటూంది.

అశ్విని, హిమవంత్ జాగ్రత్తగా చెవులు రిక్కించారు. కాని మళ్ళీ ఎలాంటి కేకలూ వినిపించలేదు.

"స్త్రీ ఆర్తనాదం వినిపించిందిగాని, అది ఎవరిదో గుర్తుపట్టలేకపోయాం! మళ్ళీ వినిపిస్తే చెప్పగలుగుతామేమో!" అన్నాడు హిమవంత్.

"నేను స్పష్టంగా విన్నాను. అది దీప్తి గొంతే. యేదో ప్రమాదంలో చిక్కుకున్నది! థాంక్ గాడ్! కనీసం ఆమె బతికి వున్నదన్న విషయం నిర్ధారణయింది, ఆమెని రక్షించుకోవలసిన బాధ్యత యిప్పుడు మనపై వుంది!" శాస్త్రీక్ అడుగులవేగం హెచ్చింది.

చకచక ముందుకు పరుగులాంటి నడకతో సాగిపోతుంటే అతని వెనుక అశ్విని, హిమవంత్ వేగంగా అడుగులు వేస్తున్నారు.

దుర్గం యిప్పుడు మరింత స్పష్టంగా కనిపిస్తోంది. కాంతి కిరణాలు సూటిగా వాళ్ళ కళ్ళకు తాకుతున్నాయి. కాని వాళ్ళు అవి ఏవీ గమనించే స్థితిలో లేరు.

దుర్గం మొదటి ద్వారం వద్దకు చేరుకున్నారు.

"ఆ తామ్ర ఫలకం యెక్కడ దాచారు?" మాంత్రికుడు కళ్యాణస్వామి అరుపుతో ఆ పరిసరాలు ధ్వనించాయి.

వర్మ, అభిలాష్ మాట్లాడలేదు. ఓ పక్కగా దీప్తిని కాళ్ళు చేతులు వెనక్కి విరిచి పట్టేసి వుంచారు. ఆమె తమ యిద్దరివంకా దీనంగా చూస్తోంది. ఆమె ముఖంమీద రక్తపు చారికలు కనిపిస్తున్నాయి. గతంలో చూసిన రాతిగదిలాంటి గదిలో తమ ఎదురుగా మూర్తీభవించిన

మృత్యువులా మాంత్రికుడు కళ్యాణస్వామి నిల్చుని కళ్ళ నుంచి నిప్పులు రాలుస్తున్నాడు.

వర్మ, అభిలాష్ తమవంక చూసుకున్నారు. అతి నిస్సహాయస్థితిలో కట్టుకున్న గుడ్డలన్నీ చీలికలై పోయి, అనుచరులు రాళ్ళమీద ఈడ్చుకురావటంవల్ల ఒళ్ళంతా చెక్కుకుపోయి రక్తం చిమ్ముతున్న గాయాల్తో దయానీయమైన పరిస్థితిలో వున్నారు!

మాంత్రికుడి చేతిలో పొడవాటి వేట కత్తి వుంది. దాంతో వేటకొక్కడ్ని నరికిపారేయాలన్నంత కోపంగా వున్నాడు. అప్పటికి రెండు మూడుసార్లు ఆ రాగి రేకు గురించి వర్మను, అభిలాష్‌ను చెంపలు పగలేశాడు.

వర్మ ముక్కు, నోరు రక్తసిక్తమైపోయాయి. అభిలాష్ పరిస్థితి కూడా దాదాపు అలాగే వుంది!

"ఏరా, నువ్వు పెద్దమనిషిలా కనిపిస్తున్నావు, రాగి రేకు గురించి నిజం చెప్పదలచుకోలేదా? నిన్నీ క్షణంలో ఖండఖండాలుగా నరికినా అడుగునేవాడు లేడు. నాతో సహకరించావంటే మీ అందర్నీ ప్రాణాలతో వది లేస్తాను, ఏదీ ఆ రేకు!?" కళ్యాణస్వామి అడిగాడు లాలనగా వర్మవంక చూస్తూ.

వర్మ కోపాన్నీ బాధనీ పళ్ళ బిగువున దాచుకొని, "నేను నిజమే చెపుతున్నాను. నా దగ్గర ఏ విధమైన రాగిరేకూ లేదు. ఇదే మాట నీ మనుషులు అడిగినప్పుడు కూడా చెప్పాను! మీరందరు మామీద కక్షపూని యిలా హింసించటం మా దురదృష్టం!" అన్నాడు.

కళ్యాణస్వామి వికటంగా నవ్వాడు. "ఆ రేకు పన్నెండేళ్ళుగా మాకెవరికీ దొరకలేదు. ఈనాడు మీ

కళ్ళబడింది. అది యింతకాలం ఆ ముసిలాడే దాచి వుంటాడని కల్లో కూడా ఊహించలేదు. ఏ మాత్రం నా ఆలోచన అటుపోయినా వాడినెప్పుడో పరలోకం పంపి ఆ రేకు స్వాధీనం చేసుకుని వుండేవాడ్ని" అన్నాడు.

"నిజంగానే వీళ్ళ దగ్గర లేదేమో స్వామీజీ, ఆ రేకు? వీళ్ళుగాక మరో ముగ్గురున్నారు, వాళ్ళు కూడా వస్తూవుంటారీపాటికి!" అన్నాడు ఓ అనుచరుడు.

ఓ పక్కగా అంతదాకా చోద్యం చూస్తున్నట్టుగా నలుగురు అనుచరులు నించుని వున్నారు. వాళ్ళు వర్మను, అభిలాష్‌ను లాక్కొచ్చినవాళ్ళే! వాళ్ళే కార్తీక్‌ని, అశ్వినిని, హిమవంత్‌ని అస్థిపంజరాలతో భయపెట్టడానికి ప్రయత్నించినవాళ్ళు.

"ఏరీ వాళ్ళు? వాళ్ళని తీసుకు రాలేదేం?" కళ్యాణ స్వామి కోపంగా చూశాడు—అలా అన్న అనుచరుడి వంక.

"అందుకోసం మన చిదానందుడు మరో ముగ్గురితో వెళ్ళాడు. ఈ పాటికి తిరిగొస్తూ వుంటారు...." అంటుండగానే చిదానందుడనబడే అనుచరుడు, మరో ముగ్గురు సహచరులతో అక్కడికొచ్చాడు.

"ఏరీ వాళ్ళు, ఎక్కడ?" కళ్యాణస్వామి కంఠం ఆ గదిలో మారోమ్రోగింది.

"కనపడలేదు స్వామీజీ! తమ ఆదేశానుసారం రెండో మాళిగలో వెతుక్కుంటూ వెళ్ళాం. యెంత దూరం వెళ్ళినా వాళ్ళ జాడ కనిపించలేదు. రెండో మార్గంగుండా సరాసరి వచ్చేశారేమోనని తిరిగి వెనక్కు వచ్చేశాం!" అన్నాడు చిదానందుడు.

తక్కిన ముగ్గురు తలలూపారు.

"అబద్ధం స్వామీజీ! మేము అంతె క్రితమే అసిపంజరాల్ని వైనుంచి సొరంగంలోకి దింపి వాళ్ళని భయపెట్టాలని ప్రయత్నించాం! కాని, యెలాగో వాళ్ళు ధైర్యం తెచ్చుకుని తుపాకీ మడమలతో అసిపంజరాల్ని నుగ్గు నుగ్గు చేసేశారు. మేము గొంతు మార్చి అరిచినా వాళ్ళు భయపడలేదు.

ఈలోగా వీళ్ళిద్దరూ దుర్గంవైపే నడుస్తూరావటం చూసి, మేము ఆ ముగ్గురి విషయం వదిలేసి ఈ ఇద్దరినీ బంధించాలని దుర్గం ద్వారం దగ్గర కాచుకుని వున్నాం. ఆ ముగ్గురి విషయం చిదానందుడు తను చూసి వస్తానని వెళ్ళాడు. ఇప్పుడు తమకి వాళ్ళెవరూ కనిపించటంలేదని ఎందుకు అబద్ధమాడుతున్నాడో అర్థంకాదు!" అన్నాడు మొదటి అనుచరుడు.

కళ్యాణస్వామి క్రోధంతో నిప్పుకణాలు వెదజల్లే చూపులతో చిదానందుడ్ని సమీపించాడు.

"నిజం చెప్పు, ఇతను చెపుతున్నది నిజమేనా? నీకు గాని, ఈ ముగ్గురిలో యెవరికిగానీ ఆ ముగ్గురు కనిపించలేదా? ఆ రాగిరేకును వాళ్ళ దగ్గర్నుంచి మీరు స్వాధీనం చేసుకుని, వాళ్ళెవరూ కనిపించలేదని బొంకుతున్నావా? నిజం చెప్పు లేకపోతే నిన్ను ఖండఖండాలుగా చీల్చి, నీ రక్తం క్షుద్రదేవతలకు తర్పణచేస్తాను" అన్నాడు.

చిదానందుడు తొణకలేదు. "నిజమే స్వామీజీ! వాళ్ళు కనిపిస్తే ప్రాణాలతో వదిలేవాళ్ళమా? ఆ రేకు దొరికితే తమకు సరాసరి తెచ్చి యిచ్చేవాళ్ళం. దాచుకుని గురుదేవులైన తమని మోసం చేస్తామా స్వామీజీ! మా మీద నమ్మకం లేదా? వరదుడు ఎందుకో నామీద

తమకు అవిశ్వాసం పుట్టిస్తున్నాడు!" అన్నాడు.

మొదటి అనుచరుడు — వరదుడు, కోపంగా చిదానందుడ్ని చూసి, "స్వామీజీ! తమరు ఉపేక్షించవద్దు. చిదానందుడికీమధ్య నిధిని తనే వశంచేసుకోవాలనే దురూహపట్టి పీడిస్తోంది. శత్రువులతో చేతులు కలిపి, మనందర్నీ మోసం చెయ్యాలనుకుంటున్నాడని నాకు నిశ్చయంగా తెలుసు!" అన్నాడు.

కళ్యాణస్వామి పిడికిలి బిగించి చిదానందుడి గడ్డం కింద కొట్టాడు. ఆ దెబ్బకు చిదానందుడు గింగిరాలు తిరిగి నేలమీద పడ్డాడు. అతని నోటి చివర్లనుంచి రక్తం ధారలు కట్టింది.

"నిజం చెప్పకపోయినా, స్వామి ద్రోహం తల పెట్టినా ఈ స్వామి క్షమించడని గుర్తుంచుకో!" కళ్యాణ స్వామి కాలితో, కిందపడిపోయిన చిదానందుడి గుండెల మీద బలంగా తన్నాడు.

చిదానందుడు నోరు మెదపకుండా భరించాడు బాధ నంతా.

కళ్యాణస్వామి, అతనితో వెళ్ళిన ముగ్గురు సహచరుల వంక చూసి, "ఏరా, మీరైనా నిజం చెప్పండి. మీకు వాళ్ళు కనిపించలేదా? ఆ రాగిరేకును మీరు వాళ్ళ దగ్గర్నుంచి తీసుకున్నారా లేదా?" హుంకరించాడు.

వాళ్ళు ముగ్గురు కళ్యాణస్వామివంక చిదానందుడి వంక మిడిగుడ్లేసుకుని చూస్తుండిపోయారు.

చిదానందుడు నేలమీద దొర్లుతూ నే కిందవున్న వేటకత్తిని చేత దొరకపుచ్చుకున్నాడు. ఒక్కసారిగా చివ్వున పైకిలేచాడు. మరుక్షణం కళ్యాణస్వామి తల నేలమీద బంతిలా దొర్లివుండేదే, కాని వరదుడు మెరుపు

వేగంతో చిదానందుడిమీదికి ఉరికి అతని ప్రయత్నాన్ని తన చేతిలోని శూలంతో భంగం చేశాడు.

కళ్యాణస్వామి క్రోధావేశాలతో అరచిన అరుపుతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోయింది. చిదానందుణ్ని ఎగిరి గుండెలమీద తన్ని అతని చేతిలోని వేటకత్తి అందుకుని స్త్రువన చిదానందుడి తల నరికేశాడు!

చూస్తున్నందరికీ కళ్ళు తిరిగి ఒళ్ళు తూలినట్లు భ్రాంతి కలిగింది.

దీప్తి ఈ దృశ్యం చూడలేక తలతిప్పుకున్నది. అభిలాష్ శర్మతోపాటు వరదుడు, తక్కిన అనుచరులు బిగుసుకుపోయారు.

చిదానందుడి ప్రాణాలు అనంత వాయువుల్లో లీనమై పోయాయి. అతనితోపాటు శాస్త్రీని కలిసి మాట్లాడిన అనుచరుల పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి.

ఒక్కసారిగా ఆ ముగ్గురు కళ్యాణస్వామి పాదాల మీద పడిపోయి "మమ్మల్ని ఏం చెయ్యొద్దు గురుదేవా! చిదానందుడు వాళ్ళతో ఏం మాట్లాడాడో కూడా మేం వినలేదు. ముగ్గురు వ్యక్తులు మాళిగలో కనిపించారు మాకు! వాళ్ళు యిటే వస్తున్నారు!" అన్నారు.

కళ్యాణస్వామి ఆ ముగ్గురివంకా ప్రసన్నంగా చూసి, "ఇంతసేపు నేను గొంతు చించుకుంటుంటే సమాధానం చెప్పరేం మరి! ఈసారికి క్షమించి వదిలిపెడుతున్నాను. బుద్ధి కలిగి వుండండి!" అన్నాడు.

ఆ ముగ్గురు తేలిగ్గా శ్వాసపీల్చుకున్నారు.

కళ్యాణస్వామి వరదుడివంక తిరిగి, "మీరు వెంటనే దుర్గం ముఖ ద్వారం దగ్గరకు వెళ్ళండి. శత్రువులు ఈపాటికి అక్కడికి చేరుకొని వుంటారు. వాళ్ళని చంప

కుండా నా దగ్గరకు తీసుకురండి!" అన్నాడు.

వరదుడు, చిదానందుడి సహచరులవంక తలతిప్పి చూసి, "మీ ముగ్గురు యిక్కడే వుండండి! మేం నలుగురం పోయి వస్తాం!" అని తన సహచరులు ముగ్గుర్నీ తీసుకొని బయటకు పరుగెత్తాడు.

కళ్యాణస్వామి వర్మవంక క్రూరంగా చూసి, 'మీ వాళ్ళెవరో మరో ముగ్గురు వస్తున్నారట! వాళ్ళ దగ్గర ఆ రేకుఫలకం దొరికిందా సరే, లేకపోతే మీ అందర్నీ యిక్కడే దేవికి వరసబలులిచ్చేస్తాను! మీ రక్త తర్పణంతో అమ్మకు ఘనంగా విందుచేస్తాను. మీలో మీరు ఓ నిర్ణయానికొచ్చి నా ఫలకం వశం చేయండి. లేదా, యిదుగో ఈ స్వామి ద్రోహి చిదానందుడే మీకు మార్గం చూపుతాడు!" అన్నాడు కర్కశంగా.

* * *

"లోపలికి వెళ్ళటం మంచిది కాదేమో!" అన్నాడు కార్తీక్ దుర్గం ముఖద్వారం దగ్గర ఆగి, చిన్న తలుపు వంక పరీక్షగా చూస్తూ.

అక్కడ నేలమీద అంతక్రితమే ఎవరో పోట్లాడుకున్న సూచనలు కనిపిస్తున్నాయి. ఇసుకలో గుర్తులు కనిపిస్తున్నాయి. ఎవర్నో ఈడ్చుకుపోయిన లక్షణాలు దృగ్గోచరమవుతున్నాయి!

అశ్విని, హిమవంత్ అవునన్నట్టు తలలూపారు.

"అంటే, వర్మగారు, అభిలాష్ శత్రువులకి దొరికి పోయి వుండొచ్చు" అన్నాడు కార్తీక్.

"అయితే మనం వెంటనే ఈ ద్వారంగుండా లోనికి వెళ్ళి వాళ్ళను రక్షించుకోవద్దా?" అన్నాడు అశ్విని.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.





## క్రైమ్‌లో

# కొండంత వయసు!

"నీ పేరు?" అడిగాడు రేషనింగ్ ఆఫీసరు.

"అప్పలమ్మ."

"వయసు?"

"మీకు ప్రక్కింటి కొండమ్మ తన వయసు ఎంతని చెప్పింది?"

"ఆవిడ తన వయసు చెప్పలేదు."

"ఆవిడదీ, నాదీ ఒకటే వయసు" అంది అప్పలమ్మ.

అప్పలమ్మ కొండంత పయసు కలది - అని రేషనింగ్ ఆఫీసరు రాసుకున్నాడు.

—బి. కె. ప్రసాద్, సికింద్రాబాదు.

# "నేనే గిచ్చాను"

క్రిక్కిరిసి వున్న సిటీ బస్‌లో చలపతికి అటుప్రక్కన ఒక యువతి, ఇటుప్రక్క అతని భార్య జయలక్ష్మి నిలబడి వున్నారు. నాలుగయిదు స్టాపులు దాటాక చలపతికి అటు ప్రక్కన వున్న యువతి రుసరుసలాడుతూ, "చదువుకున్న వాడిలా కనిపిస్తున్నందుకు ఊరుకుంటున్నాను. ఇంకొకరి నయితే నన్ను గిచ్చినందుకు లాగి చెంపమీద కొట్టివుండే దాన్ని" అంది.

చలపతి ముఖం ఎర్రగా కందిపోయింది. సిగ్గుతో సగం చచ్చిపోయాడు. తను దిగవలసిన స్టాపు కాకపోయినా తలొంచుకుని బస్ దిగాడు. జయలక్ష్మి అతన్ని అనుసరించింది.

"నేను ఆవిడను గిచ్చలేదు" అన్నాడు చలపతి ఫుట్‌పాత్ మీద నడుస్తూ.

"నాకు తెలుసు. బస్ కుదుపులకు మీరు ఆ అమ్మాయి మీద పడుతోంటే నా వళ్ళుమండి నేనే ఆవిడను గిచ్చాను" అంది జయలక్ష్మి నెమ్మదిగా.

—'జెయకర్'

## ఆడ పావురం ?

ఆ రాత్రి భార్య అందించిన కిళ్ళీ నములుతూ "అన్నట్టు మన ఎదురింట్లోని కాలేజీ కుర్రాడు ఎటువంటివాడు?" అడిగాడు సూర్యారావు, భార్యను.

"అబ్బాయి మంచివాడే! ఎప్పుడూ తల వంచుకొనే పోతూంటాడు. ఆడవాళ్ళు ఎదురయినా తప్పుకుపోతాడే కాని, తలెత్తి చూడడు. పైగా మన కులస్తుడేనట! ఇక్కడ కాలేజీలో డిగ్రీ చదవడం కోసం భీమడోలు నుండి వచ్చాట్ట!"

"గుడ్! చాలా విషయాలు సేకరించావ్. చూడు, మా చెల్లెలు సరోజ ఆతగాడ్ని ప్రేమిస్తూందని నా అనుమానం. వాళ్ళిద్దరూ ఎప్పుడయినా పొరబాటున నీ కంటబడ్డా చూసీ చూడనట్టు వూరుకో!"

"అదేమిటండీ? ఆ తరువాత ఏదయినా పొరబాటు జరిగితే, అందరూ మననే అంటారు....!."

"మరేం భయపడకు. అసలు పావురాలు పట్టేవాళ్ళు ఏం చేస్తారో తెలుసా?"

"పావురాలకీ సరోజకీ ఏమిటి సంబంధం....?"

"అదే నేను చెప్పేది. పావురాలు పట్టేవాడు, ఒక ఆడ పావురాన్ని బాగా తర్ఫీదు యిచ్చి బయటకు వదుల్తాడు. దాని ఆకర్షణలో చిక్కిన మగపావురం దాన్తోపాటు వచ్చేస్తుంది. అప్పుడు దాన్ని అమ్మి డబ్బు చేసుకుంటాడు వాడు."

"అంటే మన సరోజ ఆడపావురమన్న మాట!.... అర్థమయిందిలెండి!" చిరునవ్వుతో అంది సుశీల.

"అర్థమయిందిగా. ఇక మాట్లాడకు" అనేసి, భార్యను దగ్గరకు తీసుకొని లైట్ ఆర్పేశాడు సూర్యారావు.

* * *

"ఏమండీ! మీ సరోజ ఎంత పని చేసిందో చూశారా?" ఆత్రంగా సూర్యారావును నిద్రలేపుతూ అంది సుశీల.

"ప్రొద్దుటే ఏమిటే నీ గోల?" కళ్లు నులుముకొంటూ లేచాడు సూర్యారావు.

"నాది గోలా? మీ చెల్లెలు కనిపించటంలేదు. ఆవిడ మంచంమీద ఈ ఉత్తరం దొరికింది. చదవండి."

చెల్లెలు కనిపించటంలేదనగానే నిద్రమత్తు వదలిపోయింది సూర్యారావుకి.

భార్య అందించిన ఉత్తరం ఆత్రీగా అందుకొన్నాడు—

"పూజ్యులైన అన్న, వదినలకు—మీ చెల్లెలు సరోజ వందనాలతో వ్రాయునది. నేను, మన ఎదురింటి మోహన్ ప్రేమించుకొన్నాము. మా ప్రేమ విషయం మీ యిద్దరికీ తెలిసినా కూడా తెలియనట్లు ఊరుకొన్నారన్న సంగతి నాకు తెలుసు. ఆడపావురాన్ని ఎరవేసి, మగపావురాన్ని ఆకర్షించే విధంగా నన్ను మోహన్‌కు ఎరవేసి పైసా ఖర్చు లేకుండా పెళ్ళి చేయాలనుకున్నారు మీరు.

కానీ ఒక్కొక్కసారి ఆ మగపావురం బలమైన ఆకర్షణలో, ఆడపావురం దాన్తోపాటు వెళ్ళిపోతుంది. ఆ విషయం బహుశా మీరు మరచినట్టున్నారు. మోహన్ తన కాళ్ళమీద నిలబడేవరకు పనికి వస్తాయని, వదిన గాజులు, నెక్లెస్, అమ్మ యిచ్చిన నా నగలు, పెట్టెలోని అయిదు వందలు తోడుగా పట్టుకెళుతున్నాను. క్షమిస్తారు కదూ!

సదా మీ ఆశీస్సులు కోరే

మీ

సరోజ.

సూర్యారావు ముఖాన నెత్తురు చుక్కలేదు. ఆడపావురం ఎంత పనిచేసింది? తమ పుట్టింటివారిచ్చిన నగలను పట్టుకు పోయిన ఆడబిడ్డను తల్చుకొని గొల్లుమంది సుశీల.

—కోనె హరిబాబు, హైద్రాబాదు-4.

---

